# రాజపోషకులు

మ. రా. శ్రీ శ్రీరాజా వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మ జగపతి బహద్దరు జమీందారిణీవారు, తుని.

## పోషకులు



మ. రా. రా. శ్రీ దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, కాకినాడ.

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపురము.

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ ద్రోణంరాజు వేంకటరమణారావు పంతులుగారు, మొఖాసాదారు, తణుకు.

శ్రీ సారంగు సోమసుందరరావు పంతులుగారు, బి, ఎ, ప్లీడరు, నరసాపురము.

,, శ్రీ మల్లెల శివరామకృష్ణయ్యగారు, ప్రొప్రయిటరు, రాయపూడి.

,, శ్రీ బందా సూర్యనారాయణ పంతులుగారు బి. ఏ. యల్. టి తణుకు.

,, శ్రీ పండ్రాజు వీర్రాజుగారు, కాకినాడ.

,, శ్రీ కొవ్వూరి వేంకటరెడ్డి సోదరులు, పిట్టలవేమవరం.

,, శ్రీ కర్రి వల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ చేతల గంగిరెడ్డిసోదరులు, పెనుగొండ.

# పోషకులు.



మ. రా. శ్రీ దివాన్‌బహద్దర్ పి. పరాంకుశంనాయుడుగారు,
రిటైర్డుస్పెషల్ పోలీసుకమీషనరువారు. చెన్నపురి.
,, శ్రీ అర్జి వెంటయ్యగారు, నరసాపురం.
,, శ్రీ టి. యల్. నరసింహారావుగారు, మూరుటేరు.
,, శ్రీ రామదేవు ఆదినారాయణగారు, మూరుటేరు.
,, శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.
,, శ్రీ పులగం వేంకన్నగారు, మూరుటేరు.

---

# సహాయులు.



మ. రా. రా. శ్రీఉదయరాజా వేంకటరంగారావు పంతులుగారు, దేశ
ముఖ్ నక్ దేశపాండ్యా మటేవాడ, ఒరంగల్లు (దక్కన్)
,, శ్రీనేరెళ్ళ నరసింహారాములుగారు, కలపవర్తకులు,
ఒరంగల్లు, (దక్కన్)
,, శ్రీయాదగిరీశ అండు కంపెనీవారు, పుస్తకములవర్తకులు,
ఒరంగల్లు, (దక్కన్)
,, శ్రీగుండా పుల్లయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు, (దక్కన్)
,, శ్రీద్వారంపూడి వేంకటరెడ్డిగారు, అనపర్తి.
,, శ్రీపాళ్యపు వేంకటాచలపండితులుగారు, ప్రొప్రయిటరు,
శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.
,, శ్రీపింజల సుబ్రహ్మణ్యంచెట్టిగారు, వర్తకులు, నెం 91.
అన్నపిళ్ళెవీథి, జి. టి. మదరాసు.



నుండియు స్వధర్మమును నిర్వహించుకొనుచున్న యీగ్రంథనిలయమునకు సత్క్రియాఫలదాయకుఁ డగుసర్వేశ్వరుఁ డనుస్థిరం బగుసదాశ్రేయముం బ్రసాదించుఁగాత.

ఈగ్రంథనిలయమును గాకినాడనుండి యిక్కడకు మార్చుటకారణంబుగా నీగ్రంథమును సకాలమునకుఁ బ్రకటించి మాచందాదారుల కందింపఁజాలకపోయితిమి. కాని యింతటినుండి యిట్టివ్యత్యాసములు గలుగకుండఁ గ్రమముగా గ్రంథప్రకటనము జరగునట్టి యేర్పాటులను జేసికొని యున్నారము. ఈనవల విశేషించి చరిత్రాత్మకమైనది. దీనిప్రాశస్త్యముం గూర్చి యవతారికలో విపులముగాఁ జర్చింపఁబడినది. ఇది చాలఁ బెద్దదియగుటచే రెండుసంపుటములుగా విడఁదీసి యీప్రథమసంపుటము నిప్పుడు ప్రకటించితిమి. దీనివెనుకనే రెండుమాసములలో రెండవసంపుటమునుగూడ మాచందాదారులకుఁ బంపఁగలము. మాగ్రంథనిలయమందును మాయందును గలయభిమానముచే మాకీగ్రంథమును మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరించి సర్వస్వాతంత్ర్యములతో నొసంగిన మ. రా. రా. శ్రీహసబ్నీసు వాసుదేవరావుగారికి మాకృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాము.

ఉదారహృదయులును భాషాపోషకులు నగుప్రభువులును మామహారాజ రాజపోషకులును, పోషకులును, సహాయులును, చందాదారులును, దేశభాషాభిమానులగు నాంధ్రమహాజనులెల్లరును మాభాషాసేవను మన్నించి యెల్లవిధముల మాకితోధిక సాహాయ్యప్రోత్సాహములం గూర్పవలయునని వేఁడుకొనుచున్నాము.

వేంకట పార్వతీశ్వరకవులు.

ముకొనుచున్న యీగ్రంథనిలయ
నసర్వేశ్వరుఁడనుస్థిరం బగుసదా

డనుండి యిక్కడకు మార్పుల
మునకుఁ బ్రకటించి మాచందా
గాని యింతటినుండి యిట్టివ్యత్యా
గ్రంథప్రకటనము జరగునట్టి యే
ఈనవల విశేషించి చరిత్రాత్మక
వతారికలో విపులముగాఁ జర్చిం
చే రెండుసంపుటములుగా విడఁ
ప్రకటించితిమి. దీనివెనుక నే
యనుగూడ మాచందాదారులకుఁ
కుచు మాయందును గలయభి
రాష్ట్రభాషనుండి యాంధ్రీకరిం
మ. రా. రా. శ్రీహానబ్నీసు
వందనముల నర్పించుచున్నాము.
పోషకులు గుప్రభువులును
షకులును, సహాయులును, జం
నాంధ్రమహా జనులెల్లరును
ముల మాకితోధికసాహాయ్యప్రో
కొనుచున్నాము.
కట పార్వతీశ్వరకవులు.

# అవతారిక.



శ్రీయుతులగు రఖాలదాస బెనర్జి యమ్. యే గారు మా ఆంధ్ర పాఠకులకు నూతనపరిచితులు. ఈతని కావ్యములలోఁ బ్రథమాంధ్ర కృతగ్రంథమిదియే. ఈతఁడు పురాణేతిహాసపరిశోధకులలో నగ్రగణ్యుఁడని చెప్పవచ్చును. మహారాష్ట్ర దేశమున డాక్టర్. సర్. రామకృష్ణ భాండార్కరు గారును, వంగదేశమున శ్రీయుత మహామహోపాధ్యాయహరప్రసాద శాస్త్రిగారును దక్క పేరుపొందినవారితో సమానులింకొకరు లేరనుట యతిశయోక్తి గాదు. ఇక్కడి యాంధ్రలోకమునకు నూతనుఁడే యైనను వంగదేశము మహావిద్వాంసుఁడనియుఁ బండిత శిరోమణియనియు ప్రఖ్యాతిం గాంచినవాఁడే. ఈవిఖ్యాతలేఖకుఁడు వంగభాషలో "పాషాణకథ" "వంగేతిహాసము" మున్నగు నితిహాసములను రచించియున్నారు. అవి యీవిద్వాంసుని సామర్థ్యమును వేనోళ్ళఁ జాటుచున్నవి.

తరువాతఁ గొంతకాలమున కీతఁడు "శశాంకము" అను చరిత్రాత్మకం బగు నవలను రచించెను. దీనిఁ బ్రచురించినప్పుడు కొందఱువిమర్శకు లీనవలను నిందించియుండిరి—ఈతనిగ్రంథము లన్నియు నితిహాసములే. తామ్రశిలాశాసనాదులే వాని కాధారములు. ఈతఁడు నిరంతరమును శాసనసంశోధనమునందు నిమగ్నుఁడై నూతనవిషయములను గ్రహించి ప్రాచీన దేశచరిత్రములను, తత్సంబంధవిషయములను పుస్తకరూపమునను, మాసపత్రికారూపమునను బ్రకటించుచుండెను.

ఈతఁడు దుర్గమంబును, సంకటమయంబును, సంశయదాయకంబును నగు పురాణేతిహాసారణ్యాంధకారమార్గమును వీడి సుకరం

బును, సుఖకరంబును, సుందరంబును, సుమనోజ్ఞంబును నగుకథాలేఖ నోద్యానమునం బ్రవేశించుటచేతనే విమర్శకులీతని నధిక్షేపించిరి.

వారికిఁ బ్రత్యుత్తరముగా నిక్కవిచంద్రుఁడు "నేను భారతీయ ప్రాచీనేతిహాసములను, వానితో సంబంధించిన యైతిహాసిక సత్యములను జనసామాన్యమునఁ బ్రచారము గావింపవలయుననుకుతూహలమునఁ "పాషాణకథ" మున్నగు నితిహాసములను బ్రకటించి యుంటిని. పండితులు వాని నభినందించినను సామాన్యజనసమాజమున కవి దుర్గ్రాహ్యంబు లగుటం జేసి నాయుద్దేశము విఫలమైపోయెను. కావునఁ జరిత్రవిషయములను కథారూపమున రచించి ప్రకటించినచో సామాన్యజనబోధకంబులు గాఁగలవని తలంచి "శశాంకము" అను నీగ్రంథమును రచించి ప్రకటించితిని. ఇదిగాక యీచరిత్రమును కథారూపమునఁ బ్రకటించుటకు నాకింకొక యుద్దేశముగూడ నున్నది. చరిత్రసంబంధము లెంతమాత్రమును జెడకుండ మఱికొన్ని విషయములను గల్పించి కథాలేఖనముం గావించుట సులభసాధ్యమగునా కాదా యని నన్ను నేను పరీక్షించుకొనుటకే యీగ్రంథమును వ్రాసియుంటిని" అని వ్రాసియుండెను.

నిజమే! ఐతిహాసికవిషయములకు భంగము గలుగకుండఁ గథారచనముం గావించుట సులభసాధ్యమా? అత్యసాధ్యకార్యము నిమ్మహాకవి సాధించిన ట్లీగ్రంథము వేయినోళ్ళఁ జాటుచున్నది. చరిత్రవిషయములంగూర్చి నవలలను రచించువారి కీగ్రంథ మాదర్శముగా నుండఁగలదని నాదృఢవిశ్వాసము. ఐతిహాసికంబు లగునవలల నెన్నిటినో నేననేకభాషలయందుఁ జదివి యున్నాఁడను. కాని, దీనింబోలినది యింకొకటి లేదనియే నేను ఘంటాపథముగాఁ జెప్పఁగలను.

అనుభవైకవేద్యం బగునిక్కవీంద్రుని ప్రత్యుత్తరమును లలిత వాఙ్మయంబునకు వంకలుదిద్దఁజాలుచుండు లబ్ధప్రతిష్ఠులు నిరంతరము

ను జ్ఞప్తియం దుంచుకొందురుగాక! ఈసందర్భమున "సర్ వాల్టర్ బెశాంటు"దొరగారు నుడివినవాక్యముల నీక్రిందఁ బొందుపఱచుట యప్రస్తుతము కాదనుకొని యెదను.

"Between Russia in the East and California in the west, it is the novelist who teaches. He is the fount of inspiration; he gives the world ideas; he makes them intelligently. Sometimes, in rare cases, he so touches the very depths of his people, that his words reverberate and echo as from rock to rock and from valley to valley, far beyond the ear of him who listens. In these cases he makes his song, because he makes History to be read."

ఈనవలయందలి ముఖ్యసంఘటనము లన్నియు నైతిహాసికములే. ఇందలి శశాంకుఁడు, అనంతవర్మ, భాస్కరవర్మ, ప్రభాకరవర్ధనుఁడు, రాజ్యవర్ధనుఁడు, హర్షవర్ధనుఁడు మున్నగువా రైతిహాసికపురుషులు. ఆకాలమున బౌద్ధమత మీదేశమునుండి బొత్తుగాఁ దొలఁగి పోకున్నను పాటలీపుత్రము మొదలగు నగరములలో మాత్రము దాని ప్రచార మంతగా లేదు. ఆస్థితిం గాంచి కొందఱుబౌద్ధనేతలు స్వధర్మము నెల్లెడల వ్యాపింపఁజేయు నుద్దేశముతో ధర్మోద్ధారంబును సరళంబు నగునీతిమార్గమును ద్యజించి, కుటిలదుష్టధూర్తమార్గముల నవలంబించి మతవిరుద్ధం బగుమగధరాజ్యము నెట్లయిన విధ్వస్తముం గావించుటకై యెడతెగనిప్రయత్నములం జేయఁదొడంగిరి. ఇట్టిదురవస్థలో సామ్రాజ్యహితచింతకు లగునమాత్యసామంతాదు లెట్లు పరాక్రమించి స్వార్థత్యాగముం గావించిరో యీనవలయందు సుందరంబుగను, మనోహరంబుగను, స్పష్టంబుగను శ్రీరఖాలబాబు రచించి యున్నాఁడు.

యువరాజశశాంకుఁ డైతిహాసికపురుషుఁడు. ఈతఁడు క్రీస్తుశక మేడవశతాబ్దియందు గౌడమగధదేశములకుఁ జక్రవర్తియై యుండెను. ప్రాచీనేతిహాసలేఖకు లీతనివిషయమున ననేకనిందావాక్యముల నుప

ఉపయోగించియున్నారు. సంస్కృతవాఙ్మయపంచాననుఁడగు బాణభట్టు హర్షచరితమున వ్రాసినవిషయములును, దత్కాలీనుఁడగు చీనాదేశ యాత్రికుఁడు హూయనుత్సాంగువ్రాసిన ప్రవాసవృత్తాంతములును మాత్రమే ప్రాచీనచరిత్రకారుల కాధారములైయున్నవి. బాణభట్టు హూయనుత్సాంగులేగాక ప్రాచీనేతిహాసలేఖకుఁడగు విన్సెంటుస్మిత్తు దొరగారుకూడ శశాంకచరిత్రము ననేకనిందాగర్భితవాక్యములచే నిందించియున్నారు. శశాంకుఁడు విశ్వాసఘాతుకుఁడై హర్షవర్ధనుని సోదరుఁడగు రాజ్యవర్ధనుని వధించెననియు, బుద్ధగయయందలి బోధి వృక్షము నున్మూలించెననియు, పాటలీపుత్రమునందలి బుద్ధదేవుని పదచిహ్నములను నాశనము చేసెననియు, బౌద్ధమఠములను, సంఘా రామములను ధ్వంసము చేసెననియు, బౌద్ధభిక్షులను దేశవిదేశములకుఁ బాఱఁద్రోలెననియు నిట్లు ప్రాచీనేతిహాసకులాతనిపై ననేకనిందల నారోపించియున్నారు. కాని శ్రీరఖాలబాబుమాత్రము బాగుగఁ బరిశీలించి శశాంకునిపై మోపిననిందలన్నిటిని సహేతుకముగఁ దొలఁగించి ప్రాచీనులచేఁ గళంకితముగాఁ జేయఁబడిన యాతనిచరిత్రమును రమణీయముగ, సర్వాంగసుందరముగ, సకలజనాభిరామముగఁ బ్రదర్శించియున్నాఁడు!

ఇఁక నీవిషయమునఁ బ్రాచీనేతిహాసలేఖకుల వ్రాఁతలయందలి సత్యాసత్యముల సంభవాసంభవములంగూర్చి యాలోచింతము.

మహాకవి బాణభట్టు—ఇతఁడు తత్కాలపువాఁడే—కాని శశాంకుని పరమశత్రుఁడగు హర్షవర్ధను నాశ్రయించినకవి—అట్టివాఁడు తన కాశ్రయదాత యగు హర్షవర్ధనుని భూషించుటయు, నతనివైరి యగుశశాంకుని దూషించుటయు స్వభావమే కాదా? కావున, నిక్కని శశాంకునింగూర్చి కావించిననిందలన్నియు నెంతవఱకు సత్యములైయుండునో చదువరులే యూహింపవచ్చును.

హాయనుత్సాంగు—ఇతఁడు విదేశీయుఁడు; సరళస్వభావుఁడు; ధర్మనిష్ఠుఁడు—కాని, మగధరాజ్యమును మంచి గుఱుతవలయునని మహాప్రయత్నములం గావించుచున్న బౌద్ధభిక్షుల వాక్యములపై నితఁడు విశ్వాసముంచెను. ఆతని కేమి తెలియును? వారు చెప్పినదంతయు నిజమని యే యాతఁడు భావించెను. తనప్రవాసవృత్తాంతమునం దాతఁడు వారు చెప్పినమాటలనే లిఖియించెను. అవియే తరువాతియితిహాసలేఖకుల కాధారము లైనవి.

విన్సెంటుస్మిత్తు—ఇతఁడు సమకాలీనుఁడు గాఁడు. కాఁ పురాణేతిహాసపరిశోధకుఁడే—విదేశీయుఁడు. ఇతఁడు బాణవిరచితంబగు "హర్ష చరితము" ను, హాయనుత్సాంగువ్రాసిన "ప్రవాసవృత్తాంతము" ను నాధారముచేసికొని వ్రాసినవాఁడు.

శ్రీ బాబు రఖాలదాసు బెనర్జి—ఇప్పటివాఁడు. పురాణేతిహాససంశోధకుఁడు. విన్సెంటుస్మిత్తుదొరగారిచరిత్రపుస్తకమునకుఁ దరువాతఁ బలుతావులం దొరకిన తామ్రశిలాశాసనాదుల నాధారముగాఁ జేసికొని వ్రాసినవాఁడు. మనోహరకావ్యకర్మంబులచేఁ బురాణేతిహాససంశోధనకార్యంబున నిమగ్నుఁడు; తల్లీనుఁడు; తన్మయుఁడు; వంగదేశీయుఁడు—ప్రస్తుతకథాలేఖకుఁడు; ఈనవలారచనమునందుఁ దామ్రశిలాశాసనాదులే యాధారములుగాఁ గలవాఁడు.

కావున నిందలి సత్యాసత్యములను బాఠకులే నిర్ణయించుకొందురుగాక! అయినను తామ్రశిలాశాసనాదిపరిశీలనముచేసి పూర్వులమార్గము ననుసరింపక సత్యమునే యాధారముగఁ జేసికొని శ్రీ రఖాలబాబు వ్రాసినయంశములు సమంజసములు కాకపోవని మాపాఠకులకు సూచించుచున్నాను.

"ఇది నిరపేక్షబుద్ధితో వ్రాసినయితిహాసము గాదు." అని శ్రీ బాబుగా రనియున్నారు. కాని, దీనిం జదువునప్పుడు ప్రాచీనగుప్త

వంశచరిత్రమునే — ఇతిహాసమునే చదువుచున్నట్లు పాఠకులకుఁ దోఁచకమానదు. ఈనవలలో సప్తమశతాబ్దియందలి భారతరాజకీయ సాంఘిక ధార్మికస్థితుల చిత్రములు మిగులనిపుణముగా, స్పష్టముగా మనోహరముగాఁ బ్రదర్శింపఁబడినవి.

వంగభాషలో నీగ్రంథ మానేకులచేఁ గీర్తింపఁబడినది. అట్లే దీని మహారాష్ట్రభాషాంతరీకరణముగూడ నధికజనమనోరంజకమై విలసిల్లుచున్నది. శ్రీయుత విడల సీతారామగుర్జరుగారు దీనిని మహారాష్ట్రభాషకుఁ దమయనర్గళసులభమధురశైలిచేఁ బరివర్తితము గావించియున్నారు. అక్కవిపుంగవుని మహారాష్ట్రగ్రంథము ననుసరించియే నేను దీని నాంధ్రీకరించియున్నాను.

నాయీయుద్యమ మాంధ్రమహాజనుల యాదరమునకుఁ బాత్రమగుఁగాక! తన్మూలమున నిట్టింకను ననేకగ్రంథము లాంధ్రలోకమునకీయ నాకుఁ బ్రోత్సాహము గలుగుఁగాక!!

సత్తెనపల్లి
21-11-16

ఇట్లు
వాసుదేవరావు.

శ్రీరామచంద్ర

శశాంక

# నరేంద్రగుప్తుడు

## ప్రథమఖండము



### మొదటిప్రకరణము



పదిపండ్రెండువందలసంవత్సరములకుఁ బూర్వము పాటలీపుత్ర నగరమునకుఁ గ్రిందివైపున శోణనదీజలప్రవాహము భాగీరథీనదితోఁ గలసి పోవుచుండెను. ఆశోణనదీసంగమతీరముపై నతివిస్తీర్ణంబును శిలావినిర్మితంబును నగు నొక పురాతనభవన ముండెను. అనేకశత సంవత్సరములకుఁ బూర్వము శోణనదీప్రవాహగతి తిరిగిపోయినప్పు డాశిథిలభవనమున మిగిలియుండినకొంతభాగముకూడ గంగాజలములఁ గలసిపోయెను.

అది వర్షాకాల ప్రారంభసమయము. సాయంకాలమునకుఁ గొంచెముపూర్వమున శోణనదీసమీపముననున్న రాజభవనము నందలి వాతాయనము చెంత నొకబాలుఁడు, నొకవృద్ధుఁడును నిలిచి యుండిరి. ఆబాలుఁడు గౌరవర్ణుఁడు. ఆతనికుంతలములు కేతకీమిశ్రి తారుణవర్ణము కలిగి యతిదీర్ఘములై యాతనివెన్నును ముద్దిడుకొను చుండెను. ఆసాయంశీతలమారుత మాబాలుని కేశకలాపముతోఁ గ్రీడించుచుండెను.

బాలుని వెంత నిలిచియున్న వృద్ధునిం గనిన నాతఁడొక యోధుఁడై యుండఁబోలు నని సహజముగనే తోఁపక మానదు. ఆతనిశిరోజములు రౌప్యవర్ణములై దీర్ఘములై యుండెను. ఆతఁడు నీలిరంగు తలరుమాలును దలకుఁ జుట్టుకొనియుండెను. ఆజానుబాహుండును, సమున్నతదేహుండు నగునాతనిశరీరము మాంసలంబును, సుదృఢంబును, సుందరంబునై యున్నను సాధారణముగా వస్త్రవిహీనంబై యుండెను. ఆతని కటిప్రదేశమమాత్ర మొకమలినవసనముచే నాచ్ఛాదితమై యుండెను. ఆవృద్ధుఁడు చేత నొక భల్లమును దాల్చి మౌనముతో నాబాలకునివెంత నిలిచి యుండెను.

పాటలీపుత్రనగరమునకుఁ గ్రిందివైపున శోణనదీమిలితప్రవాహము గంగాప్రవాహమునఁ బడుచుండుటచే గెరలు తరంగముల నుండి తుషారములు వెల్లుగ నుదయించి నలుగెలంకుల నెగసిపడుచుండెను. వర్షజలసమ్మేళనమున ఫేనయుక్తమును నత్యగాధము నగు గంగాజలౌఘము త్వరితగమనమున సాగరమువంకకుఁ బరుగు వాఱుచుండెను. రాజభవనవాతాయనముకడ నిలిచియున్న బాలకుఁడేకాగ్రదృష్టితో నాజలప్రవాహమును గనుంగొనుచుండెను. పడమటిదెసనుండి బయలువెడలిన నౌకలు మెల్లమెల్లగఁ దీరమునకే వచ్చుచుండెను. ఆశోణాసంగమస్థానమునఁ దీరద్వయమునందును నెన్నియో నౌకలు గుంపులుగుంపులుగఁ జేరియుండెను. కాని, సాయంకాలమగుచుండుటచే సంక్షుభితంబగుచున్న యాజలప్రవాహమునఁ దమనౌకల నడపించుటకు నావికులకు సాహసము కలుగదయ్యెను. ఆ బాలకునికడ నిలిచియున్న వృద్ధునిదృష్టి తీరమునకుఁ జేరుకొనుచున్న యానౌకలవంకకే ప్రసరించుచుండెను.

అప్పుడు భాగీరథీప్రవాహసందర్శనము సేయుచున్న బాలకుఁడు మెల్లఁగా "దాదా!" అనిపిలిచెను.

వృద్ధు—ఏమి కుమారా!

బాల—ఈనావ లేడినయెడల నావలికిఁ బోవా?

వృద్ధు—పోవు కుమారా! అంధకారభీతిచే నావికులు నౌకలను దీరమునకే మరలించుచున్నారు.

బాలకుఁడు జెప్పవడియెను. ఆతఁడు తటాలునఁ గిటికీయొద్దనుండి వెనుదిరిగి కచేరిచావడిలోని కరిగెను. ఆవృద్ధసైనికుఁడుగూడ నాతని వెనువెంటనే మెల్ల మెల్లగ నక్కడకే పోయెను.

ఆసమయమున నంధకారము నలుదెసల దట్టముగఁ గ్రమ్ముకొనుచుండెను. గోదావరిసంగమము ఘూనకవర్ణపటముచే మూసివేయఁబడినట్లుండెను. దూరమున నదీతీరమున లంగరువేయఁబడిన నావలలో మినుకుమినుకుమనుచున్న చిన్న చిన్నదివ్వెలు మిణుఁగురు బురువులవలె భాసిల్లుచుండెను.

కచేరిచావడిలో కాష్ఠస్తంభముపై నొకపెద్దదీపము వెలుఁగుచు నలువంకలఁ బ్రకాశమును, సుగంధమును వ్యాపింపఁజేయుచుండెను. ఆచావడిలో నున్న ప్రతివస్తువు నమూల్యమును నపూర్వము నై యుండెను. స్ఫటికశిలా వినిర్మితంబులును, హిమతుషారసమశ్వేతంబులు నగుచు చ్చటికుడ్యములయందు నానావిధంబులగు శస్త్రాస్త్రములు వ్రేలాడుచుండెను. దీపము వెలుఁగుచున్న కాష్ఠస్తంభమున కిరువంకలను గజదంతవినిర్మితంబులగు రెండుమంచములు గలవు. వానిపైఁ దెల్లనివస్త్రములచేఁ బఱువఁబడిన కోమలశయ్యలుండెను. ఆమంచములలో నొకదానిపై మధ్యమాకృతి గలసువర్ణదండ మొకటుండెను. ఆరెండుమంచములకును నడుమఁగలనేల శుభ్రవసనముచే నాచ్ఛాదితమైయుండెను.

సభాభవనమున కరుదెంచినతోడనే యాబాలకుఁడు నేలపై బఱచియున్న గద్దియపై నాసీనుఁ డయ్యెను. ఆవృద్ధసైనికుఁడు దూర

మున—ఆగద్దెకొకమూల నాసీనుఁడై యుండెను. గద్దెపైఁగూర్చుండి యున్న యాబాలకుఁడు కొంతసేపటివఱకు నేమియు మాటాడలేదు. అనంతరము బాల్యోచితంబగుచాపల్యముతో నాతఁడాసనమునుండి లేచి మంచమును సమీపించి యాసువర్ణదండమును దనహస్తముతో నెత్తుకొనియెను.

బాలుఁడాస్వర్ణదండమును గేలం గీలించుట చూచినతోడనే వృద్ధునకుఁ గళవళ ముదయించెను. ఆతఁడు లేచి బాలుని సమీపించి "ఆఁ! ఆఁ! కుమారజీ! దానిని ముట్టవలదు. ఈసంగతి విన్నచో మహారాజుగారాగ్రహించెదరు" అనియెను.

బాలు—(నవ్వుచు) నేనిప్పుడు సముద్రగుప్తులధ్వజము ననాయాసముగా నెత్తఁగలిగితిని. క్రిందఁ బడవైచెదనేమో యనుకొంటివా?

అనుచు నాతఁడాయైదడుగులయెత్తుగలబరువైనసువర్ణదండమును నవలీలగాఁ బైకెత్తెను.

అది యంతయుం గాంచి యాముసలి మందహాసము సేయుచు 'కుమారా! అశ్వారూఢుఁడవై యీగరుడధ్వజమును గరమునం దాల్చి నీవు కదనరంగమున కరుగునట్టి దివసముకూడ మును రాఁగలదు" అనియెను.

కాని యీవాక్యము లా బాలకునివీనుల కందవయ్యెను. ఆతఁడాస్వర్ణదండము నేకాగ్రదృష్టితోఁ దిలకించుచుండెను. ఆదండముపై నందం దనేకవిధములగు నగిషీపనులు చేయఁబడియుండెను. అనఘము రత్నములుకూడఁ జెక్కఁబడియుండెను. ఆయక్షరములను జదువులకై బాలుఁడు ప్రయత్నించుచుండెను. ఆదండశిరోభాగమున సుందరతరమును, మనోమోహనకరము నగు నొకగరుడవిగ్రహము సమకూర్పఁబడి యుండెను. ఆమనోహరవిగ్రహ మాగోడలపై

వ్రేలాడుచున్న శస్త్రాస్త్రసమూహములో నానావిధాకృతులతోడను. వివిధవర్ణములతోడను బ్రతిబింబిత మగుచుం జూపులకెంతయు ముచ్చటగా నుండెను.

అప్పుడు బాలుడు వృద్ధునివంక దృష్టినిగుడించి "తాతా! నాకుం జక్కగాం జదువ వచ్చును. ఇటు చూడుము! ఈధ్వజముపై నెవ్వియో నామములు వ్రాయంబడి యున్నవి. ఇవి యన్నియు నార్యసముద్రగుప్తులే వ్రాసినారా?" అనియెను.

వృద్ధ—గరుడధ్వజముపై నేమైన వ్రాయంబడి యున్నదని నే నెప్పుడును వినియుండలేదు.

అందుపై నాబాలకుం డేమియో పలుక నుద్యుక్తుం డయ్యెను గాని యాతనినోటినుండి మాట వెడలుటకు ముందుగనే యొకబాలిక తూనీగవలెం బరుగిడుచు వచ్చి యాబాలునికంఠమును గౌగిలించుకొని నగుచు "కుమారజీ! మాధవుండు నన్నుం బెండ్లియాడెద ననుచున్నాండు అందుచే నేనిక్కడకుం బరుగెత్తుకొని వచ్చితిని. అదెగో! చూడుము! నన్నుం బట్టుకొనుటకై యతం డిక్కడకే వచ్చుచున్నాండు." అని చెప్పుచు నాబాలిక కుమారుని దృఢాలింగన మొనర్చుకొని యాతని వక్షస్స్థలంబున డాంగం బ్రయత్నించుచుండెను. అది గని యాకుమారుండును వృద్ధసైనికుండును, ముక్తకంఠములతో నవ్వంజొచ్చిరి; వారిహాస మాపురాతనశిలాభవనమందలి ప్రతికుడ్యమునందును ప్రతిధ్వనితమై యెల్లకడలం బరివ్యాప్తమైపోయెను.

అట్టిసమయమున రెండవబాలుం డతివేగముగం బరుగెత్తి వచ్చుచు వారిహాసధ్వని చెవి సోకుటయు నివ్వెఱపడి తటాలున ద్వారముకడ నాశ్చర్యముతో నిలువంబడిపోయెను. బాలిక "కుమారజీ!" అని సంబోధించిన మొదటిబాలకునిం గాంచి యాతండు తెల్లవడిపోయెను. ఆతనిరూపముగూడ మారిపోయెను. అది మొదటిబాలునకు గోచరము

కాకపోలేను. అందుచే నాతఁడు మరల నవ్వెను. రెండవబాలకుఁ డతిత్వరితముగ నాద్వారమువంకకుఁ బోవుచుండెను. బాలిక యప్పటికిని దనయుభయదాదివక్షోభాగమునఁ దనముఖకమలమును దాఁచికొనియే యుండెను.

ఈద్వితీయబాలకుఁ డశక్తాంగుఁడును, వామనుఁడు నైయుండెను; చామనచాయమేనివాఁడు. అతని గాంచిన నైదేండ్లకంటె నెక్కుడు వయ సుండదనియే తోఁచును. కాని యాతఁడు పదియేండ్లకంటె నెక్కువవయసుగలవాఁడే. ఆబాలికామూర్తి యత్యంతనిరతిశయసుందర మైనది. ఆమె కెనిమిదేండ్లవయసుకంటె నధికము లేదు. ఆమె సుకుమారశరీరము సువర్ణమువలెఁ గాంతిమంతమై యుండెను; అవయవము లన్నియును బరిపుష్టములై సుందరములై యుండెను. అయినను నామెను గృశాంగియనియే చెప్పవలసియుండెను. ఆబాలికమస్తకము నలంకరించిన కుంతలకలాపము సుశ్యామలమై, సునిర్మలమై, సుదీర్ఘమైయుండెను.

అప్పుడు ప్రథమబాలకుఁడు ద్వితీయునిం గాంచి "మాధవా! నీవు చిత్రను బెండ్లియాడెద నంటివా? ఆమె తనపతిని జాలకాలము క్రిందటనే యేర్పఱచుకొని యున్నదిగదా!" అనియెను.

మాధ—(తలవంచుకొని యస్పష్టస్వరముతో) నేను నల్లనివాఁడ నని చిత్ర నన్నసహ్యించుకొనుచున్నది. ఎంతనల్లనివాఁడ నైనను నేను రాజపుత్రుఁడనే గదా!

వృద్ధు—మాధవా! సుందరి యొకతె కన్నులఁ బడినంతనే యామెను బెండ్లియాడుటయే నిశ్చయమైనట్లు తోఁచుచున్నది.

ఈమాట విని ప్రథమబాలకుఁడు బిగ్గరగ నవ్వుట కారంభించెను. అది మాధవునిహృదయమర్మమును దాఁకినట్లుండెను. అంత నాతఁడు విషణ్ణహృదయుఁడై మెల్ల మెల్లగ నచ్చోటు వాసిపోయెను.

సప్తమశతాబ్దాంత్యభాగమున గుప్తవంశసంభవుండైన మహాసేనగుప్తుండు మగధదేశమును బరిపాలించుచుండెను. ఆసమయమునం బ్రాచీనగుప్తసామ్రాజ్యగౌరవసూర్యుం డస్తాచలమున కేగుచుండెను. సముద్రగుప్తునివంశజుం డగునితం డప్పుడు సార్వభౌమపదము నధిష్ఠించి మగధవంగదేశములను బరిపాలించుచుండుట నిజమే యైనను సామ్రాజ్యమునందలి పలుభాగము లాకాలమున సన్యాక్రాంతములై యుండెను. ఆర్యావర్తమునందలి మౌఖరీరాజులు తమరాజ్యమును నిష్కంటకముగం జేసికొని స్వతంత్రప్రభావమును స్థాపించుకొని యుండిరి. స్థానేశ్వరవైశ్యరాజవంశమువారు మెల్లమెల్లగ బ్రహ్మావర్తపంచనదదేశములలోం దమయధికారమును విస్తరిల్లం జేసికొనుచుండిరి. కామరూపదేశ మంతకు బహుకాలముక్రిందటనే తనస్వాతంత్ర్యమును సుప్రతిష్ఠితముగం జేసికొని యుండెను. వంగదేశమును, సమతటదేశమును, నొక్కొక్కవేళ సామ్రాజ్యమున కధీనమై యున్నట్లుండుటయేగాని సమయమువచ్చినప్పు డింతకంతయు సందేహింపక కప్పము చెల్లించుటకుం దిరుగఁబడుచుండెను.

కడపటిచక్రవర్తి యగుమహాసేనగుప్తుండు కూడ సామ్రాజ్యమునకుం బురాతన రాజధాని యగుపాటలీపుత్రనగరముననే నివసించి యుండెను. భరతఖండమున సుప్రసిద్ధ మగుప్రాచీనరాజధాని యాకాలమునం దంత్యావస్థలో నుండెను. అప్పటికప్పుడే యాసుందరనగరము నాశనమగుటకు బ్రారంభించి యుండెను. ఆసమయమునకు సరిగం గన్యాకుబ్జగౌరవారుణమండలము క్రమక్రమముగ నుదయించుట కారంభించెను. అనంతరమున బూర్వపుమగధరాజధాని మఱి యెన్నటికిని భరతఖండమునకు రాజధాని కాదయ్యెను. మఱిజీర్ణమై పోవుటకు సంసిద్ధమైయున్న రాజధాని యగు నాపాటలీపుత్రనగరము నందే గుప్తవంశప్రభువులు నివసించియుండి రాజాధికారమును నెఱపు

కొనుచుండిరి. అయినను సమీపస్థు లగురాజులభయమువలన వారెల్ల కాలమును శంకాకులహృదయములతోనే యుండవలసి యుండెను. కుమారగుప్తుఁడును దామోదరగుప్తుఁడును దమశక్తి కొలఁది ననేకప్రయత్నములం గావించి మౌఖరీరాజులకు వశము గాకుండ నాత్మరక్షణముం జేసికొని యుండిరి. పిమ్మట నతిస్వల్ప కాలములోనే మహాసేనగుప్తుని భాగినేయుఁ డగుప్రభాకరవర్ధనుఁడు మౌఖరీరాజవంశమును నిర్మూలనమొనరించియుఁ, బశ్చిమదేశమున హూణులను బరాజితులం గావించియు నుత్తరదేశమునకు రాజై మహాబలాఢ్యుఁడై, ప్రతాపశాలి యయ్యెను. కాని యిప్పటివఱకు నాతని మేనమామవంశమునందే సార్వభౌమబిరుదము విఖ్యాతివహించి యుండెను. పాటలీపుత్రసార్వభౌముఁ డగుమహాసేనగుప్తుఁడు తన మేనల్లుఁ డగు ప్రభాకరవర్ధనునివలనిభయముచే నెల్లవేళలఁ జింతాకులుఁడై యుండెను. ప్రభాకరునవంతరమునం దుత్తరదేశమునందలిగుప్తవంశాధికారము తప్పక నామమాత్రావశేష మై పోవు నని మహాసేనగుప్తుఁడు నిరంతరమును భావించుకొని చింతించుచుండెను.

మహాసేనగుప్తచక్రవర్తి కిరువురుపుత్రులుండిరి. ఈప్రకరణప్రారంభమున శోణనదీప్రవాహమునందలితరంగావళిని ముగ్ధనయనములతోఁ దిలకించుచు మనకుం గానఁబడిన యాబాలకుఁడే మహాసేనగుప్తుని జ్యేష్ఠకుమారుఁడు. ఆతఁడే గుప్తసామ్రాజ్యమునకు భవిష్యచ్చక్రవర్తి. ఆతనిపేరు శశాంకనరేంద్రగుప్తుఁడు. బాలిక యగుచిత్ర వెనువెంటనే పరుగిడుచువచ్చినయతఁడు శశాంకునితమ్ముఁడు. ఈమాధవుఁడు శశాంకునకుఁ గేవలమును సోదరుఁడు గాఁడు. సవతితల్లి కొమరుఁడు. వృద్ధుఁ డగుమహాసేనగుప్తున కీమాధవునిపై నిరతిశయప్రేమ కలదు. అందుచే నాతఁడు మాధవుని గడుగారాబముతోఁ బెంచుకొనుచుండెను. ఆకారణముననే మాధవుఁ డహంకారియు, నవిధేయుఁడు, నతినిష్ఠురస్వభావుఁడు నయ్యెను. కుమారశశాంకునిస్వభావ మతిధీరమై, ప్ర

లో వాడలోని సేవకులందఱును సభాభవనమునకు వచ్చిచేరిరి. నేఁడు రెండుజాముల వేళ శశాంకకుమారుఁడు శస్త్రాగారమునకు వచ్చి కూర్చుండెను. అప్పటినుండియు రాజనగరునందాతనిజాడ యగుపడుట లేదు. అందుచే నందఱును జింతాకులులై యంతట నాతని వెదకుచు మాధవగుప్తుఁడును, జలిప్రియు వారితోఁ గుమారుఁడును, దుర్గసేనాని యగు లల్లాయును శస్త్రాగారమునఁగూర్చుండియున్నట్లు విని శశాంకకుమార సందర్శనలాలసులై యటకొక్కుమ్మడిం జనుదెంచిరి. చాలసేపటినుండి కుమారుఁడు రావరాకుండుటచేఁ బట్టమహిషియుఁ జక్రవర్తియునుగూడఁ జింతాకులస్వాంతులై యుండిరి. ఈదుడుకుబాలకుఁడు వర్షజలముచేఁబూర్ణిభవించి యున్నశోణనదీ జలప్రవాహగర్భమునఁ జేరిపోయియుండఁడుగదా!" అని శంకించుచుఁ బట్టపుదేవి విచారాయత్తచిత్త యగుచుండెను.

కుమారుఁడు కన్నులఁబడినంతనే యొక్కపరుగునఁ బోయి భట్టాతని నెత్తుకొని వడివడిగశస్త్రాగారమునుండి యావలికివచ్చెను. కాని కుమారుఁ డటనుండి వచ్చుటకిష్టపడక వృద్ధభట్టుతోఁ బెనుఁగులాడ నారంభించెను. భట్టుఁ డెన్నివిధముల బ్రతిమాలినను బుజ్జగించినను గుమారుఁడు భట్టు వదలక "నేను లల్లాయొద్ద నార్యసముద్రగుప్తునికథను వినవలయును. నేనిప్పు డిక్కడనుండి రాను" అని యొక్కటేమాటగఁ బలుకుచుండెను.

లల్లాయును గుమారు నెటులైన మరలింపఁ బ్రయత్నించెను, గాని యందాతనికి విజయము కలుగలేదు. అప్పుడు భట్టు "రేపటియుదయమున నీకు నేను సముద్రగుప్తుని కథను వినిపించెదను" అనియొప్పుకొనెను. దానికిఁ గుమారుఁ డంగీకరించి యొకించుక శాంతమును వహించెను. అనంతరము కుమారు నెత్తుకొని భట్టును, సేవకజనులును వెడలిపోయిరి. వారివెంటనే వృద్ధయోధుఁడగులల్లాయును మెల్లమెల్లగ నటనుండి వెడలిపోయెను.

కుమారశశాంకునియొద్దఁ గిటికీచెంత నిలిచియున్న యావృద్ధుఁడు మగధసైన్యమునందలి యొకనాయకుఁడు. అడవిలోని కోయజాతిసేనా సమూహమున కాతఁడు ప్రముఖుఁడు. అతఁడును కోయజాతివాఁడే. అత నిపేరు లల్లా. ఈలల్లా యనేకసమయములం దనేకయుద్ధములలోఁ బ్రాచీనసామ్రాజ్యగౌరవమును రక్షించి యుండెను; సార్వభౌముఁ డగు మహాసేనగుప్తునకు వృద్ధత్వమునందుఁ బుత్త్రుఁ డుదయించినపిమ్మట నిలల్లా యాకుమారునకు సంరక్షకుఁడుగా నియమింపఁబడియెను. అప్పటినుండియు లల్లా యతిభక్తితోడను ప్రేమతోడను కుమారుని లాలించి పెంచుచుండెను. శశాంకునకు లల్లా యనిన నెంతయోప్రేమ. ఆప్రేమమూలమున నాబాలకుఁ డావృద్ధుని "దాదా" యనుభ్రాతృ సంజ్ఞాపదమున సంబోధించుచుండును.



రెండవప్రకరణము.



సూర్యభగవానునిప్రచండకిరణతాపముచే సమస్తభువనములు ను దహింపఁబడుచున్నట్లుండెను. రాచనగరమునకుఁ గ్రిందివైపున నంధకారబంధుర మగునొకగదిలో వట్టినేలపైఁ బడుండి వృద్ధయమభట్టు భోజనానంతరవిశ్రాంతిం గాంచుచుండెను

యమభట్టు గుప్తవంశపుఁ బురాతనసంపూర్ణవైభవమును గూర్చి నగాథలను జెప్పుచుండెను. శూన్యమును, శాంతము నైయున్న యాప్రదేశమునం దాతనిగంభీరస్వర మతిగంభీరముగఁ బ్రతిధ్వనించుచుండెను. పురాతనచక్రవర్తుల వైభవస్థిత్యంతరములతోఁ బాటుగ రాజభవనములకు స్థిత్యంతరములు గానవచ్చుచుండెను. అనేకసంవత్సరములకుఁ బూర్వము శోణాసంగమస్థానము చెంతఁ బాటలీపుత్త్రపచ్ఛవిరాజొకచిన్నకోటను నిర్మించియుండెను. గుప్తరాజ్యప్రతిష్ఠాపనమైనపిమ్మట న

దివటీకు నగరమధ్యభాగమున నున్న రాజభవనము ప్రథమచంద్రగుప్త నగరమునకుఁ గొననున్న కోటలో జేరియుండెను. అప్పుడే రాచవాడలోనియీభాగము నిర్మింపఁబడియెను. గొప్పగొప్ప ఱాళ్లచేఁ గట్టఁబడి యున్న యీ వ్రుటిగదులన్నియుఁ జాలమువఱకు నెవ్వరివలనను నుపయోగింపఁబడనే లేదు. ఈయార్యావర్తమునకు మగధరాజ్యము కేంద్రస్థానముగాఁ జేయఁబడినయనంతరము సముద్రగుప్త చంద్రగుప్తులయధికారమునందు ధనవాహినిజలవాహినింబో లెవ్వయపఱుపఁబడి శోణనదీతీరమునందీ విశాలభవనము నిర్మింపఁబడియెను. ప్రథమమునఁ గుమారగుప్తుఁడీవాడను విడిచి తనచిన్నరాణిముచ్చటను దీర్చుటకై గంగాతీరమున శుభ్రస్ఫటికశిలాస్థగితంబగు నొక మందిరమును నిర్మించెను. గుప్తవంశావనతిప్రారంభమైనప్పుడు కుమారగుప్తుని యీవాడలోనే చక్రవర్తి నివసించుచుండెను. వాడలోని యితరభాగములన్నియు నధికారుల కార్యాలయములుగా వినియోగింపఁబడుచుండెను. ఒకక్రోశము దూరము వఱకును వ్యాపించియున్న యీవాడ కోట, పటాంగణము మొదలగు వేర్వేఱుస్థలములకు వేర్వేఱు పేళ్లు పెట్టఁబడియుండెను, యదుభట్టుఁడున్న గది "ప్రథమచంద్రగుప్తాగారము" అనునామమున సుప్రసిద్ధమై యుండెను. ఈవిధముగనే "ధ్రువస్వామినీఆరామము, సముద్రగుప్తభవనము, గోవిందగుప్తవిలాసగృహము" అను ననేకనామములచే నారాచవాడలోని యనేకభాగములు నాగరికులచే వ్యవహరింపఁబడుచుండెను. గుప్తసామ్రాజ్యావనతికాలంబున నావిశాలరాజభవన మెంతటిదుర్దశలోనున్నను దానిని బాగుపఱచుటకుఁ గడపటిచక్రవర్తికిఁ దగినశక్తి లేకుండఁబోయెను. సర్వభక్షకమగుకాలప్రభావముచే గొప్పగొప్పగోడలును, బురుజులును శిథిలములై సభాభవనము, గదులును నేలకొఱఁగుటకు సిద్ధపడియుండుటచే నివసించుట కయోగ్యములైపోయెను. అప్పుడు మగధరాజ్యమునందలి సేవకజనులును తక్కుంగల క్రింది తరగతుల యధికారులువానిని దగురీతి నుపయోగించుకొనుచుండిరి.

వాడలోనియుద్యానవము, పటాంగణము నిప్పుడు మహారణ్యము లై పోయినవి. పాటలీపుత్రనాగరికులకు రాత్రివేళలఁ గుమారగుప్తుని వాడకుఁదక్క నింక నెక్కడకుఁ బోవుటకును ధైర్యము కలుగుట లేదు. దీనిం బట్టిచూడఁగాఁ గుమారగుప్తుని వాడ యిటీవలఁ గట్టఁబడినది గుటచే నంతగా జీర్ణావస్థకు లోనుగా లేదని తోఁచుచున్నది. గంగాతీరమునం దలి యీవిశాలభవనమునందే చక్రవర్తియుండెను. ఎఱ్ఱనిఱాళ్ళచే గట్టఁబడిన సముద్రగుప్తుని పురాతనపు గ్రీష్మభవనములలోఁ జక్రవర్తియుంగరతుకులుందురు. ప్రస్తుతకథాప్రారంభమునఁ గుమారశశాంకుఁడు సేనాపతియగుపల్లాతోఁ గలసి ప్రియవాచకులకుఁ గానంబడినది యీవాడలోని యొక భాగముననే——

వృద్ధుఁడగుయదుభట్టు శశాంకకుమారున కీవిధముగాఁ జెప్పుచుండెను:——

"శకరాజు సుందరపాటలీపుత్రమునందే నివసించుచుండెను. ప్రాచీనమగధదేశ మాతనిపాదములకుఁ బ్రణమిల్లియుండెను. తీరభుక్తిరాజులు పాటలీపుత్రమునకు వచ్చి భయభక్తులతో శకరాజుచరణములపైఁ దమయుత్తమాంగములను వంచి ప్రతిసంవత్సరమును సామాన్యపాలికులంబోలి కప్పములను జెల్లించుచుండిరి. వైశాలీనగరపుఁ బ్రాచీనలచ్ఛవిరాజవంశజులు దుర్దశయును దారుణచక్రమునం జిక్కి పాటలీపుత్రము నాశ్రయించుటకు వచ్చియుండిరి. వారు సామాన్యవ్యవసాయకులంబోలి శకరాజులదాస్యము నంగీకరించి యెట్లో తమజీవితములను గడపుకొనుచుండిరి"

అంతవఱకు వినుటతోడనే కుమారశశాంకునివదనమండల మరుణమండలాయమానమైపోయెను. అప్పు డాతఁడు క్రోధగద్గదస్వరముతో "భట్టా! అప్పుడు దేశమునందు మనుష్యులనువారలేరా? మగధులు, తీరభుక్తులు నగురాజు లందఱునుగూడ నాశకరాజులయాధికారమునే యంగీకరించిరా?" అని ప్రశ్నించెను.

యమభట్టు గడువృద్ధుఁడు. ఇంతియకాక బధిరుఁడు. అట్లగుటంజేసి యాకుమారునివాక్యము లాతనికి వినఁబడలేదు. కావున నాతఁడు తనకథనే సాగించుచుండెను.

"శకరాజులయత్యాచారములచే మగధదేశమంతయు సంక్షుభితమగుచుండెను. ఐక్యము లేకపోయెను. దేశమునందలి దేవబ్రాహ్మణులయవస్థ లతిశోచనీయము లయ్యెను. విలక్షణబలవంతులగుశకరాజులవలనిభయముచేఁ బ్రజలందఱును విదేశములపాలై పోయిరి. మగధతీరభుక్తుల బ్రాహ్మణులనాథులై నిరాశ్రయులై లిచ్ఛవిరాజులద్వారములకడకుఁ జేరిరి. ఆసమయమున విశాలవంశావతంసుఁ డగులిచ్ఛవిరాజు ఘోరదుర్దశలోఁ జిక్కియుండెను. అప్పు డాతఁడు శకులవేతనముచే జీవితముం గడపుకొనుసేవకుఁడై యుండెను. అందుచే నాబ్రాహ్మణుల కాశ్రయ మొసంగుట కాతనికి సాహసము లేకపోయెను. అట్లాశ్రయ మిచ్చినచో నాతనికి శకరాజులతో బహిరంగముగ వైరము దెచ్చుకొనవలసివచ్చును. ఆతనికంతటిసాహసము కలుగదయ్యెనుగాని యాతని సామంతుఁ డగు నొకసామాన్యరాజకుమారుఁ డీవిషయమున విశేషధైర్యము కలిగెను—చంద్రగుప్తుఁడు ప్రసన్నవదనముతో నాబ్రాహ్మణబృందమున కాశ్రయ మిచ్చి తననగరమునకుఁ బిలిచికొనిపోయెను—"

అని చెప్పి యమభట్టు కొంచెముసేపాఁగి పిమ్మట వంశపరంపరగా వచ్చుచున్న యాకథ నస్ఖలితస్వరముతో నిట్లు చెప్పందొడంగెను.

"ఆబ్రాహ్మణబృందమున కీవిధముగా నాశ్రయము లభించిన పిమ్మట పాటలీపుత్రనగరమునం దింటింటను దేవద్రోహులగుబౌద్ధులయు, శకులయు నత్యాచారములంగూర్చినకథలు చెప్పుకొనుట యారంభమయ్యెను. అనంతరము శకరాజు ససైన్యుఁడై చంద్రగుప్తునిదుర్గము ముట్టడించెను. నాగరికులు క్రోధవివశులై యుండుటచే ప్రభు

త్వము నంగీకరింపక తిరుగబడి శకరాజును సంహరించివైచిరి. వారందఱు నప్పుడు చంద్రగుప్తుని యాధిపత్యము నంగీకరించి క్రమముగా శకజనులను పవిత్రమగధదేశమునుండి పాఱఁద్రోలిరి. ఈకలహప్రభావము పాటలీపుత్రనగరమునుండి మగధదేశపునలుదెసలను జాలదూరమువఱకును వ్యాపించెను. తీరభుక్తియు, మగధమును బౌద్ధులబలవంతపుబిడికిలినుండి విముక్తిం గాంచెను. అప్పుడు పాటలీపుత్రనగరసింహాసనమున గంగాజలముతో, మహాసంరంభముతోఁ జంద్రగుప్తున కభిషేకము గావించిరి. లిచ్ఛవిరాజునకుఁ బుత్రసంతతి లేదు. అతఁడు తనయేకపుత్రిక యగుకుమారదేవిని మహారాజాధిరాజగుచంద్రగుప్తునకొప్పగించి తీర్థాటనముం గావించెను. దేశమునం దంతటను శాంతిస్థాపనమయ్యెను. వాసుదేవమహాదేవులచక్రత్రిశూలధ్వజములతో విభూషితములైన మందిరములు మరల గగనమును జుంబింపసాగెను. శత్రులబలవంతములగు చేతులకుం బాల్పడి యోపక చెల్లాచెదరైన నాగరికులు మరల నగరమునకు వచ్చిచేరిరి. మగధతీరభుక్తరాజ్యములు ధనధాన్యవైభవంబులతోఁ బరిపూర్ణము లగుచుండెను. భక్తిభావసహృదయములతో సేవించుచున్న సకలసామంతమండలముం గూడి విరాజిల్లుచున్న మహారాజాధిరాజపరమభట్టారక ప్రథమచంద్రగుప్తుని బాహుబలంబు కలిమిం జేసి మగధరాజ్యలక్ష్మి యప్పుడు గుప్తవంశాశ్రయముం గాంచి నిశ్చలయైయుండెను."

యనుభట్టు సంగ్రామవృత్తాంతములను జెప్పుచున్నంతవఱకుఁ గుమారుఁడేకాగ్రచిత్తముతో నాకర్ణించుచుండెను. అనంతరకథాశ్రవణమున నాతనికి నిద్దుర రాసాగెను. అప్పు డారాచవాడలోని యాచెమ్మనేలపై శయనించి మగధదేశపుయువరాజు క్రమముగా నిద్రించెను.

కుమారుఁడు చాలసేపటినుండి నిద్రపోవుచున్నాఁడను సంగతి నావృద్ధుఁడు గ్రహింపనేలేదు. ఆతఁడు తనకథానివేదనమును గావించు

చునే యుండెను "యుక్తకాలమున నాయుఃపరిపూర్ణుఁడైనపిమ్మటసార్వభౌముఁ డగుచంద్రగుప్తుఁడు గంగాలాభము కలిగెను. అప్పుడు లిచ్ఛవిరాజకన్య మహారాజ్ఞికుమారదేవి కులాగతక్రమము ననుసరించి పతితో సతి చేసెను. అనంతరము గుప్తవంశమధ్యాహ్నమార్తాండుఁ డగుసముద్రగుప్తుఁడు పాటలీపుత్రసింహాసనము నధిరోహించెను—"

ప్రక్కనున్న మహాలునం దొకపురుషుఁ డటునిటు ప్రచారము సేయుచుండెను. ఆతఁ డప్పు డాకస్మికముగా యదుభట్టునొద్దకు వచ్చి నిలిచెను. యదుభట్టు వృద్ధావస్థమూలమున బధిరుఁ డగుటచే నీపురుషునిపదధ్వని వానికి వినరాదయ్యెను. లోని కరుదెంచినయాపురుషుఁ డొకయున్నతాధికారిం బోలియుండెను. కాని యాతఁ డప్పుడు సామాన్యవస్త్రాలంకారవిభూషితుఁడై దేహమునను నొకసన్ననియుత్తరీయము దాల్చి యుండెను. ఆతనిచరణములయందలి చర్మపాదరక్షలపై మాత్రము మణిముక్తావళులు కూర్పఁబడియుండెను.

మహాలునఁ బ్రవేశించినయాపురుషుఁడు నేలపైఁ బరుండియున్న రాకుమారుని, మఱియొకవైపునఁ గూర్చుండియున్నయదుభట్టును గాంచియుచ్చైస్స్వరముతో "యదుభట్టా! వెఱ్ఱివానివలె నేమి చెప్పుచున్నావు!" అనియెను.

ఆపురుషునికంఠస్వరమును వినినంతనే యదుభట్టు తత్తరమున లేచి నిలువఁబడియెను. ఆతనిముక్కురూప మంతలో మఱింతముక్కించి నల్లయ్యెను. అప్పు డేమిచేయవలయునో తోఁపక యాతఁడు కడుం గడు దడఁబడిపోవుచుండెను.

పురు—యదుభట్టా! ఇక్కుమారునిసమక్షమునఁ గుమారగుప్తచంద్రగుప్తులనామముల నెన్నఁడు నెత్తవలదని నీకెన్నియో సారులు చెప్పియున్నాను. శశాంకునకు నీవిప్పు డేమి చెప్పుచున్నావు? నీనోటినుండి కుమారగుప్తునినామము రెండుమూఁడుసారులు నాకు వినఁబడినదే!

యమభట్టునోట మాట వెలువడుటలేదు. వాఁడు భయవిహ్వలుఁడై నోట కానుకొనిపోయెను. అప్పు డాపురుషుని తీవ్రస్వరముచే శశాంకునికి నిద్రాభంగ మయ్యెను. తోడనే యాబాలకుఁడు లేచి యాపురుషునింగాంచి తత్తరపడియెను. పురుషుఁ డాతనిం గాంచి "కుమారా! వాడలోని యీశిథిలభాగమునకు నీవేల వచ్చితివి?" అని ప్రశ్నించెను.

కుమారుఁ డేమియుఁ బ్రత్యుత్తరమీయక తలవంచి నేలకుఁ జూచుచు నిలువఁబడియుండెను.

పురుషుఁడు భట్టుం గాంచి "యమా! నీవు జరాపీడితుఁడవై యున్నావు. యుక్తాయుక్తవివేకము నీకు నశించిపోయినట్లున్నది. నన్నించుకంతయు లక్ష్యముసేయక నాయాజ్ఞకు వ్యతిరేకముగాఁ గుమారునకుఁ గుమార్గమును బోధించుచున్నావు. భట్టా! ఇఁకమీఁద నెప్పుడైన సముద్రగుప్తునినామమును నీవుచ్చరించినచో నీవీపుచర్మము నొలిపించి యీపాటలీపుత్రనగరమునుండి నిన్ను వెడలనడిపింతు నని గట్టిగా నమ్ముము—కుమారా! రాచవాడలోని యీశిథిలభాగమున నీవిఁక నెన్నఁడు నొంటిగాఁ దిరుగవలదు. ఈయమభట్టు గతవృద్ధుఁడు. సర్పవ్యాఘ్రభయంబులనుండి యీతఁడు నిన్ను రక్షింపఁగలఁడా?—

ఆకర్ణాంతవిశాలములైన యాకుమారునినేత్రము లశ్రుజలపూరితము లయ్యెను. అప్పు డాతఁ డవనతవదనుఁడై మందమందగమనంబున నటనుండి వెడలిపోయెను. దవ్వాననున్న యొకగదిలో లల్లా యక్కుమారుని యాగమనముకొఱకు వేచియుండెను. ఆతఁడు పరుగెత్తుకొని వచ్చి యాకుమారు నెత్తుకొని తీసికొని పోయెను. ఆవృద్ధవీరునివక్షోభాగమున మస్తకమునుంచి శశాంకుఁ డేడువసాగెను.

ఏదియోదుర్వార్తనాకర్ణించుటవలన మహాసేనగుప్తచక్రవర్తి యస్వస్థుఁడై భవనప్రాంగణమున నిటునటుఁ దిరుగుచు నటనుండి య

ప్రయత్నముగా నీశిథిలభవనభాగమునకు మెల్లనఁ జనుదెంచెను. అచ్చట యనుభట్టుమాత్రమే యుండును. సార్వభౌముఁడుగాని, మఱియేయితరోన్నతోద్యోగిగాని యావైపున కెన్నఁడును వచ్చుట లేదు. అందుచేతనే యనుభట్టచ్చట నిశ్చింతతో నిషిద్ధకథను నివేదింప సాహసించెను.

ఇచ్చటి కాకస్మికముగా వచ్చినయాపురుషుఁడు మహాసేనగుప్త చక్రవర్తియే యని చదువరులకు వేఱుగఁ జెప్పవలసినయావశ్యకము లేదు. అనేకదివసములకుఁ బూర్వము మధ్యదేశమునుండి వచ్చిన యొకజ్యోతిష్కునివలన శశాంకునిచేతులలో మగధరాజ్యము నాశనము కాఁగలదనియు, నాతని మేనయత్తవంశము పాటలీపుత్త్రమున నధికారము వహించుననియుఁ జక్రవర్తి వినియుండెను. సార్వభౌముఁ డానాఁడు మొదలుగా భయభ్రాంతిహృదయుఁడై గుప్తవంశపులుప్త గౌరవకథలనుగాని, చంద్రగుప్తసముద్రగుప్తులకథలనుగాని కుమారుని యెదుట నెన్నఁడును జెప్పవలదని చారణులను భట్టులను బలుసారులు శాసించియుండెను.

కుమారుఁడు వెడలిపోయినతరువాతఁ జక్రవర్తిహృదయమున విచారము మరలఁ బ్రారంభమయ్యెను. మెల్లమెల్లఁగా నాతఁడు యనుభట్టుని గదినుండి వెడలివచ్చి యిటునిటుఁ దిరుగాడఁదొడంగెను.

చక్రవర్తి వెడలిపోయినతరువాత యనుభట్టు వజ్రఘాతముం గాంచినవానిఁబోలి నేలపైఁ బడిపోయెను.

---

## మూఁడవప్రకరణము.

రెండుజాములవఱకును ముసలధారాపాతంబుగువర్షము వర్షించెను. ఇప్పుడు కొంచెము వెలిసినది గాని గగనమండల మింకను తిస్వచ్ఛమైయుండలేదు. పాటలీపుత్త్రనగరసమీపమున వారాణసీనిర్జన

మార్గమున నంధకారము తన మహాత్తరాధికారమును బలవంతముగ వ్యాపింపఁజేయుచుండెను. అత్యున్నతంబులగు పర్వతశిఖరంబులందును, సమున్నతవృక్షాగ్రములందును నస్తంగతసూర్యుని నీలరక్తకిరణములు కొంచెముకొంచెముగాఁ బ్రసరించుచుండెను. అయినను గగనపూర్వభాగమున నీనీలజలదము లతివేగముగ నేకీభూతము లగుటఁ గానవచ్చుచుండెను. మధ్యాహ్నప్రచండవృష్టివలన నావిశాలరాజమార్గ మప్పు డొకచిన్న యేరై ప్రవహించుచుండెను.

అప్పుడు నలువురువ్యక్తులు మెల్లమెల్లఁగ పాటలీపుత్రనగరాభిముఖులై నడచిపోవుచుండిరి. చేత నొకపెద్దకఱ్ఱను దాల్చియున్న వయోవృద్ధుఁ డొకఁ డందఱికంటెను ముందుగ నడచుచుండెను. అతనివెనుకఁ బండ్రెండ్లేండ్లయీడుగల కోమలదేహయగు సుందరబాలికయును, నామెవెనుక నొకముసలిగాడిదవీఁపుపైఁగూర్చుండి యొకబాలకుఁడును బ్రయాణము సాగించుచుండిరి. ఆవృద్ధుఁడు గమనాయాసముచేఁ జాలఁదూలిపోవుచుండెను. అయినను నాతఁడెట్టులో నడచుచునేయుండెను. కాని, యాతనివెంటనున్న బాలిక మాత్రము కడుంగడు నలసి సొమ్మసిల్లిపోవుచుండెను. ప్రతిక్షణమును నాబాలిక విశ్రాంతిం గైకొనునిచ్ఛను బ్రకటించుచుండెను.

అట్లు నడచిపోవుచు వృద్ధుఁడు "మనమింకఁ గొంచెముదూరము పోఁగలిగితిమేని క్రమముగా నేగృహముననైనను, గుడిసెనైనను, కాక, యేగ్రామముననైనను జేరి యాశ్రయింపఁగలము. త్రోవలోనే మనమిట్లాయాసపడి యాలసించినచో నంధకారమున నెటుపోవుటకును మనకు శక్తియుండదు" అనియెను.

బాలిక క్షీణకంఠస్వరముతో "బాబా! నేను మిక్కిలి డస్సియున్నాను. ఇఁక నొక్కయడుగైన నడచుట నావల్లఁ గానేరదు. నా కాళ్ళెన్నిచోటుల గాయపడిపోయినవో నాకే తెలియుటలేదు. నేను కొంచెముసేపు కూర్చుండెదను" అనియెను.

కరుణరసపరిపూర్ణంబులగు నా బాలికపలుకుల నాలకించి గార్దభవాహనుఁడైన యా బాలకుఁడు "అక్కా! నీవింక నీగాడిదపైఁ గూరుచుండుము. నేను నడచివచ్చెదను" అనియెను.

బాలకుని యామాటలను విని యట్టిస్థితిలో సైతము వృద్ధునకును బాలికకును నవ్వు రాక మానదయ్యెను. వారినవ్వులం గాంచి బాలకుఁడు తెల్లపోయి యూరకుండెను. బాలిక మఱికొంతదూర మెట్లో నడచి యాయాసమును భరింపఁజాలక తటాలునఁ గూలఁబడి యంతలోనే లేచి మార్గసమీపమునఁ దడిసియున్న యొకయున్నతస్థలమును జేరి యొక్క నిట్టూర్పు విడిచి యటఁ గూర్చుండెను.

అది గని యాముసలిఁడు "బిడ్డా! ఇఁకనడవఁజాలవా? కూర్చుంటివా?" అని యామెప్రత్యుత్తరమును నిరీక్షింపకయే తాను గూడ నామెను సమీపించి కూర్చుండెను. వెనుకనుండి వచ్చుచున్న గార్దభరాజముకూడ బాలకసహితముగా వచ్చి వారిచెంత నిలువఁబడియెను. ప్రతినిమిషమునకును జీకటి దళముగాఁ గ్రమ్ముకొనుచు వారి నాక్రమించుచుండెను.

ఈవిధముగాఁ గొంతసేపు గడచెను. అప్పుడు బాలకుఁడు లక్ష్యపూర్వకముగా నాలకించుట నభినయించి "బాబా! గుఱ్ఱములు పరుగెత్తి వచ్చుచున్నశబ్దము వినవచ్చుచున్నది" అనియెను.

ముదుసలి యామాట విని చటాలున లేచి నిలువఁబడియెను. ఆరాజమార్గమునకు సమీపమునన్న పొలములోని యామ్రవృక్షచ్ఛాయ నంధకారము ఘనీభవించియుండెను. వృద్ధుఁడు తోడనే యాయిరువురను వెంటఁబెట్టుకొని పోయి యావృక్షచ్ఛాయను డాగి యుండెను. క్రమముగా నశ్వపదధ్వని సమీపముననే వినఁబడుచుండెను. మఱికొంతసేపటిలోనే యనేకులగు నశ్వారోహకులా యంధకారమధ్యమునం బడి పాటలీపుత్రనగరాభిముఖులై యతి వేగ

ముగఁ బోవుచుండిరి. ఉండియుండి యొకసారి మెఱుపు మెఱసినప్పు డాయాశ్వికుల యాకృతి వారి కతిభయంకరముగఁ గానవచ్చు చుండెను.

ఇట్టియవస్థలో ప్రవాసి యగు మనదీనవృద్ధుఁ డాయిరువురు బిడ్డలను దన మేన హత్తించుకొని యాయామ్రవృక్షచ్ఛాయను డాగి యెట్లయిన నాయాశ్వికులకన్నులఁ బడకుండవలయు నని విశ్వప్రయత్న ము గావించుచుండెను. ఒకగంటసేపటివఱకు నాగుంపు వరుసలుతీరి యావృక్షసమీపమునుండి నడచుచునేయుండెను.

అట్లా యశ్వారోహక సైన్య మతిదూరమువఱకుఁ బోయినను మార్గమునకువచ్చుటకు మనవృద్ధుఁడు సాహసింపఁజాలక పోయెను. అప్పుడు మరలఁ గొంచెముకొంచెముగా వాన కురియుటకారంభించె ను. నభోమండలమునం దంతటను నీలమేఘము లావరించుకొని యుండెను. అప్పు డావృద్ధుఁడు బిడ్డల నిరువురను వృక్షచ్ఛాయను గూ ర్చుండఁబెట్టి తాను వానలోఁ దడియుచుండెను.

ఈవిధముగా నొకజాము రాత్రి గడచిపోయెను. మరల నశ్వ పదఘట్టనధ్వని వినవచ్చుచుండెను. అప్పుడు వృద్ధుఁడు కన్నులు తెఱచి బాటవైపునకుఁ బరికింపఁ దొడంగెను.

కొలఁదిసేపటిలోనే ధర్మకర్మసంయోగమున నలువురేవు రశ్వా రోహకు లావృక్షసమీపముననే వచ్చి నిలిచిరి. వారిలో నొకఁడు "అబ్బా! వాన యింకను జోరుగఁ గురియుచునే యున్నది. నడువుఁడు. చెట్టుక్రిందికైనను బోయి కొంచెము సేపు నిలుచుందము" అనియెను.

ఆతనిమాటల కందఱు నంగీకరించిరి. ఆక్షణమునందే వారం దఱును మార్గమునుండి తొలఁగి సమీపముననున్న యాపొలమునఁ బ్రవేశించిరి. మనప్రయాణికులకు దురదృష్టముహూర్తము సమీ పించెను. ఆసమయముననే విద్యుల్లతయొకసారి వికటహాసము

గావించెను. ఆమెఱపు కాంతిలో నావృద్ధుని సముున్నతవిగ్రహ మా యాశ్వికుల కనాయాసముగా దృగ్గోచరంబయ్యెను.

ఆవృద్ధునిరూపు కన్నులఁబడినంతనే యాశ్వికుల కందఱకును ముందున్నవాఁడు బిగ్గరగా "శూలపాణియై యెవ్వఁడో యీ చెట్టుక్రింద నిలిచియున్నాఁడు. చూచితిరా?" అనియెను.

ఆమాట వినుటతోడనే యందఱు నావృక్షమును సమీపించిరి. ఆయవకాశమునందు వృద్ధుఁడును చెట్టుమఱుఁగునుండి వెడలి పొలము నడుమకు వచ్చి నిలిచెను. ఒకయాశ్వికుం డాతని గాంచి "పోకుపోకు" మని యదల్చెను, గాని యావాక్యము పూర్తి యగులోపలనే వెనుక నుండిరివ్వున నొకబల్లెము వచ్చి యావృద్ధుని వక్షస్థలమునుజీల్చి వెడలు టయుఁ బ్రాణశూన్యమగునాతనియున్నత దేహము జలమయమైయున్న యాపొలమున గుభిల్లునఁ గూలఁబడిపోవుటయు జరగిపోయెను. తోడనే యావృక్షమూలమునాశ్రయించి యున్న బాలిక కెవ్వుమని కేక వైచెను. ఆ కేకకు గార్దభము బెదరి దొరకినతోవనుబట్టి పరుగిడ నారంభించెను. ఖరవాహనుఁడైనయాబాలకుఁడుమాత్ర మెట్లో తన శక్తినంతను కేంద్రీకరించుకొని ప్రాణములను బిగబట్టుకొని యాగాడిద జూలును బట్టుకొని కూర్చుండియుండెను.

సైనికులు సమీపించి చూచిరి. వారికిఁ గనఁబడిన దేమి? ఆ మ రణించినవాఁడు యోధుఁడు గాఁడు, వృద్ధుఁడు. ఆతనికడఁ బరభీకరంబుల గునస్త్రము లెవ్వియును లేవు. వానిచేతిలోనికఱ్ఱనే వారు శూలమని సందేహించిరి. ఇది యంతయుం గాంచి యావృద్ధునిపై బల్లెము విసరి నవరాక్రమశాలింగూర్చి వారందఱు నెగతాళి చేయసాగిరి. కాని వానికే యాబాలిక యస్ఫుటార్తనాదము వినబడియెను. వాఁడు తోడి వాండ్రపరిహాసవచనములనుసహించి యావృక్షసమీపమునకుఁ బోవం దొడంగెను.

విద్యుత్ప్రకాశసాహాయ్యమున మానవీయున కావృక్షమూలమునఁ గూర్చుండి యున్నయాబాలిక కానంబడియెను. తోడనే యాతఁడు మహాహ్లాదభాసితవదనముతోఁ దనవెంటవచ్చినవారి నుద్దేశించి బిగ్గరగా "ఓరీ! మీరందఱు నన్నుఁ బరిహసించుచుంటిరిగదా! ఈముసలినిఁ జంపి నేనేమి సంపాదించితినోచూచియైనఁ బొండు. ఈనాసంపాదనమునం దెవ్వరికిని భాగములభింపదుసుమా! మొట్టమొదటనే స్పష్టముగాఁ జెప్పివైచుచున్నాను" అనియెను.

అతిత్వరితముగా నందఱు నచ్చటికి వచ్చిరి. ఆబాలిక వారికిఁ గనఁబడినంతనే యందఱు నొక్కపెట్టున "వహ్వా! ఎంతసొగసు! చంద్రేశ్వరున కిది యొకరత్నమే లభించినది." అనిరి.

పాపమాబాలిక భయవిహ్వలయై శోకింపఁదొడఁగెను. బాలికపై స్వాతంత్ర్యముగలయావీరుఁ డశ్వారూఢుఁడైయామెను దటాలునఁ దనగుఱ్ఱముపై కెత్తుకొనియెను. వర్షావేగము కొంచెము తగ్గినది. సైనికు లందఱును మరలఁ దమమార్గము ననుసరించి పోవసాగిరి.

బాలకుని మూపున మోచికొని పరుగెత్తినఖరేంద్రమదేపనిగఁ జాలదూరము పోలేదు. అక్కడకొక యరక్రోసుదూరమునందున్న తాళవనమునం దది నిలిచిపోయెను. ఆకస్మికముగ సంభవించిన యీసంఘటన మంతయుం గని యాబాలకుఁడు మిక్కిలి భీతిల్లి చాలసేపటివఱకు నట రోదనము చేయుచునే యుండెను. కాని వాని యాయరణ్యరోదనమును వినుట కట నెవ్వరున్నారు? పాప మాబాలుఁడట్లు కొంతసేపేడ్చి మిగుల నలసి యాగార్దభముమూపునఁ బడి నిదురించెను.

మఱునాఁ డరుణోదయసమయంబున నాపిల్లవానిరోదనధ్వని యొకతైలికునకు వినవచ్చెను. అచ్చటి కనతిదూరమునందున్న యొక చిన్నకాలిబాటను బట్టి యాతైలికుఁడు తనవిక్రయవస్తువులను విక్రయించుటకై మోచికొని నగరమువైపునకుఁ బోవుచుండెను. దిక్కులేక

దీనావస్థయందున్న యాబాలకునిం గాంచి యాతనికి మిగుల జాలి గలిగెను. అందుచే నాతైలికుఁడు గార్దభరాజముతోఁగూడ నాబాలకునిఁ దనవెంటఁబెట్టుకొని నగరమునకుఁ దీసికొనిపోయెను.

రెండుజాములు గడచెను. నగరతోరణద్వారమున మంగళవాద్యఘోషములు సెలంగుచుండఁ దైలికుఁ డాబాలకునితోఁ బాటలీపుత్రపశ్చిమతోరణద్వారముకడకు వచ్చి చేరెను.

తోరణబహిర్ద్వారమును దెఱచివైచి ప్రతీహారులు ద్వితీయద్వారముచెంత నిద్రాసుఖము ననుభవించుచుండిరి. కావున వారిని మేల్కొల్పుట కాతైలికునకు సాహసము కలుగదయ్యెను. బాలునితో నాతఁడు కొంచెము దూరమునఁ గూర్చుండి వేచి యుండెను. రక్షకభటు లాతనివంకఁ గడకంటనైనఁ జూచుటలేదు. మూఁడవజాము గడచినవెనుక రథచక్రధ్వానముల నాలకించి యనేకులకు నిద్రాభంగమయ్యెను. అప్పుడు గలగలధ్వనులతో నొకరథము వచ్చి యంతర్ద్వారముకడ నిలిచెను. లోపలనున్న యొకవ్యక్తి తత్తరపడిన వాఁడునుంబోలెఁ గర్కశస్వరంబున ద్వారము తెఱచుట కాజ్ఞ యొసంగెను. ఆక్షణమునందే ద్వారపాలకు లందఱును శయ్యలనుండి లేచిరి. ఒక్కఁడు మాత్ర మింకను నిదురించుచునే యుండెను. మఱియొకఁడు వానిమూపునఁ గాలితోఁ దన్నెను. అందులకుఁ గోపించి మొదటివాఁడు రెండవవానిని గొట్టుట కుద్యుక్తుఁ డగుచుండ మూఁడవవాఁడు వచ్చి శయ్యతోఁ గూడ నాతని నీడ్చికొనిపోయి తోరణద్వారసమీపమున నున్న యొక గదిలోనికిఁ ద్రోసివైచెను. ఒకఁడునిద్రమత్తు పూర్తిగ వదలిపోయినతరువాత వేపపుడుకతో దంతధావనము సేయుచు బిగ్గరగా గాండ్రించి యుమియుచు "ఎవరు వచ్చియున్నారురా!" అనియెను.

ఇంకొక కావలివాఁడు "వచ్చియున్నాఁడు నీయబ్బ!" అనియెను.

మొదటివాఁడు "నాయనా! నాయబ్బ యెన్నఁడో, యెక్కడకో వెడలిపోయివాఁడు" అని పలుకుచు దంతధావనకార్యక్రమము నుపక్ర

మిం చెను. అది గని వేఱొకఁడు వానిపలుదోముపుడకను జలకలశము ను గందకముతోకి బారవిసరెను. వాఁడా చెంబును పెచ్చుకొనుటకై కందకములో నుఱికెను. ఈగ దరగోళములో ద్వారరక్షకులందఱును దోరణాంతర్భాగమునఁ బఱచియున్న తమతమశయ్యల నన్నిటి నెత్తి వైచిరి.

నగరద్వారముకడనుండి ద్వారమును దెఱచుట కాజ్ఞ యొసం గినయాతఁడధికక్రోధోద్దీప్తుఁడై ద్వారముపైఁ దన్నుట కారంభించెను. అప్పుడు ద్వారపాలకు లందఱును గలసి ద్వారమునందలి యర్గళము లను నాల్గింటిని బహుప్రయాసముతోఁ దీసివైచిరి. దేవదారుఫలకలచే నిర్మింపఁబడిన యాదృఢప్రచండద్వారములు తెఱవఁబడి తోరణపుగో డల కారెండుభాగములు నదికెను.

ప్రతీహారులును, ద్వారపాలకులును, భయభీతాంతఃకరణముల తో మెల్లగనావైపునకు దృష్టినిగుడించిరి. కృష్ణవర్ణుఁడును, కృశాంగుఁ డును, వామనుఁడునైన యొకవృద్ధపురుషుఁడట నిలిచియున్నట్లు వారికిఁ గనఁబడియెను; ఆతని గనినంతనే తలకుఁబాగఁజుట్టుకొనుటకైన నవకా శము చాలనియొకఁడు మరల వెనుదిరిగి చూడకయే పాఱిపోయెను. త క్కినవారు భయకంపితులగుచు మోకాళ్లు నేల కానించి కూర్చుండిరి. కాని వారిప్రార్థనాసూచకాభినయముల నించుకేనియు మన్నింపక యా వృద్ధుఁడు వారినందఱను జబుకుదెబ్బల పాలుగావించెను. అనంతరము నాలుగు గుఱ్ఱములంబన్నిన యారథము గలగలధ్వనులు సేయుచుఁ దో రణద్వారమునుండి బయటికి వెడలిపోయెను.

అనంతరము మనతైలికుఁడు వృషభమును, గార్దభమును, బాల కుని వెంటఁబెట్టుకొని నగరమునఁ బ్రవేశించునుద్దేశముతో సంసిద్ధుఁడ య్యెను. వానిం గాంచినంతనే ద్వారపాలకుల శౌర్యమును ధైర్యము ను మరల విజృంభించెను. అందుచే నందఱును గలసి పాపమాతైలికుని

పై దూకిరి. తుదకేయుపాయమును గానక తైలికుఁడు తనవస్తువులలోఁ గొన్నిటిని వారికి లంచమిచ్చి వారిబారినుండి యెట్టకేలకుఁ దప్పించుకొనియెను.

తైలికుఁడు నగరమునఁ బ్రవేశించి చూచెను. అదేమి? రాజమార్గ మన్నివైపులను జనశూన్యమైయుండెను. వర్తకస్థానము లన్నియు మూయఁబడి యుండెను. ఎవరోయొకరిద్దఱుమాత్రము మార్గమునందు శంకాకులస్వాంతులై నడచుచు సంధిపొసఁగినంతనే రాజమార్గమును త్యజించి సందుగొందులందూరి పోవుచుండిరి. అందందుఁ బరదేశసైనికకాయము మహాకోలాహలముతో వీధులవెంటఁ దిరుగుచుండెను. ఆసైనికులం గని పాటలీపుత్రనాగరికులు దవ్వుదవ్వులం దొలఁగిపోవుచుండిరి. ఆసైనికులు కన్నులఁబడుటయే తడవుగాఁ దెఱవఁబడియున్న గృహద్వారములును, వాతాయనద్వారములును దటాలున గొప్పధ్వని చేయుచు మూయఁబడిపోవుచుండెను; చిన్నచిన్నయంగళ్ళవారందఱును దమతమయంగళ్లను విడిచి పాఱిపోవుచుండిరి.

నగరమునం దోఁచినయీయద్భుతపరిణామస్థితిం గాంచి యాతైలికునిమనసు భయముచేఁ జెదరిపోయెను. ఆతఁడు వెంటనే రాజమార్గమును త్యజించి మాఱుత్రోవను నడవసాగెను. చిమ్మచీకటియైయున్న సందుత్రోవ నాతఁడు కొంతదూరమువఱకుఁ బోయి యొక ప్రాఁతగుడిసెచెంత నిలువఁబడి తలుపుతట్టెను. అట్లెంతసేపు తట్టినను నెవ్వరును దలుపు తీయలేదు. అందుచే నాతఁడు తలుపును దన్నుటకారంభించెను.

ఇట్లించుమించుగా రెండుగడియలు గడచెను. పాపమాబాలకుఁ డతిశ్రాంతుఁడై యాగాడిదపై నట్టె నిదురించెను. నగరమున మెల్లమెల్లగ నిస్తబ్ధత ప్రసరింపసాగెను. మొట్టమొదటనే చిమ్మచీకటియైయున్నయాసందు సూర్యాస్తమయమైనంతనే క్రమముగా గభీరాంధకారబంధురము కాసాగెను. ఇఁక నుపాయాంతరముం గానక మన

బాటసారి మఱింత తీవ్రముగా నాతలుపులను దట్టఁదొడంగెను. వాని దెబ్బల కాఁగఁజాలక తలుపులు బ్రద్దలై పోవు ననుభయముచేఁ గాఁ బోలు నాకుటీరమునుండి రోదనసూచకం బగు నొక స్త్రీకంఠస్వరము వినవచ్చెను. ఆ దుఃఖస్వరమునుగూర్చియు నందలి భావమునుగూర్చియు స్వభావానుగుణముగా వర్ణించుట యసాధ్యమే గాని, పాఠకులసౌకర్యముకొఱకు దానిభావమును మాత్రము చెప్పుచున్నాము.

“అమ్మయ్యో! మాయింటిలో దొంగలుపడినారు. ఇరుగుపొరుగున నెవ్వరైన నున్నచోఁ బరుగెత్తి వచ్చి రక్షింపుఁడు రక్షింపుఁడు. రాజుగారిమేనల్లునితో వచ్చినయాటవికసైన్యము నేననాథననియు, నసహాయ ననియు, నిరుపేద ననియు, విధవననియు నెంచి నాపై బలవంతము, నిర్బంధము సేయుచున్నట్లున్నది. మీరందఱును బరుగెత్తిరండు! ఆకఠినహృదయులను దరిమివేయుఁడు! లేకున్న నేను చచ్చిపోవుదును. చచ్చిపోవుదును. నాజాతి-నీతి—లజ్జ—అభిమానము-అన్నిటి నీపీనుఁగులు సర్వనాశనము చేయుచున్నారు. రండు! రండు! రక్షింపుఁడు!” అని యామె గోలపెట్టుచుండెను.

మొట్టమొదట నీస్త్రీశోకస్వరమును విని పొరుగింటిరెండవయంతస్తున నివసించి యున్నయొకపురుషుఁడు కిటికీతల్పు ఓరగఁజేసి యిది యేమైయుండు నని పరికించెను. ఒకరిద్దఱు మాత్రముచ్చస్వరముతో నామెకు ధైర్యము చెప్పుచుండిరి. కాని యాసమీపగృహస్థుఁడొకఁ డాయింటిగుమ్మముకడ నున్న తైలికుని, వృషభమును, గాడిదను, బాలకుని జూచి తీవ్రస్వరముతో “ఓరీ నీవేమిచేయుచున్నావురా! స్థానేశ్వరసైనికులగుఱ్ఱపుదళములు గుంపులుగుంపులుగాఁ గూడి యిక్కడకే వచ్చుచున్నట్లున్నది.” అనియెను.

ఆతనినోటినుండి యీమాటలు వెలువడినంతనే పాటలీపుత్రపుర నాగరికులు తటాలునఁ దలుపులను మూసికొనిరి. కిటికీలనుగూడద

మూసికొని గృహాంతర్భాగములకుఁ బరుగెత్తిపోయిరి. ఆస్త్రీశోకస్వర ముక్రిమక్రిమముగాఁ బ్రవర్ధమాన మగుచుండెను. మార్గమువైపునకుఁ దిరిగిచూచుటకూడ నపాయకరమని యెంచి మన తైలికుఁ డాద్వారమునందొక్క పెట్టునఁ బాదప్రహారముం గావించుచుండెను. ఇంతలోఁ బ్రాఁతగిలియున్న యాద్వారపుగడియలు విఱిగి పడిపోయెను. తోడనే యాతఁ డాయింటిలోపలఁ బ్రవేశించెను. అప్పు డా స్త్రీయొనరించిన క్రందరగోళము వర్ణనాతీతమైనది. తుద కామె మూర్ఛిల్లెనో, యేమో యేసంగతియును దెలియ లేదు. ఏమన—తైలికమహాశయుఁడు బాలక గార్దభవృషభసహితుఁడై యాయింటిలోనికిఁ బోయి తలుపులు మూసివైచెను. అనంతర మాస్త్రీరోదనము చుఱియెవ్వరికిని వినఁబడలేదు. ఇంతవఱకు సత్య మని చెప్పఁగలము.

---

## నాలుగవ ప్రకరణము.

సూర్యోదయసమయమునుండియును రాజప్రాసాదమునందలి సేవకజనులు రాజసభామండపమును బాగుచేసి యలంకరించుచుండిరి. నీలవర్ణంబు లగుబ్రహ్మశిలాఫలకంబులచే నిర్మింపఁబడిన యావిశాలసభామండపము చతుష్కోణాకృతియై నూటయెనిమి ది స్తంభములచే విరాజిల్లుచుండెను. సభావటాంగణమునకు నలుదెసలను పచ్చని రంగుగల తాళ్ళచేఁ గట్టఁబడిన యెక్కువలావును మిక్కిలినన్నమును గాని స్తంభములపై వెండిచేఁ జేయఁబడిన యరఁగులుండెను. ఆయరఁగులపై నతికౌశల్యముతో నిర్మింపఁబడిన శిలావిగ్రహములుండెను. ఆవిగ్రహములు రామాయణ భారతాదిగ్రంథములలోని వీరుల యాకారములు; ఆయరఁగులకు వెనుక సభామండపస్తంభము లుండెను. సభాభవనమునకును జతుష్పార్శ్వములశిలాతటము లుండె

ను. ప్రాచీనసార్వభౌములపరిపాలనకాలమున నాతటావరణమునందు దశసహస్రతురగారోహకులు శస్త్రాస్త్రధారులై బారులుతీరి నిలువఁబడు నాచారము కలదను ప్రవాదము పాటలీపుత్రనగరమున వాడుకలో నుండెను. ఆసభామండపమునం దించుమించుగా సహస్రగజదంతాసనము లమర్పఁబడి యుండెను. కాని యవి యతిపురాతనము లగుటచేతను వానిని బాగుపఱచుట కెవ్వరు నంతశ్రద్ధను వహించకుండుటచేతను, బరిశుభ్రంబు లగునాహస్తిదంతములతళు కంతయును బోయి యతిమలినమై యుండెను. ఈయాసనములపై రాజ్యమునందలి యధికారులును, మాననీయులగు నాగరికులును గూర్చుండియుందురు. ఆకాలమున రాజసభయం దెల్లరును నిలిచియే యుండవలయు నను యవనులయాచారము వాడుకలో లేదు. సభాగృహంబునకుఁ బ్రభువు వచ్చినప్పుడుమాత్రము సకలజనులును దమతమయాసనములనుండి లేచి నిలిచి రాజునానతింబడసి మరల నాసీను లగుచుండుట యాచారమై యుండెను. ఆసభామండపమధ్యమునందలి యరఁగుపై రెండు విధములగు సుఖాసనము లమర్పఁబడి యుండెను. ఆయాసనములపై రాజకులమువారును, యువరాజపాదీయులును (సామ్రాజ్యభావ్యధికారికి సములైనమంత్రులకును, రాజ్యమందలి యితరాధికారులకును "యువరాజపాదీయు" లనుబిరుదము కలదు.) కుమారపాదీయులును (యువరాజుగాక యితరరాజకుమారులకు సములగుమంత్రులు నధికారులును గుమారపాదీయులను సంజ్ఞగలవారు) కూర్చుండి యుందురు. అభిజాతవర్గమునఁ బ్రవేశము దొరకిననే గాని యితరు లెవ్వరికి నీయరఁగుపై నాసనములభించుట కష్టము.

మధ్యదేశమునుండి తేఁబడిన యమూల్యంబులగు స్ఫటికశిలాఫలకంబులచే నతినిపుణముగ నిర్మింపఁబడిన సమున్నతవేదికపై సార్వభౌముని సింహాసనమమర్పఁ బడి యుండెను. ఈవేదిక భూమికి రెండ

డుగుల యెత్తుననుండి దీని నలువంకలను సోపానము లుండును. వేదికపై సువర్ణమయంబులగు నాలుగుకంబములును, వానిపై వెండిచాందినీలును గలవు.

పరిచారకులా సభాభవనమును శుభ్రపఱచి స్ఫటికశిలావేదికను నిర్మలముగాఁ గడిగి వానిపై విదేశమునుండి తెచ్చిన యమూల్యాచ్ఛాదనవసనమును బఱచి యందు రెండు సువర్ణసింహాసనముల నమర్చుటకుఁ ద్వరపడుచుండిరి. మఱికొందఱు పైచాందినీకి ముత్తెపుఝాలరులను గట్టుచుండిరి. కొందఱు సింహాసనములపై రాజ్యచ్ఛత్రములను గూర్చుచుండిరి. వేదికసమీపమున నొకసామాన్యాసనముపైఁ గూర్చుండి యొక యధికారి సేవకజనుల కాజ్ఞాపించుచు వారిచే నెల్లపనులను జేయించుచుండెను.

కొలఁదిదినములక్రిందట శోణగంగాసంగమమునకుఁ బురాతన రాజప్రాసాదవాతాయనము చెంత నిలుచుండి గంగాతరంగములను గాంచుచు మనకుఁ గానంబడిన పింగళశిరోజుఁ డగు బాలకుఁ డీసమయమున నాసభామండపమునం దిటునటుఁ దిరుగుచుండెను. అతఁడు క్రమముగా నావేదికకడ కరుదెంచి నిలిచెను. అతనిం గాంచినతోడనే సేవకు లందఱును దమతమపనులను క్షణకాల మాపివైచి యాతని నమస్కారపూర్వకముగా గౌరవించిరి.

బాల — ఈద్వితీయసింహాసన మెవ్వరికొఱకుఁ బంపబడినది?

పరిచారకులు — స్థానేశ్వరచక్రవర్తికొఱకు.

ఈవాక్యము వినినంతనే యాబాలకునిరూపము మాఱెను. ఆతని సుందరవదనమండలముపైఁ దక్షణమే క్రోధారుణరేఖలు ప్రసరించెను. అతఁడప్పుడు చెంతనున్న యొకగజదంతాసనమును గట్టిగఁ బట్టుకొనియుండెను. క్రోధకంపితమూర్తి యగు నాబాలకుని దృఢముష్టిబంధమునం జిక్కియున్న యయ్యాసన మాభారమున కాఁగఁ గా

లక వళవళ విఱిగిపోవుటకు సిద్ధముగానుండెను. అది గని పరిచారకులు భయముతో రెండడుగులు వెనుక కొదిగిరి.

శశాంకుఁడు కోపారుణితలోచనుఁడై కంపితస్వరముతో "ఏమంటిరి?" అనియెను.

ఎవ్వరు నెట్టిప్రత్యుత్తరము నియఁజాలకపోయిరి. అప్పుడు పరిచారకులపనులపై నధికారము సేయుచున్న పురుషుఁడు సమీపించి యువరాజున కభివాదన మొనరించి వినయవినమితుఁడై నిలిచియుండెను.

యువరాజు కోపముతో నాతనిఁగాంచి "ఎవ్వరి యాజ్ఞచే సింహాసనము నీవేదికపై నలంకరించుచున్నారు?" అని ప్రశ్నించెను.

ఆమాట కేమని యుత్తర మీయవలయునో తోఁపక యాయధికారి కళవళపడి కొంతసేపటి కట్లో యస్పష్టస్వరముతో "నేను వింటినిగదా—"—

ఆతనినోటినుండి మాట పూర్తిగ వెడలులోపలనే యువరాజొక్కయుదుటున వేదిక నారోహించి యానూతనసింహాసనము నొక్కయూఁపునఁ గాలితోఁ దోసివైచెను. ఆయూఁపున కాసింహాసన మెగిరి పదియడుగులదూరమునఁ బడిపోయెను. తోడనే ప్రచండమగుచప్పుడుతో నాసింహాసనము నీలశిలాఫలకములకుఁ దగిలి విఱిగి తుత్తునియలై పోయెను.

ఈయద్భుతసంఘటనముం గాంచి సేవకు లందఱును భయభ్రాంతులై యటనుండి పలాయితులై పోయిరి. యువరాజట్లు నృసింహావతారముందాల్చుటఁజూచి యాయధికారియు నటనుండి తప్పించుకొనిపోవుట కుద్యుక్తుఁడయ్యెను. ఇంతలో సభామండపమున కావలనున్న తెర ప్రక్కకొసగుటయు, నటనుండి వీరవేషధారి యగు నొక యున్నతపురుషుఁడును, స్థూలశరీరిణి యగు నొకవృద్ధస్త్రీయును, విదేశ సైని

కులతో సభాగృహమునఁ బ్రవేశించిరి వచ్చినతోడనే యావృద్ధస్త్రీ "ఇప్పు డేదియో పెద్దచప్పు డైన దెందుచేత? " అని ప్రశ్నించెను.

ఎవ్వరు నామెకుఁ బ్రత్యుత్తర మీయఁజాలక పోయిరి. కుమారపాదీయామాత్యుఁడును, యువరాజు శశాంకుఁడును దక్క నుత్తర మిచ్చుట కట నెవ్వరును లేకుండఁబోయిరి. క్రొత్తగ వచ్చినవారిం గని కుమారపాదీయామాత్యుఁడు దిగ్భ్రాంతుఁ డయ్యెను. ప్రత్యుత్తర మొసఁగుట కాతనికి ధైర్యము లేదు. శశాంకుఁడుమాత్రము నిశ్చలుఁడై యుండెను, అతఁడుమాత్ర మామెకుబదులు చెప్పఁదలఁచి యుండ లేదు. యువరాజా యురువురకును వెన్నుచూపి నిలిచియుండెను.

అధికారి యేమియో చెప్పఁబ్రయత్నించెను గాని యాతనినోటినుండి యేవియో యస్పష్టవాక్యము లెంతయో కష్టమున వెలువడియెను.

అప్పుడు యువరాజు మొగముద్రిప్పి యవజ్ఞాసూచకస్వరముతో "నాతండ్రిగారి స్వర్ణసింహాసనపార్శ్వమున స్థానేశ్వరరాజసింహాసనము నీసేవకులు చేర్చియుంచుటచే నేను దానిని గాలితోఁ ద్రోసివైచితిని. అది దూరమునఁ బడి విఱిగిపోయినది. " అనియెను.

యువరాజునోటినుండి వెడలిన యావాక్యములు కఠినములగు గోడలుగూడ గడగడవడఁకునట్లు నలుదెసలఁ బ్రతిధ్వనితము లయ్యెను. ఆవాక్యములు వీనుల సోఁకినంతనే వృద్ధస్త్రీతోఁ గూడివచ్చిన యాప్రౌఢవీరపురుషుని దేహ మాద్యంతమును గ్రోధారుణ మైపోయెను. ఆవెంటనే సమీపసైనికుల యొఱలనుండి వెలువఱచిన కృపాణముకలకలధ్వని వినవచ్చెను. ఆధ్వని నాకర్ణించి శశాంకునితో నున్న యాయధికారి భయభ్రాంతుఁడై ప్రాణముల నఱచేతఁ బెట్టుకొని యటనుండి పాఱిపోయెను.

వృద్ధస్త్రీ మెల్లమెల్లఁగ వేదికకడ కేతెంచి శశాంకుని చేతులనుబట్టుకొని యావేదికనుండి క్రిందికీడ్చుకొని వచ్చెను. తోడనే యామెతో వచ్చిన ప్రౌఢవీరుఁడొఱనుండి కరవాలమును వెలికిఁదీయుచుండెను. కాని, నగముతీయఁబడిన యాకృపాణ మట్లేయొఱలో నిలిచిపోయెను. ఇంతలోఁ దెల్లనివస్త్రములను ధరించియున్న యొకపురుషుఁడు పాదరక్షలను ధరింపకుండఁగనే యతిత్వరితముగ నచ్చటికి విచ్చేసెను. ఆతనిం దిలకించి యాపరదేశసైనికులెల్లరును వంగి యభివాదనములం గావించిరి. ప్రియపాఠకులారా! మీరీవృద్ధపురుషుని మున్నొక్కసారి వీక్షించియున్నారు. ఈతఁడే గుప్తవంశజుఁడగు ప్రస్తుతసార్వభౌముఁడు మహాసేనగుప్తుఁడు!

చక్రవర్తివీక్షణమున నాస్త్రీ మందహాసమొనరించెను. ఆ ప్రౌఢవీరుని మస్తకముకూడ నించుక వినమ్రమయ్యెను. కాని, యాసార్వభౌముఁడు జాలిగొలుపు దృష్టితోడను, గరుణనెఱపు వదనభంగితోడను నాస్త్రీవంకఁ గాంచుచుండెను. ఈనాకుమారుఁడగు శశాంకుని యపరాధమును సహింపవలయునను భావము సార్వభౌముని చూపులలోఁ బ్రతిభాసిత మగుచుండెను. ఎన్నియో తరములనుండి పాదుకొనియున్న సామ్రాజ్యగర్వ మాతనినోటినుండి మాత్ర మీమాటల ననిపింపలేదు. ఇంతే—

ఆవృద్ధస్త్రీ సార్వభౌమునిం గాంచి "సోదరా! శశాంకునింగూర్చి నాకేమియుం జెప్పనక్కఱలేదు. ఈబాలకుని విశృంఖలవర్తనముం గాంచి నాప్రభాకరుఁడు మైమఱచునంతటి వెఱ్ఱివాఁడు కాఁడు" అనియెను.

ఆప్రౌఢవీరుఁ డప్పటికిని దలవంచి పటపట దంతములు కొఱుకుచు నిలిచియే యుండెను.

వృద్ధస్త్రీ వేషముం గాంచిన యామె పంచనదదేశవాసినివలెఁ గానవచ్చుచుండెను. ఈకాలమునఁగూడఁ బంజాబుదేశపు యువతు లిట్టివస్త్రాలంకారములనే ధరించియుందురు. కపిశగాంధారదేశముల యందలి స్త్రీల యలంకారములందువలెనే యీయలంకారములందు ను స్త్రీసామాన్య మగు కోమలసౌందర్యాభావము దృగ్గోచర మగు చుండును. కొంచెము దూరమునందున్నచో నీదుస్తులవలన స్త్రీపురు షులను గుర్తించుట చాలకష్టము. కాని, మహోన్నతపర్వత వేష్టితంబు లగు దేశములలో నుండు స్త్రీల కింతకంటెను యోగ్యము లగు వస్త్రాలంకారములు లభించుట యసాధ్యమే. ఆ స్త్రీశిరోజములు వెండితీఁగలవలెఁ దెల్లనై యుండెను; కపోలములపై ముడుతలు కనఁ బడుచుండెను. ఆమె ముడుతలుపడిన పాయిజామాను, చోక్కాయిని, శిరస్సున శుభ్రవేష్టనమును దాల్చి యుండెను. ఆమె కేశపాశము వెన్నున విడివడియుండెను. ఆమె మృదుపాదములందుఁ బాదరక్ష లుండెను.

ఈవృద్ధస్త్రీ సార్వభౌముఁడగు మహాసేనగుప్తునకు సోదరి; స్థానేశ్వరపుమహారాజును గీర్తిశేషుఁడు నగు నాదిత్యవర్ధనుని పత్ని; ఈమెనామము మహాసేన. ఈమె వెనుకనే వచ్చిన ప్రౌఢవీరుఁ డాదిత్య వర్ధనమహారాజునకు జ్యేష్ఠపుత్రుఁడు; స్థానేశ్వరవంశమందలి ప్రథమ సార్వభౌముఁడగు ప్రభాకరవర్ధనుఁడు. ఆదిత్యవర్ధనుని జీవితకాల మందుఁగూడ మహాసేనయే తనపతిపేరున రాజ్యకార్యములను నిర్వ ర్తించుచుండెను. ప్రభాకరవర్ధనుఁ డీ స్థానేశ్వరసింహాసనము నధి రోహించిన పిమ్మటఁ గూడ నామె సింహాసనపురోభాగమునఁ దెర మఱుఁగున నుండి లోహదండపాణియై రాజకార్యపర్యాలోచనముం గావించుచుండెను. ఆమె కెనుబదియేండ్లప్రాయము వచ్చినను నామె యధికారము స్థానేశ్వరమున నప్రతిహతముగాఁ జరగుచుండెను. సింహాసనాధిష్ఠాతయైనను, సార్వభౌమబిరుదాంకితుఁడైనను, బంచనద

దేశోద్ధారకుఁడును, హూణాభీరఘూర్జర దేశములకుఁ బ్రత్యక్షకృతాంతమూర్తియు నగు ప్రభాకరవర్ధనుఁడు మహాసేన యాడించు కీలుబొమ్మయే యని యార్యావర్తమున సుప్రసిద్ధుఁడై యుండెను.

ఒకవంక మేనల్లుని హస్తమును, మఱియొకవంకఁ బుత్రునిహస్తమును బట్టుకొని యామహాసేన మందహాసముతో సభాగృహము నుండి వెడలిపోయెను. సార్వభౌముఁడును దలవంచికొని వారివెనుక నే పోయెను. అనంతరము పాఱిపోయిన సేవకజనులు మరల నచటికి వచ్చిరి. సభామండపము నలంకరించు కార్యములు మరలఁ బ్రారంభమయ్యెను. కాని, వేదికపై సామ్రాజ్యసింహాసనమే కాని మఱియొక్క యాసనమును నమర్పఁబడలేదు.

---

## ఐదవప్రకరణము.



నల్లనిమేనిచాయ మినమినలాడుచుండ నించుక వయసుమించిన ట్లగపడుచున్నయొక స్త్రీ తనయంగడిలోఁ గూర్చుండి పప్పు, బియ్యము నూనె, ఉప్పు, నేయి మొదలగువస్తువులతోడఁ దన చిఱునవ్వులనుగూడ విక్రయించుచుండెను. పాటలీపుత్రనగరము నందలి యధికసంఖ్యాకు లగుజనులలో బియ్యము, పప్పు మొదలగువస్తువులే గాక యాబిడ చిఱునగవులనుగూడఁ గొనుట కెందఱో యుండక పోలేదు. ఆయంగడికి లోపలివైపున మసకిదివఱకుఁ బరిచితుఁడైన తైలికుఁడు కూర్చుండి యామె యెవ్వరెవ్వరి కెంతహాసమును విక్రయించుచున్నదో యోరకంటితోఁ జూచుచుండెను; ఆ తైలికుఁడు తన వెంటఁ దీసికొని వచ్చిన బాలకుఁ డాయంగడికెదురుగా రాజవీథిలో ధూళిధూసరిత శరీరులును, కృష్ణవర్ణులు నగు ననేక బాలికా బాలకులతో నాడుకొనుచుండెను.

ఇంతలో నున్నతదేహుఁడును, స్థూలకాయుఁడును, గౌరవర్ణుఁడు నగు నొకపురుషుఁ డేవియో కొనుటకై యాయంగడియొద్దకు వచ్చెను. బియ్యము, నేయి మొదలగు ననేకవస్తువు లాయంగడియామె బలవంతముగ నాతని కంటఁగట్టెను. అతఁడన్నిటికిని వెలలిచ్చి వస్తువుల నన్నిటిని మూటఁ గట్టుకొనియెను ; గాని యది మిక్కిలి బరువగుటచే నాతఁ డొక్కఁడు నెత్తఁజాలకపోయెను. అందుచే నాతఁడు చిక్కులఁ బడుచుండుటం గాంచి యాయంగడియామె కోమలహృదయమున దయ గలుగుటయు నాతనికి సహాయ మొనరించుటకై యామె తన చోటునుండి లేచెను.

మన తైలికమహాశయుఁ డదియంతయుం జూచుచు నూరకుండఁజాలకపోయెను. తోడనే యాతఁడు తటాలున లేచి వెలుపలికి వచ్చి యాక్రియకు నుద్దేశించి స్పష్టముగా ‹అయ్యా! నేను మీవస్తువులమూటనుమీయింటికిఁ దీసికొని వచ్చెదను. అట్లు గాదేని మీతో మా బాలకు నైనఁ బంపెదను. అంతియకాని యెన్నఁడును మొగమైన నెఱుఁగని క్రొత్తవానితో నంతదూరము నాభార్యను బంపుట నాకిష్టము లేదు” అనియెను. అది కారణముగా నాయిరువురకును వాదప్రతివాదము లారంభ మయ్యెను. క్రమముగా నావాదము ముదిరి తుదకు మల్లయుద్ధముగాఁ బరిణమించున ట్లగపడియెను. కాని యంతలో నాయంగడియామె మధ్యవర్తినియై వారిపోరాటము నడగించివైచెను. ఆక్రియకునిమూట నా బాలకుఁడు మోసికొనిపోవునట్లుగా నొడంబడిక కుదిరెను.

పాపమాకుఱ్ఱవాఁ డాక్రియకుఁడందిచ్చిన యొకచిన్నమూటను దలపై నిడుకొని వానివెనువెంటనే నడచిపోవుచుండెను. ఆపురుషుఁడు ను కాలుపొడుగువాఁడగుటచే నతిత్వరితముగ నడచి ముందటికిఁ బోవుచుండెను. కాని యాపిల్లవాఁ డెంతవఱకు వచ్చెనో యని నడుమనడు

మ నిలిచి వెనుదిరిగి చూచుచుండెను. ఒక్కొక్కప్పు డాబాలకుఁ డా తనికిఁ గనబడనంతటిదూరమున వెనుకఁబడిపోవుచుండెను. అప్పు డా బాలుని వెదకుటకై యాతనికి వెనుదిరిగి రావలసివచ్చుచుండెను.

ఆపురుషుఁడు నడచిపోవుచున్న బాట నగరబహిఃప్రదేశమునం దలి నదీతీరమునంటి పోవుచుఁగ్రమక్రమముగా నధికవిశాల మగుచుం డెను. ఆమార్గమునకిరువంకలను మహోన్నతంబులగువృక్షములుండు టచే వానిఛాయలవలన నామార్గమంతయు నాచ్ఛాదితమైయుండెను. దాని కొకవైపున గంగాసికతాతలమును, మఱియొకవైపున శ్యామల తృణాంకురములచే నాచ్ఛాదితమగు విశాలప్రదేశము నుండెను. ఆసి కతాతలమునకుఁ జాలదవ్వున నొకవైపున గంగాప్రవాహమునన్ననిరేఖ కానవచ్చుచుండెను. ఆమార్గమున సాధారణముగాఁ బ్రాతస్సాయంకా లములయందుఁ దక్క నితరసమయములలో జనసంచార మంతగా నుండదు. కాని నేఁడొకవిశేషకారణ ముండుటవలన నాబాటయందు జనసముదాయము విశేషముగా నుండెను.

ఆజనసంఘమధ్యమునం దాబాలుఁడు కనఁబడకపోవుచుండు టచే నాపురుషుఁడు పలుసారు లతికష్టముతో నాతని వెదకుచుండవల సివచ్చెను. ఆబాటకుఁ గుడివైపునం దొక్కచో ననేకులు గుమిగూడి యుండిరి. వారందఱును సేనలోనివారని సహజముగనే బోధ యగు చుండెను. ఆసైకతప్రదేశమునందు సేనాశిబిరము లనేకము లమర్పఁ బడియుండెను, వానిముందటిభాగమున సైనికు లందఱు నేవియోపను లను జేయుచుండిరి. కొందఱు వంటకములఁ జేయుచుండిరి. కొందఱువా రికిఁ దోడుపడుచుండిరి. మఱికొందఱు నిత్యకర్మములం దీర్చికొని వృక్ష చ్ఛాయలఁ బరుండి నిదురించుచుండిరి. బాట కెడమవైపునఁ జెట్లక్రింద గొప్పగొప్పగుఱ్ఱములు నిలిచి యుండెను. వానియొద్ద గుఱ్ఱములసామా నులును, భల్లములును, కరవాలములును, ధనుర్బాణాదులును రాసు

లు రాసులుగాఁ బడియుండెను. వానినిబట్టి సైనికు లెట్టిప్రయత్నమునం దున్నదియు బోధ యగుచుండెను. త్రోవ కిరువంకలను దవ్వులనుండి శస్త్రాస్త్రపాణు లగుపరదేశసైనికులు శాంతిరక్షణము గావించుచుండిరి. గంగాస్నాన మాచరించి సైనికులు గుంపులుగుంపులై వచ్చుచుండిరి. కొందఱు సేవకులు గాడిదలపై నిడుపగంగాళముల నుంచి సైనికులకుఁ గావలసినంత పానీయజలమును దెచ్చుకార్యమునఁ దత్పరులై యుండిరి. మార్గమునందంతటను రథములును, శకటములును నిలిచి యుండుటచేఁ బాదచారులు బాగుగా నడచిపోవుట కవకాశము తక్కువగా నుండెను. అశ్వికయోధులు నగరమునుండి బండ్లకొలఁది భోజనసామగ్రిలను గొని తెచ్చుచుండిరి. సామానుల నొప్పగించి బండ్లు వెనుకకు మరలిపోవుచుండెను. నడుమనడుమ నశ్వారోహకులచేఁ బరివేష్టితము లగుశకటములు శిబిరములోపలికి వచ్చి సామగ్రిలను దించివైచుచుండెను.

నగరమునకుఁ గ్రోసెడుదూరమునం దున్న యొకవటవృక్షము క్రిందఁ గూర్చుండి కొందఱుసైనికులు వినోదకాలక్షేపము గావించుచుండిరి. వారిచెంత బల్లెములు రాశిగాఁ బడియుండెను. ప్రక్క నేలపై నొకబాలిక—బాలికగాదు-బాల్యతారుణ్యములకు నడిమివయసునం దున్నదనుటయే సమంజసముగా నుండును. ఆమెహస్తద్వయమును జర్మఖండముతోఁ గట్టఁబడి నేలనాటఁబడియున్న యొకగుంజకు గట్టిగా నొకకొస గట్టివేయఁబడి యుండెను; ఒక్కొక్కప్పు డాబాలిక యించుక తలపైకెత్తి యాజనసముదాయమువంకఁ జూచుచు నాక్షణమునందే హతాశయై మరల నేలపైఁ నొఱఁగుచుండెను. వృక్షచ్ఛాయలం గూర్చుండి యున్నవారిం గాంచినచో వారు పంజాబుదేశవాసులవలెఁ దోఁచుచుండిరి; వారిలో నొకఁడు చర్మపాత్రమున మద్యపానముం గావించుచు నాప్రసాదమును దోడివారికిఁ బంచిపెట్టుచుండెను; అట

నున్నవారిలో నొక్కఁడునుగూడ నాకన్నిటివంకఁ గడకంటనైనఁ జూచుట లేదు;

మన తెలికునిచేఁ బంధింపఁబడిన బాలకుఁడు మూటను నెత్తిపైఁ బెట్టుకొని యాపురుషునితో వచ్చుచుఁ గ్రమక్రమముగా నాచెట్టుకడకు వచ్చి గమనాయాసముచే వగర్చుచుఁ దలపైనున్నమూట నచ్చట దింపికొని యించుక సేపువిశ్రమించుతలంపునఁ గ్రిందఁ గూరుచుండెను; అనంతర మాతఁడు బాలోచితచాపల్యమున నిటునటు పరికింప నారంభించెను. ఆ బాలిక యేకాగ్రదృష్టితో నాతనివంకనే చూచుచుండెను. ఇంతలో వివిధవర్ణంబులగు వస్త్రాలంకారములం గైసేసియున్నమగధ దేశపదాతిసైనికవర్గము వాద్యములగంభీరధ్వనులకు సరిగా నడుగులను బచరింపఁజేయుచు నామార్గముననే వచ్చుచుండెను.

బాలకునిమూట యెక్కడిదక్కడనే పడియుండెను. కొంతసేపటికా బాలుఁడు వేచి యటునిటు పరిచారము చేయుచు నాబాలికం గాంచి యాశ్చర్యచకితుఁడై యొక్కపరుగున నామెను సమీపించి పెద్ద యెలుంగున తొట్రుపడ "ఎవరు ? అక్కా ! నాఅక్కా !" అని యఱచెను.

ఆసంబోధనస్వరము నాలకించి యానవాలు పట్టి యాబాలికయు నాశ్చర్యచకితయై మొగముత్రిప్పిచూచి కెవ్వునఁ గేకవైచెను. అప్పు డాబాలకుఁడు చటాలునఁ బోయి యాబాలికకంఠమును బిగియారఁ గౌఁగిలించుకొనియెను. ఈస్థితిలో నాసోదరీసోదరులిరువురు నొక్కింతసేపు నిస్తబ్ధులై కన్నులనుండి యశ్రుధారల వెలార్చుచుండిరి.

ఇంతలో నావిదేశసైనికులదృష్టి యీవంకకు మరలెను. తాము నిర్బంధించినయొక్కబాలిక కాక యట నిప్పు డిరువురుండుటం గాంచి వారాశ్చర్యపడిరి. అప్పుడు సురాపానమత్తుఁడైయున్నసైనికుఁ డాబాలికను సమీపించి కొంతసేపటివఱకు నేమియుం దోఁచక యాబాలికా

బాలకులను గాంచుచు నిర్వేఱపడి నిలిచి యనంతరము తీవ్రస్వరముతో "ఆఁ! ఇదేమి? వీఁడెక్కడనుండి యూడిపడినాఁడు" అనియెను.

బాలిక శోకగద్గదస్వరముతో "వీఁడు నాతమ్ముఁడు" అనియెను.

సైనికుఁడా మెపై నెగసిపడి "లే! ఎక్కడితమ్ముఁడు? తమ్ముఁడు! ఇచ్చటఁ దమ్ముఁడును గిమ్ముఁడును బనికిరారు! తత్క్షణమే వీనినిటనుండి పొమ్మనుము!" అని యదలించెను.

ఆసైనికుని కర్ణకఠోరం బగువాక్యమాకర్ణించి యాబాలిక రోదనము చేయుచు బిగ్గరగాఁ గేకలిడ నారంభించెను. ఆమెశోకధ్వనితోఁ దమ్ముని దుఃఖారావము లీనమయ్యెను. అది గని యావిదేశసైనికుఁడత్యాగ్రహావేశవివశుఁడై యాబాలకునిచేయి పట్టుకొని బలవంతముగ నీడ్వనారంభించెను. బాలకుఁడు భయవిహ్వలుఁడై యత్యుచ్చస్వరంబున పిలపింప నారంభించెను. "అక్కయ్యా! ఇఁక నిన్ను విడిచి పోలేనే! అక్కయ్యా! నేను—పో—లేనే! అక్కా! అక్కా!" అని యేడువఁదొడంగెను.

ఆశోకాకులనాదము నాలకించి నలుదెసలనుండియు జనులు గుంపులుగుంపులై వచ్చి యచ్చట మూఁగసాగిరి. వారిలో నొకఁడు "ఓరీ! ఏమిరా యిది?" అనియెను.

ఇంకొకఁడు—మీరీబాలికాబాలకుల నిట్లేల బాధించుచున్నారు?

మూఁడవవాఁడు—చూడుము! చూడుము! ఈపిల్లను వీరెట్లు బలవంతముగా బంధించినారో!

చాలమందిజను లచ్చట మూఁగి యుండుటం గాంచి యప్పుడొకశాంతిరక్షకభటుఁ డచ్చటి కరుదెంచి "ఏమి? ఏమియీగందరగోళము!" అనియెను.

అప్పుడటనున్న పదిమందియును నొక్క టేమాటగా "సురా పానమత్తులై యున్నయీపరదేశీయులీబాలిక నూరక కొట్టుచున్నారు. ఈమె సోదరుఁడగు నీబాలకుఁడు వచ్చి యీబాలికను విడిపించుకొనిపోవుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు" అని చెప్పిరి.

సోదరీసంరక్షణమునకై ప్రయత్నించుచున్న యావీరసోదరు నాకారమునీక్షించి యాశాంతిరక్షకభటుఁడు కడుపుబ్బ నవ్వుకొనియెను. పిమ్మట శాంతిరక్షకుఁ డడుగుటయు నావిదేశసైనికుఁడు దృఢస్వరముతో 'ఈపిల్ల నాచే నిర్బంధింపఁబడియున్నది. మార్గమధ్యమునం దీమె నాకు దొరకినది. అప్పటినుండియు నీమె నాయొద్ద నేయున్నది. ఈపిల్లవాఁ డెవ్వఁడో నేనెఱుఁగను. ఇందు నేనెవ్వరిని గొట్టను లేదు; తిట్టను లేదు." అనియెను.

అంతలో మనకుఁ బరిచితుఁడగు బియ్యముపప్పుకొన్న పురుషుఁడు చాలసేపటినుండి బాలకుని వెదకుకొనుచుఁ దుదకీవటవృక్షసమీపమున గుంపుండుటగాంచి యిచ్చటికి విచ్చేసెను. గుంపుమిక్కుటముగా నుండుటచే నాతఁడాజనులచుట్టును రెండుమూఁడుసారులు తిరిగి చూచెనుగాని లోపల నేమిజరుగుచున్నదో యాతనికిఁ గనఁబడలేదు. ఆతఁడు మెల్లమెల్లగా నాగుంపునొత్తిగించుకొని లోపలివైపునకుఁ బోయి చూచెను. అట నొకచోఁ బడియున్న సామానుల మూట ముందుగా నాతని కగపడియెను. అది గని యాతఁడింకను సమీపించి చూచెను. వానిపిల్లవాఁ డొకసుందరబాలికపైఁ బడి యేడ్చుచుండెను.

ఆతఁడు బాలకునికడకుఁ బోయి "ఏమిరా యిది? నీవిక్కడఁ గూర్చుండి యేడ్చుచున్నావేమి?" అని యడిగెను.

ఆపురుషునిం గాంచినంతనే బాలకునిరోదనము మఱింతయధికముకాసాగెను. అప్పుడా బాలకుఁ డస్పష్టస్వరముతో "నేనిఁక నెప్పుడును నాయక్కను విడిచి యుండను" అనియేడువఁదొడంగెను.

అది గని యాపురుషుఁ డాశ్చర్యచకితుఁడై పోయెను. అప్పుడటనున్న వారందఱు నాతని ననేకప్రశ్నలు వైచుచు బాధింపఁదొడంగిరి. తుద కాపురుషుడట నున్నవారందఱంగాంచి "నేనుస్థానేశ్వర సైనికులలో నొక్కఁడను. నిన్నరేయంతయు రాజభవనద్వారరక్షకకృత్యమును నిర్వహించి యీయుదయమున బియ్యము, పప్పు మొదలగుసామగ్రిలను గొనితెచ్చుకొనుటకై యంగడికిఁ బోయితిని. ఆ సామగ్రిల మూట పెద్దదై వాకొక్కనికిని బరువైనందున నంగడివాఁడు వాకుసాయముగా నీకుఱ్ఱవానిం బంపెను. ఈపిల్లనుమాత్రము నేన్నఁడును జూచియుండలేదు." అని చెప్పెను.

మార్గమధ్యమునం దాబాలికను బట్టుకొని తనవెంటఁ బెట్టుకొనివచ్చిన విదేశసైనికుఁ డప్పుడు యీబాలిక యీపాటలీపుత్రనగరమునకు సంబంధించినది కాదు" అని శపథపూర్వకముగా నెఱింగించెను.

చూచుచుండఁగనే జనులచ్చటికి గుంపులుగుంపులుగా వచ్చిచేరుచుండిరి. కుటీరములయందలి శాంతిరక్షకభటులుకూడ నచ్చటికి వచ్చిరి. కాని యెంతప్రత్నించినను వారచ్చటికలకలమును వారింపఁజాలకపోయిరి. క్షణక్షణమునకును మూఁగి పోవుచున్న జనసమూహము నాఁపఁజాలకపోయిరి. నాగరికులసంఖ్య ప్రతినిమిషమునకును వర్ధిల్లిపోవుచుండెను. అందుచే నగరవాసుల పక్ష మధికబలవంతమయ్యెను.

చూచుచుండఁగనే యాయిరుతెగలవారికిని నతిగంభీర మగు పోరాటము పొసంగెను. మొట్టమొదట వాదవివాదములు, దూషణాధిక్కారములు, తర్జనభర్జనములును ప్రారంభమయ్యెను. మెల్ల

మెల్లఁగా నవి ముష్టాముష్టికివచ్చెను. పాప మాకొలఁదిమంది శాంతిర క్షకులు నేమిచేయఁగలరు? ఆపోరు మాన్పఁజాలక వారటనుండి పాఱి పోవలసినవారైరి.

అల్పకాలముననే యీయుభయపక్షముల హస్తాఘాతప్ర త్యాఘాతములును నల్పయుద్ధముగాఁ బరిణమించెను. స్థానేశ్వర సైనికు లు యుద్ధముకొఱకే వచ్చినవారు గావున వారియొద్ద శస్త్రాస్త్ర ములు సంసిద్ధముగనే యుండెను. కాని, పాటలీపుత్రపౌరులు యుద్ధ మునకు వచ్చియుండలేదు. వారిలోఁ గొందఱు బండివాండ్రు, కొంద ఱు గాడిదలవాండ్రు; అందును గొందఱు కూలివాండ్రును, గొందఱు జలవాహకులును, గొందఱు మూటలను మోచికొని వచ్చినవారు ను—అయినను నచ్చటఁ జేరిన పాటలీపుత్రపౌర సంఖ్య స్థానేశ్వర సై న్య సంఖ్యకు మూఁడింత లధికముగా నుండెను.

స్థానేశ్వర సైనికులు మొట్టమొదట సిద్ధముగా లేకుండుటచేఁ దొలుతటి దెబ్బల కాఁగక మూఁడునాలు గడుగులు వెనుక కరిగిరి. కాని యీవెంటనే వెలువడిన వారికఱకుకరవాలముల తళతళలయె దుటఁ బాటలీపుత్రనాగరికులే వెనుకంజ వేయవలసినవారైరి. కొం దఱితలలు పగిలెను. కొందఱికరపాదములు ఖండఖండములయ్యెను. కొందఱాజన్మాంధులుగఁ గావింపఁబడిరి. కొందఱుకుంటివారైరి. కాని యెవ్వరునుమాత్రము చావలేదు. రక్తపాత మారంభమైన వెంట నే నాగరికులు వెనుకకు మరల నారంభించిరి. కాని,పూర్తిగఁ బాఱిపో లేదు. చెట్లచాటునను, దిబ్బలమఱుఁగునను నిలిచి పరులపై శిలాఖం డవృష్టిని గురియించుచుండిరి.

ఆసమయమున గంగాతీర సమీపమునఁ బోవుచుండు రాజమార్గ మునఁ బాటలీపుత్రసైన్యములోని యొకభాగము నగరమునుండి శిబిర ములకడకు వచ్చుచుండెను. కాని, యీసైనికులఁ గాంచినను మన

నాగరికుల కుత్సాహ మధికము కాదయ్యెను. సరిగదా యాసైనికు లంగాంచినంతనే యానాగరికు లొక్కరొక్కరుగా నటనుండి పాఱిపోవ నారంభించిరి. తమకు సాయము చేయకుండుటయే గాక తాముపో రాడుచున్నందుల కాసైనికులు తమ్ము శిక్షింతురేమోయని యా నాగరికులకు భయము దోఁచెను.

ఆసమయమునకు సరిగా నదీతీరమునందలి యామార్గమును బట్టి యొకరథ మతివేగముగ నగరాభిముఖమై పోవుచుండెను. అది యాసమీపమునకు వచ్చినంతనే యెచటనుండియో యొకపెద్ద ఱాయి రివ్వున నెగసి వచ్చి రథసారథితలపైఁ దగిలెను. ఆదెబ్బతో నాక్షణమునందే సారథిరథమునుండి క్రిందికిఁ బడిపోయెను తోడనే రథ్యములు రెండును బెదరి తమయిచ్చవచ్చినరీతిని విచ్చలవిడిగఁ బరుగువాఱసాగెను. ఈవిలక్షణవ్యాపారముం దిలకించి రథమునం దున్నవ్యక్తి తటాలునఁ గ్రిందికి దుమికెను. రథముమాత్ర మతివేగముగా నగరాభిముఖమై వెడలిపోయెను.

రథమునుండి యుఱికిన పురుషుఁడు ముందుగా సారథిని సమీపించి కొంతతడ వల్లెపరికించెను. వాఁడు మరణింపలేదు. కాని మస్తకముమాత్రము చీలియుండెను. శోచనీయంబగు నాతని యవస్థం గాంచి యాపురుషుఁడు క్రోధావేశపరవశుఁడయ్యెను. ఆతని ముగ మెఱ్ఱఁబాఱెను. అప్పుడే సరిగ నాగరికుఁ డొకఁడు రువ్వినశిలాశకల మాతనివీనులందాఁకునట్లు రివ్వున ధ్వని సేయుచుఁబోయి యొకకుటీరమునకుఁ దగిలి క్రిందఁ బడిపోయెను? అది గని యావీరుఁ డాశ్చర్యవివశుఁడై యొఱనున్నకరవాలమును వెలువరించి ఱాళ్ళుపడుచున్నవైపున కతివేగముగ నభిముఖుఁడై పోయెను. వైరులపైని శిలావర్షము గురియించుచున్నవా రందఱును నొకచెట్టుచాటున నిలిచి మొగములను మాత్ర మావంకకుఁ ద్రిప్పియుండిరి. అప్పుడు శిలావర్షవేగము తగ్గుట

యు సైన్యము మెల్లగ నగరసమీపమునకు వచ్చుచుండెను. పౌరులు తమకు దొరకిన త్రోవను బట్టి పలాయితులగు చుండిరి.

చెట్టునీడను నిలిచియున్న వారందఱును మనరక్షకుని విలకించి శక్తిఁ గోలుఁడిని పాఱిపోవుట కారంభించిరి. వారిలో నొక్కఁడు బాగుగఁ బరికించి "ఓరీ! వీరు మనయువరాజుగారురా" అనియెను.

ద్వితీయుఁడు—(పరిహాసముగా) నీకేమైనఁ బిచ్చిపట్టలేదుగద! మనయువరాజుగా రింతవారా? ఈసమయమునవారిక్కడ కేలవత్తురు?

మొదటి—ఏమి! యువరాజిటకు వాహ్యాళిగా వచ్చుటయు నసంభవమేనా?

ద్వితీయుఁడు—ఛేమ్; యువరాజీరెండుజాముల నడియెండవేళ నీబయటికి వాహ్యాళివచ్చుట యీనగరమునందు మఱి యెచ్చటను జోటు లేకయేనా?

మొదటి—సరిసరి! యువరాజునకొక్కొక్కప్పుడు మతి చలించి పోవుచుండు ననుసంగతి నీకుఁ దెలియదు గాఁబోలును!

ద్వితీ—అట్లయిన నీవు పోయి మీయువరాజును దర్శించి రమ్ము. నేనేమో పాఱిపోవువాఁడనే.

మొదటివాఁడు చెట్టుచాటునుండి వెలువడి వచ్చి "యువరాజునకు విజయ మగుఁగాక" అనియఱచుచు నావీరపురుషునకుఁ బ్రణామముం గావించెను. ఆవీరుఁ డాతనివంక విస్మితనయనములతో వీక్షింపసాగెను. ద్వితీయుఁడు పలాయితుం డగుట కుద్యుక్తుఁ డయ్యెను. వీరుఁ డాతని నాఁగుమని వారించెను. ఆకంఠస్వరము నాకర్ణించి వాఁడాశ్చర్యపడుచు నడుగు కదపకుండ నిలిచి "యువరాజునకు జయమగుఁగాక!" అనియెను.

అప్పు డందందు దాఁగియున్న నాగరికులందఱును ధైర్యము తెచ్చుకొని యొక్కొక్కరుగ వెడలివచ్చి యాపురుషునకభివాదనముం

గావింపఁదొడంగిరి. నిమిషములో నాభూరుహచ్ఛాయయంతయును జన సమూహముతో నిండిపోయెను. పాటలీపుత్రపౌరులు పాఱిపోవుటం గాంచి స్థానేశ్వరసైనికు లింతవఱకును నిశ్చింతులై యుండిరి. కాని మరల నావృతచ్ఛాయను జనులు నిండియుండుటం జూచి వారును ఱాళ్లు రువ్వుట కారంభించిరి. ఒక్కయిటుకతునుక యువరాజు శిరస్త్రాణము నంటిదూసికొనిపోయెను. అది చూచి నాగరికులు మరలఁ జెలరేఁగిరి.

ఈసమయమున నే సైన్యభాగ మూపోరుచున్నచోటికి వచ్చి చేరెను. అచ్చటిజనసమూహముంగాంచి తమనాయకు నాజ్ఞచే నాసేన యాప్రదేశముననే యాఁగెను. మనవీరపురుషుఁ డాసేనను సమీపించి నాయకునిం గాంచి నన్ను గుర్తించితివా?" అనియెను.

నాయ—లేదు.

వెంటనే యావీరుఁడు తనశిరస్త్రాణమును దీసెను. అంతనాతని పింగళకేశకలాపము విడివడి మూపునను భుజములను వ్రేలాడఁదొడంగెను. సేనానాయకుఁ డప్పుడు లక్ష్యపూర్వకముగాఁ దిలకించి యాపురుషున కభివాదన మొనరించెను.

తోడనే మగధసైనికు లందఱును జయధ్వనులం గావించిరి. నాగరికులుంకూడ నాధ్వనులతోఁ దమజయధ్వనులను గలిపిరి, ఆపురుషుఁడు నిజముగా యువరాజుశశాంకుఁడే. దేహమున లోహకవచముండుట వలన నాపదునాలుగేండ్లకుమారుఁడు నొక బలశాలి యగువీరపురుషునివలెఁ గన్పట్టుచుండెను.

కుమారుఁడు—విశేషము లేమి?

నాగరికులు—ఈవిదేశసైనికు లొకబాలికను బట్టికొని పోవుచున్నారు. ఆపిల్లను వదలివేయుఁడని మేమందఱమును జెప్పితిమి. అందుపై వారందఱును జెలరేఁగి మాపై నొక్కుమ్మడిం బడి పోరాడఁదొడంగిరి.

గాయములైనవారందఱును దమతమగాయములను యువరాజునకుం జూపిరి. శస్త్రవిహీనులైయున్న యానాగరికులకుం దగిలినశస్త్రఘాతముల నవలక్షించి మగధసైనికులు కోపావిష్టులైరి. మఱియును బడిపోయిన సారథిం గాంచిన యాసైనికులను శాంతింపఁ జేయుట యెంతో కష్టమయ్యెను.

యువరాజు నాజ్ఞానుసారము సేనానాయకుఁడు స్థానేశ్వరుసశిబిరమునకు బయలుదేఱెను. కాని వెనుకనుండి శిలావృష్టియగుచుండుట వలన నాతఁడు మరల వెనుకకు మరలవలసివచ్చెను. అనంతరము యువరాజునానతిం గైకొని మగధసేన యాసేనపైఁబడి చెల్లాచెదరు గావించెను. స్థానేశ్వరసైనికులు మద్యపానోన్మత్తులైయున్నందున నధికప్రయాస లేకుండఁగనే పరాభవింపఁబడిరి. మత్తులేనివా రొకరిద్దఱు మాత్రము పిక్కబలముచూపి పలాయితులై ప్రాణమును దక్కించుకొనిరి. తక్కినవారల్లే క్రిందఁబడిపోయిరి. ముగ్గురునలుగురుమాత్రము పట్టి తేఁబడిరి.

కుమారశశాంకు నాజ్ఞానుసారము మనకుఁ బరిచితులైన బాలికాబాలకులు బంధవిముక్తులై రాజమార్గమునకుఁ దేఁబడిరి. వారిని దనరథమునఁ గూర్చుండఁబెట్టుకొని కుమారశశాంకుఁడు నగరాభిముఖుండై వెడలిపోయెను. అనంతరము సైనికులును నిష్క్రమించిరి.

అప్పుడు సాయంకాల మగుచుండెను. ఇంతలోఁ బైనివివరించిన యుద్ధవ్యాపార మంతయు నగరమం దంతటను వ్యాపించెను. దుష్టులును,కలహప్రియులునగుజనులు గుంపులుగుంపులుగా వచ్చుటచే నాగరికులసంఖ్య యగణితమయ్యెను. సైనికులు వెడలినతరువాత నాగరికులు శత్రుశిబిరములఁ గొల్లగొనఁదొడంగిరి. వారిని వారించుట శాంతిరక్షకుల కసాధ్య మయ్యెను. తుదకు నాగరికులు వారినిగూడఁ గొట్టి పాఱఁదోలిరి. వారట్లు దోచుకొని శిబిరముల కగ్గిని ముట్టిం

చిరి, గగనపర్యంతమును వ్యాపించియున్న యగ్నిజ్వాలలం గాంచి స్థానేశ్వరసేనాపతి తమశిబిరములం దేదో యపాయము కలిగినదని యనుకొనెను. తోడనే యాతఁడు నగరమునందున్న పదివందెండువందలయుంగరతుకసైనికులతో శిబిరములకడకు వచ్చిచూచెను. అప్పటికప్పుడే శిబిరము లన్నియు నగ్నిదగ్ధములై భస్మరాసులైపోయెను. అగ్నిజ్వాలలు చాలవఱకుఁ జల్లారిపోయెను. సురాపానప్రమత్తులైయున్న సైనికులతోఁ బోరు సలిపి నాగరికులు శిబిరముల నగ్నిముట్టించి ధ్వంసము చేసి రనుసంగతి యప్పు డాతనికిఁ దెలియవచ్చెను.

---

## ఆఱవ ప్రకరణము.



రోహితాశ్వదుర్గ మతిప్రాచీన కాలమునుండియు నార్యావర్త దేశచరిత్రమునఁ బ్రఖ్యాతిగాంచి యున్నది. ఇది దక్షిణమగధకరూశదేశముల దక్షిణసీమలో నున్నది. అరణ్యములచే నిండియుండు నావిశాలప్రదేశమున కీరోహితాశ్వదుర్గ మొక్కటియే ప్రవేశద్వారమైయుండెను. చరిత్రారంభము మొద లిప్పటివఱకు నీదుర్గాధిపతులే యీయరణ్యవాసులందఱకు నేలికలైయున్నట్లు తెలియవచ్చుచున్నది. మహమ్మదీయులవిజయానంతరము "రోహితాశ్వదుర్గము" అనుపేరు మారి దీనికి "రోహితా" యనుపేరు వచ్చెను. పఠానులయు, మొగలులయుఁబరిపాలనకాలములలో రోహితాశ్వదుర్గాధిపతులే సుబాబిహారునకు దక్షిణభాగసంరక్షకులై యుండిరి. శేర్షహా, మానసింహుఁడు, ఇస్లాంఖాను, శాయేస్తఖాను మొదలగు చరిత్రప్రసిద్ధపురుషులనామములు లీరోహితాశ్వదుర్గమున కపరిచితములు కావు. వీరెల్లరు నీప్రాచీనదుర్గజీర్ణభాగములలోఁ దమతమస్మృతిచిహ్నముల నుంచియే పోయియున్నారు.

ఈదుర్గరాజ మతిప్రాచీన కాలమున — అనఁగాఁ జరిత్రములలో నుపలబ్ధములు గాని సంఘటనములు జరగియున్న యా కాలమున — నిర్మింపఁబడినది. నదీగర్భమువఱకును వ్యాపించియున్న పర్వతభాగము నందలి యత్యున్నతశృంగముపై నీదుర్గము నిర్మింపఁబడియెను. ఆయు త్తుంగశిఖరము గాంచిన నది శోణానదీగర్భము నుండియే యుత్పన్న మైనట్లు తోఁచును.

తదనంతరము పదుమూఁడువందలసంవత్సరముల యతిదీర్ఘ కాలము గడచిపోవుటచే నీవిశాలకాలగర్భమునందు శోణనది తన గమనమార్గమునే మార్చివైచినది. ఇప్పుడు శోణనది పాటలీపుత్ర నగరపార్శ్వమునుండి గాని, రోహితాశ్వదుర్గసమీపమునుండి గాని, ప్రవహించుట లేదు. వేసఁగిండ్లక్రిందట శోణనదీజలము ప్రవహించు చున్న ప్రదేశములలో నిప్పుడు తృణాంకురాచ్ఛాదితంబు లగుక్షేత్ర భూములును, వృక్షావళీవేష్టితంబు లగుననేకగ్రామములును విలసిల్లుచుఁ గన్నులపండువు సేయుచున్నవి. వింధ్యాచలపాద మిప్పుడు తీరమునకు బహుదూరమునందున్నది.

ఆ పర్వతోత్తుంగశిఖరముపై నీ రోహితాశ్వదుర్గము కట్టఁ బడినది. దుర్గము రెండుభాగములుగా విభజింపఁబడియెను. ప్రచండ మును, విశాలమునైన యా పర్వతశిఖరప్రదేశమునకుఁ జుట్టును గఠినపాషాణములచే నభేద్యతటమును నిర్మించి యాక్రిందిభాగమునఁ గోట కట్టఁబడి యుండెను. ఈభాగమున దుర్గపువైశాల్య మెటు చూచినను నూఱడుగులకంటె నెక్కుడుగ లేదు. కాని, యాభాగ మువఱకు నధిరోహించి పోవుట దుస్సాధ్య మగుటచే నాదృఢదుర్గ మితరుల కజేయమనియే చెప్పవచ్చును. రోహితాశ్వదుర్గము నిర్మించిన తరువాత నది యొకటిరెండుసారులకంటె నధికముగా శత్రువులచేఁ జిక్కి యుండలేదు.

ఆదుర్గమున కుత్తరద్వారముచెంత స్థూలశరీరుఁడును, వృద్ధుఁడు నగునొకపురుషుఁడు కూర్చుండి దంతధావనము చేసికొనుచుండెను. ఆతనిదగ్గఱ దంతధావనము సేయుచుఁ జాలసేపటివఱకును గూర్చుండి యుండెను. ఆతని ప్రాతఃకృత్యవిధి పూర్తియగులోపలనే దుర్గద్వారముకడ నెవ్వరిదో యడుగులచప్పుడు వినవచ్చెను.

చూచుచుండఁగనే యొకబాలిక యతిత్వరితముగా నచ్చటికి వచ్చెను. ఆబాలిక యసమానరూపవతి; ఉంగరములవలెఁ జుట్టుకొని యున్న యామె లంబకుంతలములు ముక్తములై మూఁపున వ్రేలాడు చుండెను. ఆకుమారిక వృద్ధునిం గాంచినంతనే తన గమనవేగము నొకింత మందగింపఁజేయుటకు యత్నించెను. ఆప్రయత్నమువలన నా జాఱునేలను గాలుజాఱుటచే నాబాలిక యొకపాషాణఫలకముపైఁ బడిపోయెను.

అది చూచి యావృద్ధుఁడును, నటనున్న సేవకుఁడును, గూడ నులికిపడిలేచి పోయి యాబాలికను లేవనెత్తిరి. అదృష్టవశమున నామె కెక్కడను దెబ్బలుఁ దగులలేదు. బాలిక లేచి యుచ్ఛ్వాసముతో "తాతా! ఇంటఁ బిడికెఁడుపిండిగూడ లేదని నానియా యనుచున్నది! నేఁడు మనకుఁ దినుట కేమున్నది?" అనియెను.

అవృద్ధుఁడు పరమాదరముతో నాబాలికశిరమునఁ జేయుంచి మందహాసము చేయుచు "అమ్మా! నీవింత భయపడియెద వేల? ఇంట గోధుమ లున్నవిగదా! రఘువు వానిని విసరి మనకుఁ బిండి తెచ్చి యిచ్చును" అనెను.

బాలి—లేదు తాతా! లేదు. నానియా యొక్కపెట్టున నేడ్చుచుఁ గూర్చున్నది. ఇంట నొక్కగోధుమగింజకూడ లేదనుచున్నది.

బాలికవచనము నాకర్ణించి యావృద్ధునివదన మతిగంభీర మయ్యెను. కొంతవడి కాతఁడు "సరే! బిడ్డా! నేనిప్పుడు వేఁటకుఁ

బోయి యేమైనఁ దెచ్చెదను. ఓరీ! రఘూ! నాధనుర్బాణముల నిటు తెమ్ము!" అనియెను.

రఘువు కోటలోనికి వెడలిపోయెను. బాలిక పితామహునికంఠ మును బ్రగాఢముగఁ గౌఁగిలించుకొని శోకస్వరముతో "తాతా! కాని—పక్షిమాంసమును, లేడిమాంసమును, నేనుదినలేను. నాకవి యేమో గాని దుర్వాసనగా నుండును "అనియెను.

వృద్ధుఁడు చింతాక్రాంతుఁడై మౌనముతో నుండెను. ఇంతలో రఘువు లోపలినుండి ధనుర్బాణములను దీసికొని వచ్చెను. వృద్ధునిదృష్టి యావైపున లేదు. బాలిక విస్మితయై పితామహునిరూపము నని మిషలోచనములతోఁ దిలకించుచుండెను.

కొంతసేపటి కావృద్ధుని పరధ్యానము వదలెను. ఆతనికన్నుల నుండి యొకటిరెండశ్రుబిందువులు వెడలి ముడతలుపడిన కపోలము మీఁదుగ నాతనిశ్వేతశ్మశ్రువులపైఁ బడియెను. అప్పు డాతఁడు తనసేవకునిం గాంచి "ఈధనుర్బాణములనెప్పటిచోట నుంచి నీవు నాతోఁ గూడ రమ్ము!" అనియెను.

పిమ్మట నావృద్ధుఁడు పౌత్రిని వెంటఁబెట్టుకొని కోటలోని కరిగెను. తృణాంకురములతోడను, నరణ్యలతాదులతోడను నిండియున్న పటాంగణమును గడచి వారు బాలదుర్గప్రాంతముననున్న యొకచిన్న గదిలోఁ బ్రవేశించిరి. ఆగదికిఁ జేరియున్న యింకొకగదిలోనే యింటివృద్ధదాసి యగునానియా యింటనేమియు లేవని యేడ్చుచుఁ గూర్చుండి యుండెను. ఆమె యావృద్ధునిం గాంచినంతనే కన్నీరు తుడిచికొని భయముతో నూరకుండెను.

ఆగదిలో నొకమూలనున్న భూగృహమునం దొకచిన్న యినుప పెట్టెయుండెను. ఆవృద్ధుఁ డాపెట్టెను సేవకసహాయముచే నెట్లో వెలుపలికిఁ దీసి తెఱచి యందున్న గుండ్రనికరండము నొకదానిని బైకిఁ

దీసెను. ఆకరండము ప్రీతగుడ్డపేలికలతోఁ జుట్టఁబడియుండెను. దానికి వాఁడినపూలమాలయొకటి చుట్టఁబడియెను. ఆవస్త్రమును దీసి కరండమును దెఱచినంతనే యందుఁ దేజోమయంబు లగురత్నములచేఁ గూర్పఁబడిన యొకసువర్ణవలయము కానవచ్చెను.

ఆతఁ డారత్నవలయమును సేవకునిచేతి కిచ్చి "ఓరీ! నీవు దీనిని దీసికొని యూరిలోని కరిఁడి ధనసఖుఁ డనుకంసాలికి విక్రయించి యాసొమ్ముతోఁ గొంచెము పిష్టమును, గోధుమలను కొనితెమ్ము!" అని యాజ్ఞాపించెను.

ఆరత్నవలయము సేవకునిచేతి కిచ్చెనపు డావృద్ధునికరము కరము గంపించిపోయెను. అది యాస్వామిభక్తుఁ డగుసేవకునకుఁ గానఁబడకుండఁ బోవునా? వానినేత్రము లొక్కసారిగా నశ్రుపూరితములయ్యెను గాని యాతఁడేమియు మాఱుమాటచెప్పక స్వామియాజ్ఞను నిర్వహించుటకై యటనుండి యతిగభీరహృదయములో, మందగమనముతో వెడలిపోయెను.

వృద్ధుఁడు నడుము విఱిగినవానిం బోలి తటాలున నేలఁ గూలంబడియెను. ఆతనికన్నులనుండి యశ్రువులతివేగమునఁ బ్రవహించుచుండెను. ఆబాలిక యాగదితలుపుచెంత నిలువఁబడి శోచనీయం బగుతనపితామహునియవస్థం గాంచుచు నశ్చేష్టయైయుండెను.

మనచరిత్రకాలమునాఁటికిఁ బ్రాచీనగుప్తసామ్రాజ్య మాసన్నమరణావస్థ యందుండెను. అంగ, మగధ, రాఢ దేశములుతక్క తక్కినయితరప్రదేశము లన్నియు గుప్తసార్వభౌములవశమునుండి తొలఁగిపోయినవి. తీరభుక్తి, వంగదేశములలో నిజముగనే స్వతంత్రరాజ్యములు స్థాపింపఁబడిపోయెను. ఈప్రదేశాధికారులు సార్వభౌముని యధికారమును నామమాత్రముగమాత్రమే యంగీకరించుచుండిరి. కాని య

చ్చటిరాఁబడిలో నొకచిల్లిగవ్వయైనను రాజధానికిఁ జేరుచుండుట లేదు. వారు తమస్వాతంత్ర్యమును బహిరంగముగా మాత్రము ప్రకటించుట లేదు ఇంతే. గుప్తసామ్రాజ్యస్థాపనారంభకాలమున నూతనముగా నుత్పన్నములైన సామంతమండలదుర్గాధిపతులవర్గములలో జాలమంది గౌడమగధదేశవాసులే యుండిరి. గుప్తవంశపు సంపూర్ణవైభవకాలమున నూతనార్జితములగు ప్రదేశములలో గొప్పగొప్పభూవసతు లుపాయనములుగా వారికే విశేషము లభించియుండెను. అట్లు లభించిన భూవసతిని సంరక్షించుకొనుటకై వారిలో ననేకులు తమజన్మభూమిని వదలి పరదేశవాసులైరి. ఇట్టివారిలోఁ గొందఱు మగధముననే నివసించుట యావశ్యక మయ్యెను, సామ్రాజ్యమునందలి కొన్ని పెద్దయధికారములు వంశపారంపర్యముగ లభించుచుండుటచే వారికి సార్వభౌముని సాన్నిధ్యముననే యుండవలసివచ్చెను. గుప్తసామ్రాజ్యవినాశకాలమున నీ సామంతాధికారవర్గములస్థితులు మిగుల శోచనీయము లైపోయెను. పరదేశములందలివారి యధికారములు క్రమక్రమముగాఁ దొలఁగిపోవఁ జొచ్చెను. గౌడవంగదేశములపై నధికారము గలవారినిమాత్రము దరిద్రదేవత యధికముగాఁ బీడింపలేదు. తుదకు సార్వభౌమమహాసేనగుప్తుని తండ్రియగు దామోదరగుప్తుని పరిపాలనమునాఁటికే వారియధికారములు సంకుచితము లైపోయెను. అభిజాత్యవర్గమునందలి యభిమానులగు ప్రాచీనామాత్యవంశజులు రెండుపూటల నన్నమునకు గతి లేక క్రమముగా వచ్చి పాటలీపుత్రనగరమునను, మగధదేశమంతటను గూడ నిండిపోయిరి. మొదటనే జీర్ణావస్థయం దున్నమగధసామ్రాజ్యమట్టిహీనస్థితియం దున్నసామంతాదులచే నిండిపోవుటవలన మఱెంత శోచనీయస్థితికిఁ బాల్పడిపోయెను. గుప్తసామ్రాజ్యపుఁ బూర్ణవైభవకాలమున నీరోహితాశ్వదుర్గస్వాము లధికపరాక్రమవంతులై యుండిరి. దక్షిణపుసరిహద్దులను సంరక్షించుటయందుఁ దమపరాక్రమములను బ్రక

టించి యుండుటవలన సార్వభౌమునికడ వీరి కధికసన్మానము లభించుచుండెను. విజయములమూలమున దేశములవెంబడి దేశములు సామ్రాజ్యమునఁ జేరుచున్నకొలఁదిని రోహితాశ్వదుర్గాధిపతులకు మాళవవంగదేశములలో ననేకభూములు పారితోషికములమూలమున లభించుచుండెను. అవియన్నియును సామ్రాజ్యవినాశకాలమున వారికడనుండి తొలఁగిపోయెను. వంగదేశమునందలి భూవసతులు వారిస్వాధీనమునందున్నంతవఱకును వారు దరిద్రదేవతబాధలకుఁ బాల్పడియుండలేదు. దామోదరగుప్తచక్రవర్తికాలమునుండియే వంగదేశమునందలి రాజాధికారులు రాజ్యమునందు గ్రహించినపన్నులను సార్వభౌమున కర్పింపక కూడఁబెట్టుకొనుట కారంభించిరి. అటుపిమ్మటఁ గొంతకాలమువఱకు మాత్రమే రోహితాశ్వదుర్గాధినాథులకు వంగదేశభాగములు లభించుచుండెను. కాని, క్రమక్రమముగా నది కట్టువడిపోయెను. ఇఁక దుర్గపరిసరప్రదేశములుమాత్రమే దుర్గాధిపతులస్వాధీనములై యుండెను. అందు ఫలించినపంటలో నాఱవభాగమువలన దుర్గాధిపతి జీవనయాత్ర గడచుట యతికష్టముగా నుండెను.

నేఁటియుదయమునఁ గందకముకడఁ గూర్చుండి దంతధావనము చేసికొనుచున్నవృద్ధపురుషుఁడే ప్రస్తుతరోహితాశ్వదుర్గాధిపతి. అతని నామము యశోధవళుఁడు. అతఁడు ప్రాచీనదుర్గాధిపవంశమున జన్మించియుండెను. అతని పూర్వులకు మహానాయకబిరుదము వంశపారంపర్యముగా నెగడుచుండెను. గుప్తసామ్రాజ్యమునం దాబిరుదము రాజకుమారపదవితో సమానముగ గౌరవింపఁబడుచుండెను.

యశోధవళదేవునివయసు డెబ్బదియేండ్లకన్నను గొంచెమెక్కువయే. సార్వభౌమదామోదరగుప్తుని పరిపాలనకాలమునం దీతఁ డనేకసంగ్రామములలో విజయమునుగాంచి యనంతయశమును నార్జించియుండె

ను. ఆతఁడీమహాసేనగుప్తుని కాలమునఁగూడ మౌఖరీవంశజు లగురాజులను బరాజితులఁ గావించి దక్షిణమగధదేశమునందలివిల్లివజ్వాలలను జల్లార్చివైచెను.

యశోధవళదేవున కొక్కఁడే పుత్త్రుఁడు. ఆతనిపేరు కీర్తిధవళుఁడు. ఆతఁడు తనతండ్రికిఁ దగినపుత్త్రుఁడై యనేక రణరంగములలో విశేష యశము నుపార్జించెను. దరిద్రయాతన దుర్భరమైనందున నాతఁడు వంగదేశమునందలి తనపూర్వజుల యధికారములను దిరిగి స్వాధీనము చేసికొనుటకై తండ్రియానతిని బడయకుండఁగనే వెడలిపోయెను. అట్లు చని యాతఁ డనేక నదీనదవనపర్వతవేష్టితంబగు సమతట దేశమున రణరంగమున వీరవిహారముం గావించుచు రాజపుత్త్రులకుఁ బ్రశంసనీయం బగువీరమరణముంగాంచెను. పతిమరణవృత్తాంతము నాలకించి యాతని సతీమణియుఁ బతివ్రతలకనురూపంబగు చితారోహణముం గావించి స్వర్గపదలాభమును జూఱగొనియెను. అప్పటినుండియు యశోధవళదేవుఁడు పసికూనయగు పౌత్త్రితో భగ్నహృదయముతో నాదుర్గమునందే నివసించుచుండెను. పుత్త్రమరణానంతరమునుండియే యాతని దీనస్థితికిఁ బ్రారంభమయ్యెను. క్రమముగా నాతని ప్రజలు తమతమనియమముల ననుసరించి పన్నులను జెల్లించుట మానివైచిరి. అందువలన వేతనములు సరిగా నీయకుండుటచే దుర్గమునందలి యధికారులును, సేవకజనులు నొక్కరొక్కరుగాఁ బనులను మానుకొనిపోయిరి. తుట్టతుదకింటిసేవకుఁడు వృద్ధరఘువును, దాసియగు నానియాయునుమాత్రమే యాయింట మిగిలియుండిరి. అప్పటికిని భూవసతులనుండి రావలసిన పన్నులో, అంకుఁ బండినధాన్యమో పూర్వమువలెనే సరిగావచ్చుచున్నచో దుర్గాధిపతి కంతటిదీనదశ సంప్రాప్తించి యుండదు. కాని, సేవకజను లెవ్వరును లేకపోవుటచే ధాన్యము సరిగా నింటికి రావయ్యెను. అడుగువారెవ్వరును లేక రయితులు పన్నుల

ను జెల్లించుట నూనిరైచిరి. అందుచే యువరాజభట్టారక పాదీయు మహానాయక యశోధవళదేవునింట నొకయున్న పుమెతుకునకుఁగూడ కఱవైపోయెను. తుదకాతఁడు తన మృతపత్నికిమాఱుగాఁ జూచుకొనుచున్న యలంకారమునుగూడఁ బొట్టకొఱకమ్ముకొనవలసినవాఁడయ్యెను.

బాలిక చాలసేపటివఱకు నాగడివాకిటనే నిలువఁబడి తనతాతగారి దుర్వస్థం గాంచుచుండెను. ఆమెవిముగ్ధతరళనయనములశ్రుజలపూరితములై యుండెను. ఇంతలో నాదియా యచ్చటికి వచ్చి యాబాలికను జంకఁబెట్టుకొని తీసికొనిపోయెను.

మెల్లమెల్లగాఁ బగలు రెండుజాములు గడచిపోయెను. అప్పుడు రఘువొక పెద్దసంచిని బుజముపైఁ బెట్టుకొని యెగయూపిరి విడుచుచు నలసమందగమనములతో వచ్చటికిఁ జేరుకొనియెను. వానిసర్వాంగములును ఘర్మజలపూరితములై యుండెను. వానిం జూచినంతనే యశోధవళుఁడించుక తెప్పరిల్లెను. అప్పుడాతఁడొక్కనిట్టూర్పు విడిచి యావృద్ధసేవకునివంక దృష్టి సారించెను. రఘువు తన కొంగుముడి నుండి పదిసువర్ణముద్రలను బైకిఁ దీసి "స్వామి! ధనసఖుఁడు క్రియధనమంతయు నిప్పుడీయఁజాలనని చెప్పినాఁడు. సాయంకాలములోపలఁ దక్కినసువర్ణముద్రలను స్వయముగాఁదీసికొని ప్రభుసన్నిధానమునకు వచ్చి సమర్పించునఁట! ఆతఁడు మీకు నమస్కారములని చెప్పుమన్నాఁడు" అనియెను.

ఆనాఁడు యశోధవళదేవున కొక్క మెదుకైన నోటికిఁ బోలేదను సంగతి నాదియారఘువులకుఁ దెలియక పోలేదు.

సంధ్యాకాలమునకుఁ గొంచెము ముందుగా శరీరమంతయు ముడుతలువడియున్న వృద్ధుఁడొకఁడు మెల్లమెల్లఁగాఁ గోటలోనికి వచ్చి చేరెను. ఆదుర్గదుస్థితిం గాంచినంతనే యావృద్ధుఁడాశ్చర్యస్తంభితుఁ

క్తై పోయెను. తోరణద్వారముకడ నొకరక్షకభటుఁడైనను లేఁడు. ఆపెద్దదర్వాజాఫలకలును, ద్వారబాధములును బొత్తుగఁ జెడిపోయి వానియినుపసంకెలయు, నర్గళములును మసియలై యాద్వారము నెదుట నేలపై నటునిటు బడియుండెను, దుర్గమునందలిబయలంతట ను బచ్చనిగరికయు, నరణ్యాలతలును దట్టముగా నెదిగి యల్లుకొని యుండుటచే లోపలఁ బ్రవేశించుటకే మహాప్రయాసముగా నుండెను. గోడలపై వటాశ్వత్థాది మహోన్నతవృక్షములు కొన్ని వత్సరములకుఁ బూర్వమే మొలచి క్రమముగా బలసి ప్రచండముగా విస్తరిల్లి యుండెను దుర్గాధిపతివాసస్థలమంతయు సంపూర్ణముగా శిథిలమై నివసించుట కయోగ్యమై యుండెను. అందలియుపకరణములన్నియు నెవ్వరును సంస్కరింపకుండుటచేఁ గడు దుర్గంధయుతములై యుండెను. దుర్గాంతర్భాగమంతయు జనసంచారమే లేని మహారణ్యప్రదేశము వలెఁ గానవచ్చుచుండెను.

బాలదుర్గమున కడుగుననున్న యొకచిన్నభవనము నెదుట నమూల్యంబును, బురాతనంబు నగునొకశయ్యపై వృద్ధదుర్గాధిపతి యాసీనుఁడై యుండెను. ఆయాగంతుకవృద్ధుఁడు స్వర్ణకారుఁ డగుధననఖుఁడే యని మా పాఠకు లూహించి యుందురు. అతఁడు దుర్గాధిపతిం గాంచి భూమివఱకును వంగి వినయముతోఁ బ్రణామము గావించెను. యశోధవళుఁ డాతని గూర్చుండుమనియెను; గాని యాతఁడట్లు కూర్చుండకయే తాను తెచ్చినసంచిలోనున్న కొన్నిసువర్ణముద్రికలను దీసి దుర్గాధిపతి సన్నిధినుంచి "అయ్యా! తమ రత్నవలయమునకు విలువ యింతయగునని నేనిప్పుడు చెప్పఁజాలకున్నాను, ఇప్పుడు నాయొద్ద సిద్ధముగనున్న వేయిమొహరీల నిచ్చుటకిఁ దెచ్చి యున్నాను. తక్కినసొమ్ము కొలఁదిదినములలోనే పాటలీపుత్రమునుండి తెప్పించి సమర్పించెదను" అని చెప్పెను.

దుర్గా—ఏమి ? రత్నవలయమువిలువ యంత హెచ్చుగా నుండుననియా నీయుద్దేశము?

స్వర్ణ—ఈమీా సేవకుని యల్పబుద్ధితోఁ బరీక్షించినను దీని మూల్యము పదివేల మొహారీల కెంత మాత్రము తగ్గియుండ దని తోఁచుచున్నది.

దుర్గా—ధనసఖా ! నీవంత మొత్తము నీయఁగలవా?

స్వర్ణ—చిత్తము. నేను నాపుత్రుని పాటలీపుత్రమునకుఁ బంపియున్నాను. వాఁడు వచ్చినవెంటనే సొమ్మంతయును దమ కొప్పగించెదను.

యశోధవళుఁడు నిశ్చింతుఁడై యున్నట్లు కానఁబడెను. కాని, ధనసఖుఁడుమాత్రము వెడలిపోక యెప్పటిచోట నట్లే నిలిచియుండెను. మఱికొంతసేపటికి దుర్గస్వామి యాతనిం గాంచి "ఓయీ! జాపిల గ్రామమున నాసేనాధిపతి మహేంద్రసింహుఁ డుండెనుగదా! ఆతఁ డింకను జీవించియుండునా?" అని యడిగెను.

ధన—ప్రభూ! మహేంద్రసింహుఁడు పరలోకమున కేఁగి చాలకాలమైనది. ఆతనికుమారుఁడు వీరేంద్రసింహుఁడు పొలములు దున్నుకొని బ్రదుకుచున్నాఁడు. కాని జాపిలగ్రామములోని మీా పురాతనసేవకులగు సేనానాయకహరిదత్తుఁడును, అశ్వపటలికవిధుసేనుఁడును, పర్వతప్రదేశమందలి విధుసేనుఁడును నిప్పటికి సజీవులై యున్నారు,

వృద్ధయశోధవళదేవునిలోచనము లాకస్మికముగాఁ దేజఃపుంజము లయ్యెను. ఆతఁ డించుక కంపితస్వరముతో "ధనసఖా! నీవిప్పుడిచ్చటికి వచ్చుట చాల నుపకారమే యైనది. నేను పాటలీపుత్రమునకుఁ బోవఁదలఁచి యున్నాను. నీవు వీరినందఱనొక్కసారి నాయొద్దకుఁ బంపఁగలవా?" అనియెను.

ధనసఖుఁడు మోకరించి ముకుళితహస్తుఁడై "ఏలికా! మీ పురాతన సేవకులచేతఁ బ్రేరేపితుండ నగుటచేతనే నేనీదుర్గమంబగు పర్వతము నధిరోహించి తమసన్నిధి కేతెంచితిని. పదిసంవత్సరముల నుండి మీదర్శన మెవ్వరికిని లభించుట లేదు. వంగదేశరణాంగణము నుండి విజితులై మరలివచ్చినవారు తమకు మొగము చూపఁజాలక లజ్జాభరంబునఁ గ్రుంగి యున్నారు. కాని, తమ దర్శనభాగ్యము లేని లోపముచే నల్లాడుచున్నారు. సెలవైనచో వారెల్లరును రేపటియుదయముననే మీదర్శనము సేయఁగోరుచున్నారు" అనియెను.

యశోధవళునకుఁ గన్నులు నిండిపోయెను. అతఁడు గద్గదస్వరముతో "ధనసఖా! రాఁదలఁచినవారి నందఱను రానిమ్ము! వారిని గాంచిన నాకు నానందముగనే యుండును. కాని—వారితో ముందుగా నీమాటలు చెప్పివేయుము—నాలోఁ బూర్వపుసామర్థ్యము లేదు—ద్రవ్యబలము లేదు—జనబలము లేదు—వారికొక్కపట్టెఁడన్నము పెట్టుటకైనను నాకుశక్తి లేదు. ధనసఖా! నీకీసంగతి తెలియునుగదా! అట్లుకాకున్నఁ బరలోకవాసినియైన నాపత్నిరత్నవలయమును విక్రయించుటకు నీయొద్దకుఁ బంపియుందునా?" అనియెను.

దుర్గాధిపతి చెప్పినయీమాటలను వినుచు నాసొన్నారి మౌనముతోఁ గన్నీరు విడుచుచుండెను; అతని నోట మాట వెడలలేదు. అతఁ డింకొకసారి భూమివఱకును వినమ్రుఁడై దుర్గాధిపతికి నమస్కరించి సెలవుఁ గైకొని వెడలిపోయెను.

---

## ఏడవప్రకరణము

సాయంకాలమై రెండుగడియ లైనది. పాటలీపుత్రపు ప్రాంతరాచవాడలోని యంతర్భాగమునందలి యొకచిన్నిమహాలునం దిరువురు గూర్చుండియుండిరి.

ఆమహాలునకు నీలి తెరలు వేయఁబడియుండెను. నేలపై నమూల్యము, నతిమృదులము నగు నావరణవస్త్రము పఱుపఁబడియుండెను. దానిపై నమర్పఁబడిన యొకగజదంతభద్రాసనముపై వృద్ధమహాదేవి కూర్చుండియుండెను. ఆమెసమీపమున నున్న స్వర్ణసింహాసనముపై సార్వభౌమప్రభాకరవర్ధనుఁ డాసీనుఁడై యుండెను. ఆతఁడు పసిమి బంగారువన్నెగల వస్త్రములను దాల్చి యుండెను. మహాలులో నొక మూలనున్న సుగంధతైలదీపము మినుకుమినుకు మని వెలుఁగుచుండుటచే దానికించిత్ప్రకాశము నీలపటము వెనుకనుండి మహాలులోనికిఁ బ్రసరించుచుండెను. అంధకారమునం దాసింహాసనాసీనులై యున్న యిరువురును స్పష్టముగా నగపడుచుండుట లేదు. తల్లియుఁ గుమారుఁడు నప్పుడతిమృదుస్వరమున సంభాషించుకొనుచుండిరి.

మహాదేవి — ప్రభాకరా! నీవొక్కపెట్టున ననాలోచితముగా నింతతొందరపడి పోవుటకుఁ బసిపిల్లవాఁడవు గావుగదా! నీవిప్పుడు తారుణ్యమును గూడ నతిక్రమించినవయసువాఁడవైయున్నావు. మగధమంతయు నీమేనమామగారిరాజ్యము; ఈవాడ నీమాతామహావంశీయులది. నీవిప్పుడీపాటలీపుత్రమునకు బంధుఁడవై వచ్చియుంటివి. ఈ సంగతి యింతయును నీవు మఱచియేపోయితివా? నీమాతామహవంశము సర్వవిధములచేతను సమున్నతమును, ప్రాచీనమునై వన్నెగాంచియున్నది. ఈభారతభూమియం దీవంశమువా రతిమాననీయులై ప్రసిద్ధికెక్కియున్నారు ఇప్పటికినిగూడ నుత్తరదేశీయులలో నీపితామహవంశీయులకంటె మాతామహవంశజులకే యధికసన్మానము కలుగుచున్నది. కాలప్రభావముచే నిప్పుడు నాజనకవంశమునకు దుర్దశ సంభవించినది. భాగ్యచక్రము తిరిగిపోవుటచే నీపితృవంశమునకు సంపూర్ణవైభవముకలిగినది. ఇట్టిస్థితిలో మేనమామయింటికిఁ జుట్టమవై వచ్చిననీకు — సార్వభౌమపదవిరాజితుఁడవై స్థానేశ్వరరాజ్యై

శ్వరుఁడవగు నీకు—మేనమామ నీవిధముగా నవమానించుట మరి యాదయా?

మహాదేవి మెల్లఁగ మాటాడుచుండెను. మహాలునకు వెనుక ప్రక్కనే నిలిచి యెవ్వరైన నతిజాగరూకతతో నాలకించినను నామె మాటలు సరిగా వినఁబడునో వినఁబడవో సందేహమే!

ప్రభాకరుఁ డుత్తేజితస్వరముతో "అమ్మా! మొట్టమొదట మీరు నావాదమునైన—" అనునంతలో నామాటముగియకుండఁగనే మహాదేవి మెల్లఁగా "ప్రభాకరా! చాలును. నేను నీకుఁదల్లిని. కావున నీవిప్పుడేమి చెప్పఁదలఁచితివో నాకు ముందుగనే తెలిసిపోయినది. పాటలీపుత్రమున విశృంఖలులై యున్ననాగరికులు కేవలము నిర్దోషు లని నేను చెప్పుటలేదు. కాని మనస్థానేశ్వరసైనికుల యత్యాచారముల మూలముననే వారు రేఁగి మనశిబిరములపైఁ బడియున్నారు. ఇంతవఱకు నత్యమని నేను చెప్పఁగలను" అనియెను.

తనమాటలకు నడుమనే యంతరాయము కలిగించుటవలన స్థానేశ్వరచక్రవర్తి యగు ప్రభాకరునికర్ణము లత్యరుణము లయ్యెను. ఆతఁ డతికష్టముతోఁ దనమనోభావమును గోపనము గావించుకొని "అమ్మా! ఇన్నిమాటలెందుకు? మీయిష్టమువచ్చినరీతినే యన్నియును గావింతు" అనియెను.

మహా—(శాంతముగా) ప్రభాకరా! నిన్నజరిగినవిషయమును గూర్చి యావ్యాపారముతో సంబంధించిన ముఖ్యులగువారి నిచ్చటికిఁ బిలిపించి నీయెదుటనే విచారణ చేసెదను. నడుమనడుమ నీవేమియును మాటాడవలదు. అంతయావశ్యకమైనచో నీతెరచాటునకు నన్నుఁ బిలిచి నీవు చెప్పఁదలఁచుకొన్న దేదియో నాతోఁ జెప్పుము. సరే కాని నీయధికారు లీవిషయమున నీతో నేమని చెప్పిరి?

ప్రభా—మనసిపాయిలు మార్గమధ్యమునం దొకచో నొక సుందరబాలికను దాసిగా వెలకుఁ గొనియుండిరి! వారాబాలిక నీనగరమునకుఁ గొని తెచ్చినప్పు డీనాగరికులదృష్టి యామెపైఁ బడియెను. తోడనే వారీబాలిక యీనగరమునందలి యొకవర్తకునికూఁతురని వాదింప నారంభించిరి. అదికారణముగా నాగరికులకును మనసైనికులకును వాదప్రతివాదములు జరగుచుండెను. ఇంతలో శశాంకుఁ డచ్చటికిఁ బోయి మగధసైన్యములోని యొకభాగమును సహాయముగాఁ గొని శస్త్రవిహీనులైయున్నస్థానేశ్వరసైనికులను వధింపఁజేసి వారిశిబిరములనన్నిటిని గాల్చివేయించెను. నగరద్వితీయభాగమునుండి మనసేన లచ్చటికిఁ బోయి చేరులోపలనే యన్నిపనులును ముగిసిపోయినవి.

మహా—నీయధికారులు నీతోఁ జెప్పినసంగతు లన్నియును సత్యములు గావు. ఎవరిమాటలు సత్యములో నీకిప్పుడే స్పష్టముగాఁ దెలియునట్లు చేసెదను. కొంచెముసేపు శాంతముతో వినుము.

అని యామహాదేవి కరతాళధ్వనిం గావించెను. తోడనే యవనికమఱుఁగుననుండి యొకవృద్ధసేవకుఁ డట కరుదెంచుటయు నామె యాతనిం గాంచి మహాదేవి "నగరపాలకుఁడగువినయసేను నిటకుఁ దీసికొనిరమ్ము!" అని యాజ్ఞాపించెను.

వృద్ధసేవకుఁ డామెకు రెండుపర్యాయములు వంగి ప్రణామముం గావించి తెరమఱుఁగునకు వెడలిపోయెను. అంతలోనే యాతఁడు మరల వచ్చి యట నొకపార్శ్వమున కొసరిల్లి నిలిచియుండెను. రత్నకాంతులచేఁ బ్రకాశమానంబగు కవచముం దాల్చినపురుషుఁ డొకఁడు వచ్చి ద్వారముకడ నిలిచి యమ్మహాదేవికిఁ బ్రణామముంగావించెను. ఆతఁడే నగరపాలకాధ్యక్షుఁడగువినయసేనుఁడు.

మహా—వినయసేనా! పాటలీపుత్రరాజమార్గమునుండి వచ్చుచు నొకదాసిని వెలకుఁ గొని తెచ్చినస్థానేశ్వరసైనికుని పేరేమి?

విన—అమ్మా! అతనిపేరు చంద్రేశ్వరుఁడు. ఆతఁడు జాలంధ రాజ్యారోహక సైన్యములోనివాఁడు.

మహా—నీవు పోయి వెంటనే యాతని నిటకుఁ దీసికొని రమ్ము!

రెండుసారు లామెకు నమస్కరించి వినయసేనుఁ డటనుండి వెడలి యావెంటనే చంద్రేశ్వరసహితుఁడై మరల నటకువచ్చి నిలు వఁబడియెను.

మహాదేవి యాసైనికునిం గాంచి "నీపేరేమి?" అని ప్రశ్నిం చెను.

సైని—అమ్మా! నాపేరు చంద్రేశ్వరసింహుఁ డందురు.

మహా—నీవెక్కడివాఁడవు?

సైని—జాలంధరనగరమునం దుండువాఁడను.

మహా—నీవు స్థానేశ్వరసైన్యమునకు సంబంధించినవాఁడవు కాఁబోలును!

చంద్రేశ్వరుఁడు వినమ్రుఁడై ప్రణమిల్లెను.

మహా— వారాణసినుండి పాటలీపుత్రమునకు వచ్చుమార్గ మున నీవొకదాసిని వెలకుఁ గొని తెచ్చితివా?

చంద్రే—ఔను. ఆదాసి నిచ్చటఁ బాటలీపుత్రనాగరికు లెత్తుకొనిపోయినారు.

మహా—నీవా బాలిక నెవ్వరియొద్దఁ గొంటివి?

చంద్రే—మార్గమధ్యమునం దొకవర్తకునియొద్దఁ గొంటిని.

మహా—నీవాతని కెంతక్రయధనము నిచ్చితివి?

చంద్రే—పదిదీనారములను (గుప్తసామ్రాజ్యమునందలి సు వర్ణముద్రికలకు దీనారములనియే వాడుక)

మహా—ఇఁక నీవు పోవచ్చును. వినయసేనా! నాగరికులు వెంటఁ బెట్టుకొని వచ్చినబాలిక నిటకుఁ దీసికొని రమ్ము!

వినయసేనచంద్రేశ్వరులు దేవి కిరుమారులు ప్రణమిల్లి వెడలి పోయిరి. ఇంతలోఁ దెరలోనుండి సేవకుఁడరుదెంచి దేవి కభివాదన మొనర్చి "అమ్మా! ద్వారము నొద్ద సార్వభౌములు వేచియున్నారు!" అని మనవిచేసెను.

ఆమాట వినియును ప్రభాకరవర్ధనుఁడు మౌనముతో నట్లే కూర్చుండియుండెను. అతనింగని మహాదేవి కోపముతో "ప్రభాకరా! నేడు నీకింతమతిభ్రంశ మైనదేమి? మామయ్య ద్వారముకడ నిలిచియున్నాఁడని వినియు మొద్దువలె నిచ్చటనే కూర్చుంటివేమి? లెమ్ము, వేగముగఁ బోయి మామను సన్మానముతోఁ దోడ్కొని రమ్ము!" అని హెచ్చరించెను.

జననిపలుకులవలనఁ బ్రభాకరవర్ధనున కప్పు డొడలంతటను నూతనచైతన్యముదయించిన ట్లయ్యెను. అతఁడు చటాలున సింహాసనమునుండి లేచి మహాలువాకిలికడకుఁ బోయి మామను సందర్శించి వినయముతో లోనికి దయచేయుఁడని విన్నవించెను. ఆయవకాశములో సేవకుఁ డొకయాసనము నచ్చట సిద్ధపఱిచెను. ఇరువురును లోపలి కేతెంచి తమతమపీఠముల నలంకరించిరి.

మహా—(సోదరునుద్దేశించి) సోదరా! నీవిప్పు డిచ్చటి కేయుద్దేశముతో వచ్చినను, ప్రస్తుత మేమియును మాటాడవలదు. నేనిప్పుడు న్యాయవిమర్శనము సేయఁ గూర్చుండియున్నాను. ఇచ్చట జరుగున దంతయును మౌనముతో వినుచుండుము;

ఇంతలో నగరపాలకుఁ డగువినయసేనుఁడు పారకులకుఁ బరిచితమైయున్న బాలిక నటకుఁ దీసికొనివచ్చెను. అతనియానతి ననుసరించి యాబాలిక యామువ్వురకును బ్రణామము గావించెను.

మహా—బిడ్డా! నీపేరేమి?

బాలి—గంగ.

మహా—నీ వేజాతిపిల్లవమ్మా!

బాలి—క్షత్రియను.

మహా—నీతండ్రిపేరేమి ?

ఆప్రశ్న విన్నంతనే యాబాలికకన్నులశ్రువులచే నిండిపోయెను. ఆమె యధోవదనయై గద్గదస్వరముతో "అమ్మా! నాతండ్రి పేరు యజ్ఞవర్మ" అని చెప్పెను.

తనప్రశ్నమూలమున నాబాలికకుఁ గలిగినదుఃఖస్థితిం గని మహాదేవి కాబిడ్డపై మిగుల జాలికలిగెను. ఆమె కూరట గలిగించు నుద్దేశముతో నప్పుడు మహాదేవి కరుణార్ద్రస్వరమున "బిడ్డా! నీవెంత మాత్రమును భయపడవలదు, ఇచ్చట నిన్నెవ్వరు నేమియు ననరు. నేనడిగిన మాటకుఁ బ్రత్యుత్తరము చెప్పుము, మీనివాసస్థల మెక్కడ? " అనియెను.

బాలికకన్నుల నిండియున్న యశ్రుజలము మెల్లమెల్లగఁ గపోలములపైఁ బ్రవహించి క్రమముగాఁ గ్రిందికి దిగజాఱుచుండెను. ఆమె శోకకంపిత స్వరముతో " మేము చరణాద్రి దుర్గమున నివసించువారము" అనియెను.

ఈమహాలునఁ బ్రవేశించినది మొదలుగ నిప్పటివఱకును మహాసేనగుప్తచక్రవర్తి మౌనముతో నొకపాషాణవిగ్రహమువలె నిశ్చలుఁడై సింహాసనమునఁ గూర్చుండి యుండెను. అక్కడ జరుగుచున్న సంభాషణలోఁ జాలభాగ మాతనివీనులవఱకును బోవుటయే లేదని చెప్పవచ్చును. కాని యప్పు డాబాలికనోటినుండి "యజ్ఞవర్మ" "చరణాద్రిదుర్గము" అను నీపదద్వయము వెలువడుట నాలకించి చక్రవర్తి యాశ్చర్యాన్వితహృదయుఁడై యాక్షణముననే బాలికనుద్దేశించి 'ఏమంటివిబిడ్డా? చరణాద్రిదుర్గమా? నీతండ్రిపేరు యజ్ఞవర్మ

యా? ఏయజ్ఞవర్మ? మౌఖరినాయకుఁ డగుశార్దూలవర్మ తనయుఁడు యజ్ఞవర్మ యే నా నీతండ్రి?" అని ప్రశ్నించెను.

బాలిక యేడ్చుచునే "ఔను" అనియెను.

సార్వభౌముఁ డందుపై నింకను నేమియో భాషింప నుద్యుక్తుఁ డయ్యెను. ఆసంగతి తెలిసికొని మహాదేవి యాతని వారించి యంతఃపురముఖ్యరక్షకుని బిలిచుకొని రమ్మని వినయసేనున కాజ్ఞాపించెను. వినయసేనుఁడు పోయి నిమిషములో నాతనిం దోడ్కొని వచ్చెను. మహాదేవి యప్పు డంతఃపురమునకుఁ దీసికొనిపోయి మంచిమాటలచే నూరడించి శాంతపఱిచి మరలఁ దీసికొనిరమ్ము!" అని చెప్పెను. అంతఃపురరక్షకుఁ డాబాలికను వెంటఁబెట్టుకొనిపోయెను.

మహాదేవి సార్వభౌమునిం గాంచి "సోదరా! యజ్ఞవర్మవిషయమున నీవేమియో చెప్పఁదలఁచియున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. ఆతని నీవెఱుఁగుదువా?" అని ప్రశ్నించెను.

చక్రవర్తి నిట్టూర్పు నిగుడించి "దేవీ! నేనిప్పుడు చెప్పఁబోవుసంగతి యనేకవత్సరములకుఁ బూర్వవిషయము. ఆకాలమునం దీసామ్రాజ్యము మహోన్నతస్థితి యందుండెను. నాబాహువు లిప్పటివలె నప్పు డింతటిదుర్బలములై యుండలేదు. ఆకాలమునందా యజ్ఞవర్మపేరు విన్నంతమాత్రముననే యుత్తరదేశము లన్నియును గడగడ వడఁకిపోవుచుండెడివి. మనస్మృతికిఁగూడ నందకుండఁబోయిన యతిప్రాచీనకాలమునుండియును మౌఖరివంశమునందలి యొకశాఖవారిపైఁ జరణాద్రిదుర్గసంరక్షణభారము వంశపారంపర్యముగ మోపఁబడియుండెను. మహారాజాధిరాజసముద్రగుప్తచక్రవర్తి యే వారికా చరణాద్రిదుర్గాధిపత్యము నొసంగినట్లు నేను భట్టచారణులవలన వినియున్నాను. ప్రథమకుమారగుప్తరత్నగుప్తులకాలమున హూణసైన్యము మహాప్రవాహమువలె నుత్తరదేశమందంతటను వ్యాపించెను. అప్పు డీసామ్రా

జ్యమునకు సంభవించిన ఘోరవిపత్తునుండి మహాఖురీవంశీయులగు దుర్గాధిపతు లీరాజ్యము నెట్లుద్ధరించిరో యాచరిత్రను సూచించు గీతములను గానము సేయుచు మననగర రాజమార్గములందుఁ జారణు లిప్పటికిని దిరుగుచున్నారు. సోదరీ! బాల్యస్మృతి నీయంతఃకరణమునుండి తొలఁగిపోయినదా? నీకువిస్మృతి కలిగినదా? వృద్ధుఁడగుయదుభట్టింకను జీవములతోనే యున్నాఁడే! నీవివాహమునకుఁబూర్వము మనము గంగా సైకతప్రదేశములఁ గూరుచుండి యదుభట్టుపాడెడిగీతములఁ నాలకించుచు నొడలు మఱచిపోవుచుండెడివారము. సోదరీ! అదియును నీవు మఱచిపోయితివా? ” అని హెచ్చరించెను.

సార్వభౌముఁ డంతటితో నాఁగక సింహాసనమునుండి లేచి నిలువఁబడి “సోదరీ! మహాఖురి నరవర్మ దుర్గరక్షణభారము నెట్లునిర్వహించెనో నీవు మఱచిపోయితివా ? యదుభట్టునిగీతస్వన మిప్పటికిని నాచెవులఁ బ్రతిధ్వనించుచునే యున్నది. అన్నపానములకుఁగూడ నాధారము లేకపోయినయాసమయమున సర్వసైన్యమును నిరాశచే సొలసిపోయిన సమయమునఁగూడ వీరనరవర్మ యించుకేనియు భయపడలేదు. ఆతనికనిష్ఠపుత్త్రుఁడు నీరునీరని నోరాడించుచుఁ బ్రాణములను వదలివైచెను. అప్పుడైనను నమ్మహావీరనరవర్మహృదయమున లవమాత్రమైనను జాంచల్యముదయింపలేదు. ఆమహాఖురీవీరుఁ డప్పు డేమనియెనో వింటివా? ఆతఁడు సేనలం గాంచి ‘వీరులారా! సముద్రగుప్తచక్రవర్తి మహాఖురీవంశజులను సంస్థాపించి యున్నాఁడు. ఈదుర్గమున సముద్రగుప్తవంశజులకుఁ దక్క నితరులెవ్వరికిని బ్రవేశించునధికారము లేదు. మహాఖురీవంశజులలో నొక్కవీరుఁడైననుజీవించియున్నంతవఱకు సార్వభౌముఁడుదక్క నొరులెవ్వరును దమ సేనలతో నీదుర్గమునఁ బ్రవేశింపఁజాలరు.” అని ప్రబోధించి యున్నాఁడు. ఆమహాఖురీవీరుఁడు గావించినమహావీరోపన్యాస మార్యావర్తమునకు నూతనము గాదు.

అనేకదుర్గములలో, ననేకరణరంగములలోఁ బరదేశసైనికనికాయము విస్మయహృదయముతో నిదియే వినుచుండెను. చూడుఁడు! చూడుఁడు! మౌఖరీవంశోద్భవలగు కులాంగనల వెచ్చని నెత్తురుధారలచే దుర్గమునందలి బయలంతయు లోహితమై పోయినది. తరులతాదులనుండి కోయఁబడిన మృదుకుసుమములంబోలి మస్తకవిహీనంబులగు సుకుమారదేహంబులు కఠినపాషాణతలంబులఁ బడిపోయినవి. మౌఖరీవీరు లెచ్చట నున్నారు? వారు తమ భార్యలకొఱకు—సోదరీమణులకొఱకు—తల్లులకొఱకు—విలపించుచున్నారా? కనుఁడు! కనుఁడు—దుర్గతటమున గరుడచిహ్నాంకితమగు ధ్వజమెత్తుగా నగపడుచున్నది, కంఠమునం దెఱ్ఱనిజపాకుసుమమాలికం దాల్చి రక్తచందనచర్చితశరీరుఁడై వీరశ్రేష్ఠుఁడగు నరవర్మ గరుడధ్వజపాణియై సేనలను స్వయముగనే నడపించుచున్నాఁడు. ఆతని ప్రచండజయధ్వన్యాకర్ణనమాత్రముననే క్రింద వేయడుగుల దూరమునందున్న హూణులు గడగడలాడిపోవుచున్నారు. భయంకరమగు నారణకోలాహలము నాలకించి పశుపక్ష్యాదు లాపర్వతప్రదేశమును వీడి పాఱిపోవుచున్నవి. వీరాగ్రణి యగు నరవర్మ యిప్పుడు నిశ్చింతుఁడై యుండెను. భార్యాపుత్త్రులం గూర్చిన చింత లాతని హృదయమునుండి శాశ్వతముగనే వదలిపోయినవి. వీరనరవర్మ మానవశక్త్యతీతంబులగు మహత్తరకార్యములను నిర్వహించియున్నాఁడు. కాని విధివిధానమును గడచుట మాత్ర మాతనికి దుస్తరమయ్యెను. చూచుచుండఁగనే హూణసైన్యము దుర్గతటమున కెక్కివచ్చెను. కాని మౌఖరీవీరు లొక్కఁడు జీవించియున్నంతవఱకు హూణసైన్యము దుర్గమునఁ బ్రవేశింపఁజాలకపోయెను. వీరపుంగవుఁడగు నరవర్మయు, నాతని వీరసహచరులును, దుర్గతలమునఁ జిరనిద్రాసమగ్నులైన తరువాతనే యీదుర్గము హూణసైన్యమునకు హస్తగతమయ్యెను.

దేవీ! నీవు శార్దూలవర్మను మఱచిపోయితివా? తండ్రిగారి సింహాసనము చెంతఁ బరశుపాణియై నిలిచియుండువాయోధుని ప్రచండోన్నతవిగ్రహము నీకు జ్ఞప్తికి వచ్చుట లేదా? ఆతనికుమారుఁడగు యజ్ఞవర్మను నేనెట్లుమఱవఁగలను? ఆతనిచేతికరవాలమే లేకయున్నచో నేనానాఁడు బ్రహ్మపుత్రాతీరమున సుస్థిరవర్మచేతులలో మరణించియే యుండుదును. ఆహా! ఆయజ్ఞవర్మపుత్రిక—"

అని పలుకుచు సార్వభౌముఁడు ప్రబలప్రభంజనాహతిం దూలు సాలవృక్షముంబోలి మూర్ఛితుఁడై పడిపోయెను.

అంతలోనే ప్రభాకరవర్మ యతినిపుణతతో నాతని గ్రిందఁబడకుండఁ బట్టుకొనియెను. లేకున్న నాతని కధికముగనే దెబ్బతగిలియుండును. అప్పుడు మహాదేవియొనరించిన గంధరగోళమునాలకించి యొక్కపరుగున సేవకులు వచ్చి సార్వభౌమున కుపచారములుచేయఁ దొడంగిరి.

కొలఁదిసేపటిలోఁ మహాసేనగుప్తుఁడు తేరుకొనియెను. ఆతఁడు మహాదేవిం దిలకించి" దేవీ! నీవిచారణలో నెట్టివ్యత్యాసమును గానవచ్చుట లేదు. నేను వృద్ధుఁడనైపోయినాను. నాతలయంతయు నరసిపోయినది. నాశరీరమున శక్తి లేదు. అట్లే నామనశ్శక్తియును లోపించినది నాయపరాధమును సైచి క్షమింపుము" అనియెను.

మహాదేవి స్నేహార్ద్రస్వరముతో" సోదరా! నీశరీర మస్వస్థముగా నున్నది. ఇష్టమున్నచో నీవు నీశయనమందిరమున కరిగి విశ్రమింపవచ్చును. ఈవిమర్శనకార్యమును నేనొక్కతెనే నిర్వహించెదను" అనియెను.

చక్రవర్తి—దేవీ! మౌఖరివీరులు సామ్రాజ్యముకొఱకనేకయుద్ధములలోఁ బ్రాణముల నర్పించి యున్నారు. యజ్ఞవర్మ స్వయముగా నెన్నియో సంగ్రామములలో సామ్రాజ్యమును సంరక్షించి

యున్నాఁడు. అనేక యుద్ధయాత్రలలో మేమిరువురము నొక్కచోట నే కరవాలములు తలక్రిందనిడుకొని యనేక రాత్రులను గడపియుంటిమి. అట్టిమహామాన్యుఁడగుమాఖరీవీర నాయకునితనూజాత యొకసామాన్య సైనికునకు దాసియెట్లయ్యెనో యీదైవదుర్విలాసము నాలకింపవలయు నని నామనసు తహతహపడుచున్నది.

మహాదేవి సోదరున కేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. ఆమె యొకసారి సోదరునివంకఁ జూచి పిమ్మట నగరపాలకాధ్యక్షునిం గాంచి "వినయా! పృథూదక పాదసైనికుఁడగురత్నసింహునిటకుఁ దీసికొని రమ్ము. ఆతనితోఁగూడ నా బాలికసోదరునిగూడఁ దోడ్కొని రమ్ము" అని యాజ్ఞాపించెను. మహాప్రసాద మని వినయసేనుఁడు సెలవందిపోయి కొలఁదిసేపటిలో బాలక, రత్నసింహులను వెంటఁబెట్టుకొని వచ్చెను.

మహాదేవి సైనికునిం గాంచి "నీ పేరు రత్నసింహుఁడా?" అని ప్రశ్నించెను.

రత్న—ఔను మహాదేవీ!

మహా—నీ వేమిపని చేయుచుందువు?

రత్న—అమ్మా! నేను పృథూదకసైన్యమునం దొకనాయకుఁడనైయున్నాను.

మహా—నీవు నిన్నటియుదయమున భోజనసామగ్రిం గొనుటకై నగరమునందలియంగడికిఁ బోయియుంటివా?

రత్న—పోయితిని. నా చేతిక్రింది సైనికులకు వలయుభోజనసామగ్రినంతను దెచ్చుకొన్న పిమ్మట నొక గాల్మికునాజ్ఞననుసరించి (నూఱు రెండువందలు, అంతకంటె నధికులునగు సైనికులగుంపునకు గుల్మ మని పేరు. దానికధినాయకుఁడు గాల్మికుఁడు) యీ బాలకునితండ్రియంగడిలోనికి బియ్యము, పప్పు మొదలగువానిని గొనుటకై పోయితిని.

మహా—ఆయంగడివాఁడా బాలునకుఁ దండ్రియని నీకెట్లు తెలిసినది ?

రత్న—ఆసంగతి నాకంత బాగుగాఁ దెలియదు. అంగడిలో నేను గొన్న సామగ్రిమూట చాలఁ బెద్దదై నేను మోయఁజాలపోయితిని. అప్పు డాయంగడివాఁ డీపిల్లవానిచేఁ గొంతసామాను మోయించుకొని పొండని యీతని నాతోఁ బంపెను.

మహా—ఆయంగడివాని యింటికి నీవిదివఱ కెప్పుడైనఁ బోయితివా? నీకాయింటివారితోఁ బరిచయమున్నదా?

రత్న—లేదు మహాదేవి!

మహా—ఇఁక నీవు పోయి యావ్రక్కను నిలిచియుండుము— వినయసేనా ! ఆవర్తకుఁ డున్నాఁడా?

రత్న—లేఁడు మహాదేవి ! అంగడిసామగ్రులను గొని తెచ్చుకొనుటకై యాతఁ డంగదేశమునకుఁ బోయియున్నాఁడు.

మహా—ఆతనియంగడిలో నెవ్వరున్నారు ?

రత్న—వానియుపపత్ని.

మహా—సరే. ఆమెను దీసికొని రమ్ము.

వినయసేనుఁడు వెడలి పోయినతరువాత మహాదేవి బాలకునిం జూచి "అబ్బాయీ! నీపేరేమి?" అని ప్రశ్నించెను.

బాల—అనంతవర్మ.

మహా—మౌఖరీవంశజుఁడగు యజ్ఞవర్మ నీతండ్రియేనా?

బాల—ఔను.

మహా—మీనివాసము చరణాద్రిదుర్గమునందేనా?

బాల—ఔను—కాని కొంతకాలముక్రిందట మాపినతండ్రి కుమారుఁ డవంతివర్మ యటనుండి మమ్ములను బాఱఁద్రోలినాఁడు.

చక్రవర్తి యింతవఱకును శాంతముతో నాలకించుచుండెను.

బాలకుని యీతుదివాక్యము నాలకించి యాతఁడు తత్తరముతో "ఆదుర్గమునందలిసైనికు లందఱును నీతండ్రిపైఁ దిరుగఁబడిరా?" అని ప్రశ్నించెను.

బాల—లేదు. అవంతివర్మకు రహస్యముగా స్థానేశ్వరరాజుతోడుపడకయే యుండినచో నాతఁడు మనలను దుర్గమునుండి వెడలఁగొట్టఁగలఁడా? అది మాతండ్రిగా రనుచుండెడివారు అప్పుడు మాతండ్రిగారు తమకు సహాయముచేయుటకొఱకుఁ బాటలీపుత్రమునకొకదూతనుగూడఁ బంపియున్నారు. కాని చక్రవర్తి మాకెట్టిసహాయమును జేసియుండలేదు.

ఆమాటలు వినుటతోడనే ప్రభాకరవర్ధనునిమొగ మెఱ్ఱనైపోయెను. చక్రవర్తి సిగ్గుచే నధోవదనుఁడై పోయెను.

మహా—బాలకా! అవంతివర్మ మీకోట నాక్రమించుకొన్న తరువాత మీ రేమి చేసితిరి?

బాలకునినోటినుండి మాట వెలువడినదికాదు. ఆతనికంఠము రుద్ధమైపోయెను. ఆతనివిశాలనీలనయనము లశ్రుపూరితములై పోయెను, అది చూచి మహాదేవిహృదయము కరుణారసపరిపూర్ణమైపోయెను. అప్పు డామె యాబాలకునిచేయిపట్టుకొని దగ్గఱకుఁ దీసికొని యాతనిఁ దనతొడపైఁ గూర్చుండఁ జేసికొనియెను. బాలకుఁ డమ్మహాదేవివక్షమున మొగముంచి మౌనముతో నామెపయ్యెద నశ్రుధారలచే నింపివైచుచుండెను.

ఇంతలో వినయసేనుఁడు మాపాతకులకుఁ బరిచితురాలైనయంగడియామె నటకుఁ దీసికొని వచ్చెను. ఆమె యామహాలునం దడుగుపెట్టువఱకును భ్రమరికవలెఁ దనలో నేమేమియో గొణుగుకొనుచునే యుండెను. కాని యటఁ బ్రవేశించినతోడనే యామెకొక్కసారిగా దుఃఖము పొంగిపోయెను. ఆమె ముక్తకంఠమై శోకింపఁదొడంగెను.

అంత వెనుకనుండి యొకప్రతీహారి వచ్చి చర్మశలాకచే నామె నొక దెబ్బ కొట్టెను. అందుచే నామెనప్తమస్వర మించుక మంద మయ్యె ను. ఆమె లోపలఁ బ్రవేశించినది మొదలుగా "నేనేమియపరాధము చేసితిని ? ఏయపరాధము లేనిదే నన్నిచ్చటి కేల తెచ్చితిరి?" అను మాటయే పల్లవిగా శోకగానము నాలాపించుచుండెను. ఆమెశోకావేగ ముత్తరోత్తరమందమగుటకు మారుగ నధికాధికము కాఁజొచ్చెను. వినయుఁ డామె నూరకుండు మని బెదరించెను.

మహాదేవి యామెం గాంచి మృదుస్వరముతో "నీపేరేమ మ్మా?" అని ప్రశ్నించెను.

స్త్రీ—నాపేరు మల్లిక; నాతల్లి పేరు—

విన—(అర్ధోక్తియందే) చాలును ! నిన్నడిగినప్రశ్నకుమాత్ర మే యుత్తర మిమ్ము !

మల్లిక నిరుపాయయై యూరకుండెను. అప్పుడు ప్రభాకరుఁ డామెం గాంచి "ఈబాలుకుఁడు నీకొడుకేనా ?" అని ప్రశ్నించెను.

తన కిప్పుడు నంతు దొరకినది గదా యని యనుకొనుచు మ ల్లిక బిగ్గఱగా నేడ్చుచు "బాబూ ! మావంశమున సప్తపురుషాంతర ములలో నెవ్వరికినిగూడ నీతఁడు పుత్రుఁడు గాఁడు. పదునాలుగుతర ములనుండి మావంశములో నెవ్వరికిని బుత్రసంతానమే లేదు. అంద ఱు నాఁడుపడుచులే. ఆపాపుభద్రుఁ డెవ్వరిపిల్లవానినో—"అనియెను.

అంతలోనే ప్రతీహారి యామె నొకదెబ్బ కొట్టెను. దానితో నామె కిక్కురుమనక యూరకుండెను. మల్లిక తనచరిత్రమును జెప్పు చున్నంతవఱకును మహాదేవి నవ్వుచునే యుండెను. అప్పుడు దేవి యామెం జూచి "నీవిప్పుడు పాపుభద్రుఁ డంటివే—అతఁ డెవ్వఁడు ? నీమగఁడా యేమి ?" అని యడిగెను.

మల్లిక—(ఆవేశముతో) అయ్యో దేవుడా! అయ్యో! నాకె క్కడిమగండు! నామగండు వచ్చి యెన్నియోయేండ్లు గడచిపోయినవి. అమ్మా! ఆయంభద్రునకును నాకును చిరకాలపరిచయము కలదు. అంతే. ఆతఁడు పొరుగూళ్లనుండి నాకుఁ గావలసినసామగ్రిని దెచ్చిపెట్టుచుండును. నగరమున కెప్పుడైన వచ్చినచో నాతఁడు నాయింటనే విడియుచుండును.

మహాదేవి—సరే. నాకంతయుఁ దెలిసినది. నీవిఁకఁ బోవచ్చును.

ఆజ్ఞయైనంతనే మల్లిక మరల వెనుకకుఁ దిరిగి చూడకయే యతిత్వరితముగ వెడలిపోయెను.

అప్పుడు మహాదేవి తనతొడపైఁ గూర్చుండియున్న బాలకు నుద్దేశించి "అబ్బాయీ! మీరు చరణాద్రిదుర్గమునుండి పాటలీపుత్రమునకుఁ గాలినడకనే బయలుదేఱితిరా?

బాలు—ఔను. అంతకంటె మాకాధారమేమున్నది? అవంతివర్మ మాసర్వస్వము నపహరించివైచెను. మాతండ్రిగారి వృద్ధసేవకుఁడుమాత్రము మాకొకగాడిద నిచ్చెను. అవంతివర్మకు భయపడి మేము రహస్యముగా బయలుదేఱితిమి. నేను గాడిదపై నెక్కివచ్చుచుంటిని. మాయక్కయు, నాన్నయు నడచి వచ్చుచుండిరి.

మహా—పిమ్మట నేమిజరగినది బిడ్డా?

బాలు—ఆగుప్తపురాతులు మార్గమునందే మాయక్కయ్యను బట్టి తీసికొనిపోయిరి. నాగాడిద బెదరి నన్ను వేఱొకచోటికి దూరముగఁ దీసికొనిపోయినది. మఱునాఁడొకవర్తకుఁ డగపడి నన్నీనగరమునకుఁ దీసికొని వచ్చెను. ఇప్పు డిటనుండి పోయినసైనికుఁడు నేనున్న యంగడికిఁ బప్పుబియ్యము మొదలగువానిని గొనవచ్చెను. ఆతనిమాటను నెత్తిపైఁ బెట్టుకొని నేనాతనితో శిబిరముకడకుఁ బోవుచుంటిని. త్రోవలో నొకచోట మాయక్కయ్య నాకగపడియెను. చటాలునఁ

బోయి నేనామెను గాఁగిలించుకొంటిని. తరువాత నెంతయో గందరగోళ మైనది. తుదకొక మహాత్ముఁడు మమ్మిటకుఁ దీసికొని వచ్చెను.

అప్పుడు చక్రవర్తి సింహాసనమునుండి లేచి 'దేవీ! ఈబాలుఁడు యజ్ఞవర్మతనయుఁడు. ఈతని నెల్లవిధముల లాలించి పాలించువారు నాకంటె నెవ్వరున్నారు? అనంతా! నీవిఁక నెంతమాత్రమును భయము పడవలదు. తెలిసినదా? నేను నిన్నుఁ బోషించుటకు సంసిద్ధుఁడనై యున్నాను" అనియెను.

అనంతవర్మ యాసార్వభౌమునిం దిలకించుచు "మాతండ్రిగా రెప్పుడును నాకొకవిషయము నుపదేశించుచుండెడివారు. అనంతా! నేనొకవేళ మరణించినచో నీవుపోయి మహాసేనగుప్తసార్వభౌము నాశ్రయించి బ్రదుకుము! ఇఁక నెవ్వరియొద్దకును బోకుము." అని నాకు బోధించుచుండెడివారు. మీరెవ్వరో నేనెఱుఁగను. మాతండ్రిగారియాజ్ఞను నిర్వహించుటకై నేను మాసార్వభౌమునికడకే పోయెదను." అనియెను.

సరళహృదయుఁ డగునాబాలకునినోటినుండి వెడలినయా మాటలను విని మహాసేనగుప్తునిహృదయము కరఁగిపోయెను. ఆతనికపోలములపై నొకటిరెండశ్రుబిందువులుకూడ దృగ్గోచరము లయ్యెను. కొంతసేపటివఱకు నాతఁ డేమియు మాటాడఁజాలక యొక్కింతతడవునకుఁ గంపితస్వరముతో "బిడ్డా! ఎప్పుఁడెన్ని యోసారులు నాప్రాణములను గాపాడెనో యట్టిజీవనదాతను నేను మఱచియేపోయితిని. కాని యాయజ్ఞవర్మమాత్రము నన్నుమఱవలేదు. కుమారా! మీతండ్రిచే రక్షింపఁబడినమహాసేనగుప్తుఁడను నేనేయని తెలిసికొనుము!" అనియెను.

రెప్పపాటుకాలములో నాబాలకుఁడు లేచి వచ్చి సార్వభౌముని పాదములపై వ్రాలెను. తత్క్షణమే మహాసేనగుప్తుఁ డాబాలకు నెత్తికొని యటనుండి వెడలిపోయెను.

మహా—ప్రభాకరా! ఇఁక నావిమర్శనము పూర్తియైనది. నీవేమైనఁ జెప్పవలసియున్నచోఁ జెప్పుము!

సార్వభౌమప్రభాకరవర్ధనుఁడు లజ్జితుఁడై తలవంచి యస్ఫుటస్వరముతో " జననీ! ఈయపరాధ మంతయు నాదే! నన్ను క్షమింపుము! ఇప్పుడే పోయి చంద్రేశ్వరుని శిక్షించెదను.

---

## ఎనిమిదవప్రకరణము

రోహితాశ్వదుర్గజీర్ణతటముపైఁ గూర్చుండి కాకులు కావు కావుమని యఱచుచుండెను. కోటలోని వారందఱు నింకను నిద్రించుచునే యుండిరి. కాని యాకాకములభయంకరధ్వనిచేఁ దుదకు రఘువునకు నిద్రాభంగ మయ్యెను.

రఘువు లేచి చూచెనుగదా, వానియా యింకను నిద్రించుచునే పడియుండెను. అప్పు డాతఁ డామె నిటు నటు పొరలించుచు "ఈకాకుల కేకలవలన మనయజమానున కప్పుడే మెలఁకువ కలిగియుండు నని తలఁచెదను, నీకేమైన బుద్ధి యున్నదా లేదా? క్రమముగాఁ బొద్దెక్కిపోవుచున్నది! ఇంకను నిద్రయేనా?" అనియెను.

తుద కెట్లో నిద్రాభంగ మగుటయు వృద్ధ యగు వానియా కన్నులు తుడిచికొనుచు లేచి కూర్చుండి రఘువుం గాంచి తనబోసినోటిని దెఱచి నవ్వుచు "రఘూ! ముసలితనము హెచ్చుచున్నకొలఁదియు నీవు పరిహాసప్రియుఁడ వగుచున్నావే! పీనుఁగా! ఇంతటివేదాంతమును నాకు బోధించెడు నీవు మాత్ర మిప్పుడేగాదా లేచితివి? యజమానునకు నిద్రాభంగము కాకుండ నీకాకులను దోలివేయలేకపోయితివా?" అనియెను.

రఘు—సెబాస్! ముసలిదాన వగుటచేతనే నిద్రపోవలయు ననియే యున్నదికాఁబోలును! అట్లయినఁ బరుండుము. నేనే పోయి కాకులను దోలి వచ్చెదను.

అని యావృద్ధుఁడటనుండి యతిత్వరితముగ బయలుదేఱెను; గాని మార్గములో నొకపెద్దగోనెసంచి కాలికిఁ దగులుటచే నాతఁడు తటాలునఁ గ్రిందఁబడిపోయెను. అది చూచి నానియా భయముతో "ఆఁ! ఆఁ! అదేమి!" అని కేకలు వైచెను. రఘువు భూమినుండి లేచులోపల నాసంచి యాగదిమూల భద్రముగానుంచిన కుండలదొంతరపైఁ బడుటచే నామృణ్మయపాత్రలన్నియు గలగలధ్వనితో దొరలి యాతనితలపైఁ బడియెను. "అయ్యో! అయ్యో!" అనివృద్ధనానియా మఱింతబిగ్గఱగా నఱవసాగెను.

రఘువునకు గట్టిదెబ్బలే తగిలెను. వార్ధకమునం దేమాత్రపు దెబ్బ తగిలినను నది యధికముగ బాధించు ననియెల్లరకుఁ దెలిసినవిషయమే పగిలినకుండలనడుమఁగూర్చుండి రఘువు చేతులతోఁ దలయును, మూపును దడవుకొనుచుండెను.

నాని—ఏమోయి! దెబ్బ గట్టిగాఁ దగిలినది కాఁబోలు నేమి?

వృద్ధుఁ డేమియు మాఱుపలుకలేదు. సానుభూతిని బ్రకటించుటకై నానియా మరల నాప్రశ్ననే వైచెను. తుదకు రఘువు బాధ నభినయించుచు "వట్టిపేర్మిచూపుటవలన నేమిలాభము? అబ్బబ్బ! నాతల బ్రద్దలై పోయిన ట్లున్నది! నీవు ముసలిదాన వైపోయినావు. నీకుఁ గన్నులు బాగుగాఁ గనఁబడకపోవుట నరిగదా, యెక్కడ నేవస్తువుంచితివో యాసంగతికూడ నీకు జ్ఞాపక ముండదు!" అనియెను.

నాని—(ఆశ్చర్యముతో) చాలుఁ జాలు! అంతగా నోరు చేసికొందువేల? క్రొత్తకుండల నీగదిలో నుంచుట నాకేమిపని? అట్టివాని నన్నిటిని నాగదిలోనే యుంచుకొందును. ఇన్నికుండలును, సం

చులును నీగదిలోని కెట్లువచ్చెనా యనియే నేను నాలోచించుచు న్నాను.

రఘు—(బాధపడుచు) ఏమో! చక్కని చుక్క వగునిన్నుఁ జూచి మోహించి రాక్షసరాజీసామానంతయును రాత్రికిరాత్రియే నీకుఁ బంపినాఁడు కాఁబోలును! ఈసణఁగుల కేమిగాని త్వరగాఁ బోయి కొంచెము నీళ్ళు తెచ్చిపెట్టుము. చూడుము! నావీఁపునుండి రక్తము కాఱుచున్నట్లున్నది! అయ్యయ్యో! నాదోవతి యంతయు రక్తముచేఁ దడిసిముద్దయైపోయినది—చూడు!

నానియా దగ్గఱకు వచ్చి పరిశీలించెను. రఘునితలనుండి యొక విధమగు తెల్లనిద్రవపదార్థము వీఁపుక్రిందికి జాఱుచుండెను. దానిచే నాతనివస్త్రము దడిసిపోయెను. నానియా యాప్రదేశమును బాగుగఁ బరిశీలించెను. కుండలదొంతి యంతయును మొదలంటఁ గూలిపోలేదు. నాలుగైదుపాత్రలవరుస యింకను నట్లే నిలిచి యుండెను. పగిలిన పై కుండనుండి యాద్రవపదార్థ మింకను రఘునితలనుండి ధారగాఁ బడుచుండెను. నానియా యింకను ముందటికిఁ బోయి బాగుగఁ బరీక్షించెను. పగిలిపడిపోయినకుండలనుండి లడ్డు మిఠాయిలు మొదలగు వస్తువులాగదియందుఁ జెదరిపడియుండెను. ఒకకుండనుండి పంచదారపాకముతోఁ జేయఁబడిన భక్ష్యపదార్థ మాతనితలపైఁ బడి క్రిందికి జాఱి యాయిల్లంతయు బురదగా నుండెను.

ఈయద్భుతదృశ్యముం గాంచి యావృద్ధురాలు నవ్వాపఁ జాలక పోయెను. ఒక్కదంతమైనను మిగులకుండఁ బోయినతనబోసినోటిని దెఱచి యామె బిగ్గఱగా నవ్వ నారంభించెను. ఆప్రచండహాసధ్వనిచే నా పురాతనమందిర మంతయు గడగడలాడుచున్నట్లుండెను. ఆహాసముచే రఘునకుఁ గోపము రేఁగి యామెను నోటికి వచ్చినట్లెల్లఁ దిట్టుట కారంభించెను.

నానియా తనహాసవేగము నొక్కించుక తగ్గించి "రఘూ! నీ దేహమునకును, దలకును నేమి యంటుకొన్నదో యొక్కసారి లేచి బాగుగాఁ జూచికొనుము! నీతల పగిలిన దనియు, నందుండి రక్తము ప్రవహించుచున్న దనియు మాత్రమే నీవు గ్రహింపఁగలిగితివి. తక్కిన సంగతి నీకుఁ దెలియునే తెలియదు.

రఘు—(భయముతో) ఆలాగా? నాయొడలినిండ నేమి యంటుకొన్నది!

నాని—(పకపకనవ్వుచు) ఏమున్నది? లడ్డులు, మిఠాయి, శర్కరపాకము!

రఘువు తనసర్వాంగకములను బరిశీలించుకొని భయభ్రాంతుఁడై కంపితస్వరముతో "ఓహో! ఇవి యన్నియు నెక్కడనుండి వచ్చినవి? ఓ దైత్యరాజా! ఇంతకుముందు నిన్నుఁ బరిహాసించితిని. అపరాధము చేసితిని; మహాపరాధము! దేవా! నన్ను క్షమింపుము. రేపటియుదయమున నీకా చెట్టుక్రింద నొకకోడిపిట్టను బలిపెట్టెదను— ఓసీ! నానియా! ఇవియన్నియు భూతచేష్టలుగనే తోఁచుచున్నవి. మధురభోజ్యములను, బక్వాన్నములను గాంచి నేఁటికిఁ బదియేండ్లయ్యెను. ఇప్పు డాకస్మికముగా నీమధురపదార్థవర్షమును గురియించినవా రెవ్వరైయుందురు?" అనియెను.

నాని—(పెదవుల జప్పరించుచు)ఔను. నీవనినమాటయే నిజమైయుండవచ్చును.

ఇంతలో ద్వారమునకడ నెవ్వరిదో చాయ కనఁబడెను. కంసాలి ధనసఖుఁ డవ్వాల నిలువఁబడి "రఘువు లేచినాఁడా?" అని ప్రశ్నించెను. ధనసఖుఁ డాలోపల జరగుచున్న సంగతుల నన్నిటిం గాంచి యాశ్చర్యచంచలుఁడై సంతాపసూచకస్వరముతో "అయ్యయ్యో! ఈ కుండల నన్నిటిని బగులఁగొట్టితి రేమి? జపిలగ్రామమునందలి మిఠాయియంగ

డివారు డీపదార్థముల నన్నిటిని ప్రభువునకుఁ బంపియున్నారు.’ అనియెను.

రఘు.—వహావా! అట్లయిన నివి భూతచేష్టలు కావు. మొద టనే నాకీసంగతి తెలిసినచో నెంతబాగుగా నుండును! ఆహా!

అని యాతఁడు క్రిందనున్న యొకలడ్డును దీసి నోటఁ గుక్కు కొని నములుచు నస్పష్టస్వరముతో “ఆహా! నానియా! ఇట్టిమిఠా యిలు తిని యెన్నాళ్లయినది? చూడు! చూడు! నీవుకూడఁ గొంచెము తిని చూడుము!” అని చెప్పుచు నొక్కటొక్కటిగా నామధురభక్ష్య ములను నోట వైచికొనసాగెను. క్రమముగా నాతఁడు తనయెదుటి కంటుకొనియున్న శర్కరపాకమును జేతులతోఁ జేదికొని దానికి యో గ్యమగుస్థలంబునకుఁ జేర్చివైచుచుండెను.

ఆతనిం జూచి నానియా మొగముపై ముసుఁగు వైచికొని నవ్వుచుండెను. ధనసఖుఁడు ద్వారముకడ నిలిచి యంతయును గాంచు చుండెను. చుట్టుప్రక్కలనున్న భక్ష్యము లైపోయినతరువాత రఘువు నానియాను జూచి “పైకుండలలో నేమున్నదో చూడుము!” అనియెను.

నాని—(నవ్వుచు) ఇంకను నీదృష్టి నీకుండలమీఁదికిఁ బోనీయ కుము! ఇవి యన్నియు మనప్రభువుకొఱకు వచ్చినవి. ఇంతవఱకుఁ దిన్నది చాలదా? ఇంక నదేపనిగాఁ దినుచున్నచోఁ గడుపుపగిలి చచ్చి పోయెదవులే! ఇఁక నటనుండి లేచి రమ్ము!

ధనసఖుఁడు తనలో నవ్వుకొనుచు “రఘూ! ప్రభుదర్శనార్థము కోటబయట ననేకులు వేచియున్నారు. ఈవార్త ప్రభువున కెఱింగిం పుము!” అనియెను. రఘువు మెల్లగ లేచి యొడలు కడిగికొని పాత గుడ్డ నొకదానిని దలకుఁ జుట్టుకొని దుర్గాధిపుని శయనగృహమునకుఁ బోయెను.

నాని—ధనసఖా! ఈపదార్థము లన్నియు నెచ్చటినుండి వచ్చినవి?

ధన — రోహితాశ్వమర్గప్రజలు తెచ్చియున్నారు. ఇంకను నెన్నియోపదార్థములు బయటఁ బడియున్నవి మీయుగ్రాణమెచ్చటనున్నదియో మాకుఁ దెలియకపోవుటచేఁ గొన్ని పదార్థములను మాత్ర మీగదిలోనికిఁ దెచ్చి పెట్టితిమి. తక్కినవన్నియు బయటనేయున్నవి.

నాని — ఆలాగా! అట్లయినఁ గొంచెము సేపుండుము. ముందుగా నీకిందిభాగమంతయు నూడ్చి శుభ్రపఱిచెదను.

అని చెప్పి నానియూ చీపురు చేతఁబట్టుకొని పగిలినకుండపెంకుల నన్నిటిని దీసివైచి నేలయంతయు శుభ్రముగ నూడ్చివైచుచుండెను. ధనసఖుఁ డటనుండి వెడలిపోయెను. నానియూ వెలుపలికి వచ్చి చూచెను. ఆవిశాలమైనబయలంతయు జనులచే నిండి యుండెను. అచ్చటనున్న జనులు వేయికన్న నెక్కువమంది యుండవచ్చునని యామెకుఁ దోఁచెను. వారిసమక్షమున భోజ్యపదార్థములు రాసులుగాఁ బడి యుండెను. పిష్టము, తైలము, ఘృతము, తండులములు శర్కర మున్నగువానినంచులును పాత్రలును ననేకముగ నొక్కచోఁ జేరి యచ్చట గోడపెట్టినట్లుండెను. వారిలో నానియూ నెఱుంగనికొంద ఱామెయే గృహిణియనుకొని లేచి యామెకు నమస్కరింప నారంభించిరి. ఎఱిఁగిన మఱికొందఱు వారిని వారించుచుండిరి. అచ్చటనున్న వస్తువుల నన్నిటి నుగ్రాణమునఁ జేర్చుట తనకొక్కదానికి నశక్యమని యెంచి నానియూ లోపలికి వెడలిపోయెను.

దుర్గాధిపతి యగుయశోధవళదేవుఁ డప్పుడే లేచి మంచముపై గూర్చుండి యుండెను. రఘు నాతనివస్త్రములు మొదలగువాని జేతఁ బట్టుకొని దుర్గాధిపతియెదుట నిలిచియుండెను. ఇంతలో ముక్తకుంతలములు మూఁపున జీరాడ మారుతవేగమున నెగురుచు బాలిక యటకు వచ్చి పితామహునికంఠమును గౌఁగిలించుకొని "తాతా! ఇఁక లెండు;

మీకొఱకు కొందఱో జనులువచ్చి బయటఁ గూర్చుండి యున్నారు." అనియెను. యశోధవళుఁడు నవ్వుచు "ఇదే లేచుచున్నానుతల్లీ !" అనియెను.

రఘువు తనస్వామికి వస్త్రముల నిచ్చి వెడలిపోయెను. కోటలోనిమైదానములో మత్స్యదేశమునుండి తేఁబడిన శ్వేతస్ఫటికశిలలచేఁ గట్టఁబడినయొక యరుఁగుండెను. అదికట్టి చాలకాలమైనందునను, ఈనడుమ నెవ్వఁడును బాగుచేయింపకపోవుటచేతను, ఆయరుఁ గచ్చటచ్చట పడిపోవుచుండెను, దానిచాందని యొకవైపున కొఱఁగిపోయెను. అటనొక యశ్వత్థవృక్షము మొలిచి విశాలముగ వ్యాపించియుండెను. ఈయరుఁగుపై నింకొక యరుఁగును దానిపై బ్రహ్మశిలానిర్మిత మగు ద్వాదశకోణసింహాసనము నుండెను. ఈసింహాసనము రోహితాశ్వదుర్గము నిర్మించినకాలమునందే ప్రతిష్ఠింపఁబడినది. దుర్గాధిపతి యీసింహాసనమునందే కూర్చుండి తనప్రజలయభియోగములను దీర్చుచుండును. ధవళవంశమహానాయకు లీయరుఁగునకుఁ జుట్టును నమూల్యములగు శ్వేతకృష్ణశిలాఫలకములచే నతినిపుణముగ గోడలను, స్తంభములను నిర్మింపఁజేసి యుండిరి. దుర్గాధిపతి సింహాసనాసీనుఁడై ప్రజలఁ బరామర్శించుచున్న సమయమున దుర్గరక్షకసైన్యము బారులుతీరి తటాంగణమున నిలిచి యుండును, మహానాయకునకు లోఁబడిన సేనానాయకులకును, జిన్నచిన్నజమీందారులకును, దుర్గాధిపతిసమక్షమున నాసనములు లభించుచుండును. ఇతరులందఱు నటనిలిచియే యుండవలయును. ఆనల్లనిఱాతియరుఁగుపై బంగారుసింహాసనముండును. దానిపై స్వర్ణరత్నమౌక్తికాదులచే నందం దలంకరింపఁబడినయొక యమూల్యాచ్ఛాదనవస్త్రము పఱుపఁబడును. రోహితాశ్వదుర్గాధిపతి దానిపైఁ గూర్చుండును. దుర్గనాయకుని భాగ్యలక్ష్మితోఁ బాటుగ నాతనిపూర్ణోచ్ఛదశాచిహ్నము లన్నియునుగూడ నశించి చాలకాలమైపోయెను.

ఈ రెండుసింహాసనములుమాత్ర మింకను మిగిలియుండెను. ఈస్వర్ణసిం హాసన మత్యమూల్యమైనది. ఎంత దుర్దశకుఁ బాల్పడినను, వస్త్రములకుఁ గూడ నాధారము లేక యెట్టియిబ్బంది కలిగినను నభిమానము చేతను, లజ్జచేతను మహానాయకుఁ డీపీఠమును విక్రయింపఁజాలకపోయెను. అది యతిప్రయత్నమున నొకశిలావేదికపై నెప్పటి యట్లియుంపఁబడి యుండెను.

యశోధవళదేవుఁడు తనకుమారుఁడు మరణించుటకుఁ బూర్వము తఱచుగాఁ దన ప్రజలకు దర్శనమొసంగుచుండెడివాఁడు. ఆవశ్యక కార్యము లున్నప్పుడాతఁడు తనకుమారుఁ డగు కీర్తిధవళునిగూడఁ దన చెంత రెండవ సింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టుకొనుచుండును. కీర్తిధవళునిమరణానంతర మాయరుఁగుపై నెవ్వరును గూర్చుండలేదు. అచ్చట నొకరావిచెట్టు మొలిచి వ్యాపించి యుండెను.

రఘువు ధనపఖునితోఁ జెప్పి కొందఱుమనుష్యులను సాయముగాఁ దీసికొని యాయరుఁగుపై నున్నవస్త్రములను దొలంగించి కనకసింహాసనమునుదీసి యరుఁగుపైనున్న నల్లసియాసనముపై దానిని భద్రముగా నుంచెను. ఆసింహాసనముమీఁది చిత్రకళాకౌశల మప్రతిమానమైనది. దానిం దిలకించుటకై యచ్చటివారందఱును గుమిగూడి వచ్చిరి. అందున్న వయోవృద్ధులుగాక తరుణవయస్కులెవ్వరు నాసింహాసనము నిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. అది కనకసింహచతుష్టయముపై వికసితకనకకమలపుష్పములపై నతినిపుణముగ నమర్పఁబడి రత్నముక్తామణివిరాజితం బగు నమూల్యవస్త్రముచే నాచ్ఛాదింపఁబడి విరాజిల్లుచుండెను. బహుకాలమునుండి దాని నెవ్వరు నుపయోగింపకయే యుండుటచే నావస్త్రము ప్రాఁతగిలి జీర్ణమై యయ్యాసనమునుండి యూడి యుందలిదూది వెలికిఁ గానవచ్చు చుం

డెను. ఆబంగారుసింహాసనమున కొందంతఁ జిలుముపట్టియుండెను. అట్టిస్థితింగూడ నాపీఠ మతిసుందరమై మనోహరమై యుండెను.

సింహాసనసందర్శన కుతూహలురై ప్రజలందఱును జుట్టును మూఁగి గందరగోళము చేయుచుండిరి. ఇంతలో రఘువు గంభీరస్వరముతో బిగ్గఱగా "దుర్గాధిపతిమహానాయకయువరాజభట్టారకపాదులు యశోధవళదేవులవారేతెంచుచున్నారు." అని కేకవైచెను. ఆమాట విన్నతోడనే తత్తరముతో నెల్లరును వెనుకకోసరిల్లిరి. అంత యోధవేషధారులగు కొందఱు వృద్ధులాజనుల కెదురుగా వచ్చి నిలిచిరి.

అంత శుభ్రోత్తరీయపరిధానుఁడై తన ధవళకేశసముదాయమును గేవలవస్త్రశిరస్త్రాణముచే నాచ్ఛాదితముగఁ జేసికొని కృపాణపాణియై యశోధవళదేవుఁడేతెంచి జయధ్వనులతో సింహాసనాసీనుఁడయ్యెను. ఎక్కడనుండియో యొకయెఱ్ఱని ప్రాంతవస్త్రమును సంపాదించి తెచ్చి తలకుఁ జుట్టుకొని సింహాసనమున కెదురుగ ననతిదూరమున రఘువు నిలువఁబడియుండెను.

అప్పు డందఱికంటె ముందుగా నోట నొక్కదంతమైనను మిగిలియుండని ధవళకేశశిరస్కుండగు నొకవృద్ధుఁడు దుర్గాధిపతిచెంతకరుదెంచి తనయొఱనుండి కరవాలముం దీసి దానియగ్రభాగముచే దనశిరస్త్రాణమును స్పృశించుచు వినయవినమితుఁ డయ్యెను. ఆక్షణమునందే రఘువు "సేనానాయకహరిదత్తుఁడు!" అని బిగ్గఱగఁ గేకవైచెను.

హరిదత్తు యశోధవళదేవునిచరణసమీపమునఁ దనకరవాలమును వైచి దానిపై నొకసువర్ణముద్రికనుంచెను. దుర్గాధిపతి వెంటనే యాంతరవారినందుకొని మరల హరిదత్తునకుఁ బ్రసాదించెను. అప్పుడు

హారిదత్తు దుర్గాధిపతికి మరల నమస్కరించి వెనుకకు నడచుచు వెడలిపోయెను.

అనంతర మాజానుబాహుఁడును, శస్త్రాస్త్రధారియు నగు నుజ్జియొకవృద్ధపురుషుఁ డాజనసమూహము నతిక్రమించుకొని దుర్గాధినాథుని సమక్షమున కేతెంచి ప్రణామమును గావించెను. రఘువు యథాప్రకారము బిగ్గఱగా "సేనానాయకసింహదత్తుఁడు" అని యఱచెను.

హారిదత్తునివలెనే సింహదత్తుఁడును దనకరవాలమును, సువర్ణ ముద్రయును యశోధవళదేవునెదుట నివేదించెను. మహానాయకుఁ డాతరవారి నెత్తి యు తనికి మరల నిచ్చివైచెను.

సింహదత్తుఁడు వెనుక కరిగినపిమ్మట నతివృద్ధుఁ డగు నొక పురుషుఁ డిరువురుతరుణవయస్కులసాయముచే నాగుంపునుండి వెలువడి దుర్గాధ్యక్షునెదుట నిలువఁబడియెను. ఆవృద్ధుఁడు కన్నులఁ బడి నంతనే దుర్గాధిపతి తటాలున లేచి "ఎవరు? విధుసేనుఁడా?" అనియెను.

దుర్గాధిపతి మొగమునుండి యీమాటలు వెలువడిన క్షణ మందే యావృద్ధుఁ డాతని చరణములకడఁ దటాలున వ్రాలి ముక్తకంఠుఁడై రోదనము చేయఁదొడంగెను. యశోధవళదేవుఁ డాతని లేవ నెత్తెను. ఆతని నేత్రములుకూడ నశ్రుజలంబులచే నిండి యుండెను. అట్టిభావముతోనే దుర్గాధిపతి తనస్వరము కంపించుచుండ "విధుసేనా! కీర్తిధవళుఁడు మరణించియే చాలకాలమైపోయినది. ఇంత కాలమునుండియు నీవిదుర్గమున కొక్కసారియైన రాలేదేమి?" అని ప్రశ్నించెను.

విధుసేనుఁడు వెక్కుచు "ప్రభూ! ఎవ్వరినిదీసికొని మీయెదుటికి వత్తును? ఏమొగము పెట్టుకొని వత్తును? మేఘనాదపు టావలితీర

మున నాసర్వస్వమును బాఱవైచికొని వచ్చియుంటిని. కేవలముఁ కీర్తిధవళు నొక్కనినే యచ్చట విడిచి రాలేదు. నాయిరువురుపుత్త్రుల నుగూడ నచ్చటనే డించి వచ్చితిని. ఆపర్వతప్రాంతములలో నెందఱు పుత్త్రుల, నెందఱుపితరుల, నెందఱుసోదరులఁ గోల్పోయి వచ్చితినో లెక్కయున్నదా? ప్రభూ! లెక్కలేదు. లేదు! నాకిప్పుడీయిరువురుబాలకులకంటె నాయనిపించుకొనుట కిఁక నెవ్వరును లేరు. జయసేనుని మరణవార్త నాలకించి యాతనిపత్ని యీ శిశుద్వయమును నా యొడిలోఁ బడవైచి యగ్నిప్రవేశముం గావించినది. ఆనాఁటఁగోలె రాజకార్యములను, యుద్ధవ్యవసాయములను ద్యజించి వీరిలాలన పాలనములతో ని యెనిమిదేండ్లను గాలక్షేపము గావించుకొంటిని. అని "యశఃపటలికుఁ" డగు (రాజోత్పన్నవిభాగముపైవధకారి) విధుసేనుఁడు బాలకునివలె వెక్కివెక్కి యేడువనారంభించెను.

యశోధవళదేవుఁ డతికష్టముతో విధుసేను నించుక యూరడించి "విధుసేనా! మీరొక్కసారి యీదుర్గమునకు వచ్చినచోఁ బొట్టకూటికిఁగూడఁ గష్టపడవలసిన దుర్గతి కలుగకయే యుండును. అట్లు జరగినచో నాపత్నిరత్నవలయమును విక్రయింపవలసిన యావశ్యకమే లేకపోవునుగదా!" అనియెను.

ఈమాటలు వినినంతనే విధుసేనుఁడు మరల దుర్గాధిపతిపాదములపై వ్రాలి దుఃఖించుచుఁ గంపితస్వరముతో "ప్రభూ! ధనసఖుని వలన నేనీవార్త నిప్పుడే వినియుంటిని. నేను రాకుండుటవలన స్వామి కిట్టిశోచనీయావస్థ కలుగునని కలనైన నేనెఱుంగనైతిని" అని మఱింత బిగ్గఱగా నేడువఁదొడంగెను. యశోధవళుఁ డాతని శాంతపఱచి యరుఁగుపైఁ గూర్చుండఁబెట్టెను. ఒక్కింతసేపటికి దుఃఖావేగము శాంతించుటయు నావృద్ధుఁడు తన యిరువురుమనుమలతోడను దుర్గాధిపతియెదుట నిలువఁబడియెను. అప్పుడు మువ్వురును దమయాయుధ

ములతో సువర్ణముద్రలను దుర్గాధిపతికి సమర్పించి యభివాదనములం గావించిరి.

అనంతరము నూఱు, నూటయేఁబదిమంది సైనికులు, తమ పుత్రులతోడను, పౌత్రులతోడను, వచ్చి దుర్గాపతికిఁ బ్రణామములం గావించుటకుఁ గ్రమక్రమముగఁ జేరుచు వాడుకప్రకారముఁ దమతమ యాయుధములతో శక్తికొలఁది వెండి, రాగి నాణెములను సమర్పించి యధిపతికిఁ బ్రణమిల్లుచుండిరి. దుర్గాధిపతియు, వారిప్రణామముల యథోచితముగ స్వీకరించి వారివారికరవాలములను దీసి మరల వారికిచ్చుచుండెను. అనంతరము చిన్న చిన్న జమీనుల యధికారులును, వ్యవసాయకులును దమతమస్థితుల ననుసరించి బంగారు, వెండి, రాగి నాణెములను సమర్పించి యధిపతికిఁ బ్రణమిల్లిరి. చూచుచుండఁగనే సింహాసనమునెదుట స్వర్ణరౌప్యముద్రికలరాసు లేర్పడియెను

తుట్టతుది తరుణవయస్కుఁడును, బలవంతుఁడును యోధవేషధారియునగు నొకపురుషుని వెంటఁబెట్టుకొని ధనసఖుఁడు ప్రభుసమక్షమున కేతెంచెను. తోడనే తరుణుఁ డుచితవిధానమున దుర్గాధిపతి కభివాదన మొనర్చుటయు ధనసఖుఁడు "ప్రభూ! ఈతఁడు మీపురాతన సేవకుఁడగు మహేంద్రసింహునితనయుఁడు; వీనిపేరు వీరేంద్రసింహుఁడు" అని విన్నపము గావించెను.

యశోధవళుఁడు వీరేంద్రసింహునిం గాంచి ప్రేమార్ద్రస్వరముతో "వత్సా! నీజనకుఁడు భుజము భుజము సోఁకునట్లు నాతోఁ గూడి యనేకరణరంగములలోఁ దనప్రచండపరాక్రమమును బ్రదర్శించి యున్నాఁడు. అట్టినీజనకుని కరవాలమునే యిప్పుడు నీకిచ్చుచున్నాను. నీవు దీనిగౌరవమును రక్షింతువుగాకయని విశ్వసించుచున్నాను." అని చెప్పుచు నొక కృపాణము నాతని కొసంగెను వీరేంద్రుఁడు

దానిం గైకొని నేలవఱకును వంగి ప్రభువునకుఁ బ్రణామము గా
వించెను. వృద్ధుఁడగుటచేఁ బటలికుఁ డింకను నరుఁగుమీఁదనే
కూర్చుండియుండెను. అందఱియభివాదనములను ముగిసిన పిమ్మట
నాతఁడు లేచి "ప్రభూ! వంగదేశసంగ్రామానంతరమున మీ ప్రజలు
మాకిచ్చుపన్నులను నియమానుసారముగాఁ జెల్లించుట మానుకొనిరి.
ఈనడుమ వీరేంద్రుఁడును, ధనసఖుఁడును, నేనును గలసి యూరూ
రునకును గొందఱుజనులను బంపి బోధించి యెప్పటియట్ల పన్నులఁ
జెల్లించున ట్లందఱ నంగీకరింపఁజేసి యున్నాము. వారందఱు నిచ్చుట
నే యున్నారు. ఆజ్ఞయైనచో వారి నెల్లరను మీసముఖమునకు రా
వించెదను" అని మనవి చేసెను.

దుర్గాధిపతి యందుల కంగీకరించుటయు విధుసేనుఁ డొక్కొ
క్కరినే పిలువనారంభించెను. వారు వచ్చి సింహాసనమున కెదుట నిలిచి
వీరేంద్రసింహుఁడు చెప్పిన తెలుఁగునఁ దమతమపన్నుల నాతని యెదు
టఁ జెల్లించి వెడలఁదొడఁగిరి. బంగారు, వెండి రాగి నాణెములను వే
ఱువఱచి ధనసఖుఁడు వానిని లెక్కింప నారంభించెను.

ఈవిధముగా నాదినము రెండుజాములవఱకును గడచిపోయె
ను. నాణెముల నన్నిటిని లెక్కించి వేయిరెండువందల పదునెనిమిది
సువర్ణముద్రికలును, ఆఱువందలయేఁబది వెండిముద్రికలును, నూటికి
గొంచెమెక్కువగ రాగినాణెములు నున్నవని ధనసఖుఁడు ప్రకటిం
చెను.

తరువాత ధనసఖుఁడు సింహాసనమునెదుట మోకరించి తనయుత్త
రీయాంచలమునుండి రత్నవలయమును బైకిఁ దీసి సింహాసనమునెదుట
నుంచి ముకుళితకరయుగుఁడై "స్వామీ! ఈయమూల్యరత్నవలయ
మును విక్రయించుట నాతరముగాదయ్యెను. నిశ్చయముగా నేఁబది
వేలసువర్ణముద్రికలకంటెను దీనిమూల్య మధికమే!" అనియెను.

యశోధవళుఁడు చటాలున లేచి ధనసఖుని కౌఁగిలించుకొని కంపితస్వరముతో "ధనసఖా! నీవు కావించినపనులన్నియు నాకిప్పుడు తెలియవచ్చినవి. మీయందలిదయవలననే నాపత్నివలయము విక్రయము కాకుండ నిలిచినది. నిజమే—కాని, దీనిని సంరక్షించుటకుఁ దగినపాత్రత నాయెడ లేదు. రోహితాశ్వదుర్గకోశాధ్యక్షపదవి చాలకాలమునుండి నామమాత్రావశిష్టమై యున్నది. ధనసఖా! నీవే కోశాధ్యక్షుఁడవై దుర్గేశ్వరి యీవలయమును, ఈధనమును గాపాడుచుండుము. నీకు రావలసినధనమును దీనినుండియే తీసికొనుము. "నామనుమలకుఁగాని, నామనుమరాలికిఁ గాని వివాహమయినప్పుడు నాజ్ఞాపకచిహ్నముగా నీవలయము నొసంగవలయును" అని నాపత్ని మరణకాలమునందు నాతోఁ జెప్పియున్నది. ఎన్నఁడైనను కీర్తిధవళుని తనయకు వివాహము తటస్థించునేని మాజ్ఞాపక చిహ్నముగా నీవలయము నప్పు డామెకు నీవొసంగుము" అని చెప్పుచు యశోధవళుఁడు కంఠస్వరము రుద్ధమగుటయు నిఁక మాటాడఁ జాలక పోయెను. అనంతర మొకింత సేపటి కాతఁడు విధుసేనుం గాంచి "విధుసేనా! ఈవచ్చిన వారందఱకును భోజన వ్యవస్థ జరుగుట కవకాశ మేమున్నది? ఈయడవిలో నెంతధనము వచ్చినను గావలసినపదార్థములుదొరకవే!" అనియెను.

అప్పుడు ధనసఖుఁడు "స్వామీ! అక్షపటలికుఁ డగునివిధుసేనుఁడును, వీరేంద్రసింహుఁడును గూడ నిడివఱకే యన్నియేర్పాటులునుఁ గావించి యున్నారు." అనియెను.

* * * * *

అందఱు భోజనములను నైనపిమ్మట యశోధవళదేవుఁడు విధుసేన సింహదత్త వీరేంద్రసింహ ధనసఖాదిప్రముఖులను దనశయన మందిరమునకుఁ బిలిపించెను. అందఱును వచ్చి యాసీనులైన పిమ్మ

ట వాఁడు వారింగాంచి "సోదరులారా! ఏకపుత్రుఁడగు కీర్తిధవళుని మృత్యువార్త నాలకించిన దినము మొదలుకొని నిన్నటివఱకును నే నొకయున్మత్తునింబోలి కాలము గడపితిని. నిన్న నాకస్మికముగా నా కన్నులు తెఱవఁబడియెను. నేను మేలుకొంటిని. ఈదుర్గపరిసరమునం దలి నాభూములకొఱ కాసించి కులశీలవయోరూప గుణవంతుండగు సుక్షత్రియకుమారుం డెవ్వఁడైన వచ్చి నామనుమరాలిని బెండ్లియా డఁగోరు నను నమ్మకము నాకెంతమాత్రమును లేదు. అట్టివాఁ డీపర్వ తారణ్య ప్రదేశమునుగాని, పేదవాఁడనై యున్న నామనుమరాలిని గాని, కోరి వచ్చుట యసంభవము. కాని నామేనఁ బ్రాణములుండఁగా నాపౌత్రి నొకసామాన్యునిచేతి కొప్పగించుటకు నేనొడంబడఁజాలను. ఏయుపాయముచేనైనను సరియే వంగదేశమునందలి మనసంపత్తిని మనము మరల సంపాదించి తీరవలయును. ఆవిషయమున నేను స్వయ ముగాఁ బాటలీపుత్రమునకుఁ బోయి సార్వభౌముని సందర్శింప నిశ్చ యించియుంటిని. మీరందఱు నేకమైఁ దీనికిఁ దగినసాహాయ్య ప్రయ త్నముఁ గావింపవలయును." అనియెను.

తుదకు విధుసేనుఁడు దుర్గమునందుండి యచ్చటి వ్యవహారము లను జూచుచుండవలయు ననియు, ధనసఖుఁడు కోశాధ్యక్షోద్యోగము ను నిర్వహింపవలయు ననియు, వీరేంద్రసింహుఁడు దుర్గాధిపతితోఁ బాటలీ పుత్రమునకు బయలుదేఱవలయు ననియు నిశ్చయింపఁ బడియెను.

సాయంకాలమునకుఁ బూర్వ మస్తాద్రికిఁ బయనమగుచున్న సూర్యుని యారక్తకిరణములు దుర్గోన్నతభాగమునకు మెఱుఁగువెట్టు చున్న సమయమునఁ బ్రజలందఱును యశోధవళదేవుని యనుమతిం గాంచి తమతమగృహాభిముఖులై వెడలిపోయిరి. అందఱును బోయిన తరువాత రఘువు వానియాను జూచి "ఈరాకాసివటాలమంతయు

నిక్కడకు వచ్చి మనసర్వస్వమును మ్రింగివైచినది. తుద కేమిజరగి నట్లు? ఇన్నిపదార్థములను బంపినవారు కష్టములకోర్చి తాముకూడ నింతదూరము రావలసినపని యేమున్నది? తమతమ నివాసములయందే యుండి వీనినన్నిటిని తమయాశలు తీఱునట్లుగా మ్రింగలేకపోయిరా? పట్టి గడబిడమాత్రము జరిగినది." అనియెను.



## తొమ్మిదవ ప్రకరణము.



వైశాఖమాసము పగలు మొదటిజాము గడచునప్పటికె సూర్యకిరణ ప్రతాపము దుస్సహమగుచుండెను. భాగీరథీ విశాలవక్షోభాగము శుభ్రసికతాతలంబులచేఁ బరిపూర్ణమై యుండెను. అందం దనేకమేఘశకలములు సూర్యకిరణములచేఁ బ్రతిబింబితములగుచుండెను. హిమగిరికన్యయగు నాగంగాదేవి సికతాతలంబున కొకయోరనుండి సాగరాభిముఖంబుగఁ బోవుచుండెను. అందలి ప్రవాహ మతిక్షుద్రమును, జల మతిస్వచ్ఛము నై యుండెను. ఆప్రవాహమున కిరువంకలను దడిసియున్న యిసుకనేల నల్లని రంగుగలిగి తెల్లని వస్త్రముపై నొలికిన మషీరసరేఖంబోలి కన్పట్టుచుండెను.

ఆమిడియెండలోఁగూడ నిరువురు బాలకులును, నొక బాలికయు నదీప్రవాహముపొంతఁ దడిసిన యిసుకనేలపైఁ గూర్చుండి యేమేమియో యాటలాడుకొనుచుండిరి. ఆబాలకులలోఁ బెద్దవాఁడు తనతడిసిన దుస్తులతోడనె జలప్రవాహమునఁ గాలుసేతులు ముంచి కూర్చుండి తీరమునందుఁ దడిసినయిసుకతో నొకభవనమును నిర్మించుచుండెను. రెండవబాలుఁడు గూడ నాతనిచెంతనే కూర్చుండి తాను నొక భవననిర్మాణకృత్యమునందు నిమగ్నుఁడై యుండెను. పెద్దవాఁడు త్వరలోనే

యొకకోట, తటము, బురుజు, కందకము మొదలగువానిని నిర్మించెను. బాలిక యాయిరువురి నడుమను గూరుచుండి వారిపనులను గనుఁగొనుచుండెను. ఆబాలుఁ డీకఁ గోటలోని రాజభవనమును సృష్టించుటయందు విలీనుఁడై తడిసినయిసుకతో భవనశిఖరము నతిత్వరితముగఁ గట్టుచుండెను. ఆతని వ్రేళ్ల సందులనుండి తడియిసుక జాఱి మందిరముపైఁబడి శిఖరము పెద్దదగుచుండుటచేఁ దనంతనే క్రిందఁ బడిపోవుచుండెను. బాలిక యేకాగ్రదృష్టితో నంతయును గాంచుచుండెను. ఒక్కొక్కప్పుడ పెద్దవానిశిఖర మెత్తగుచుండెను. మఱి యొకప్పుడు చిన్నవానిశిఖర మున్నత మగుచుండెను. ఎవ్వనిశిఖర మున్నత మగునో యాతఁ డాబాలికను బిలిచి తనకౌశలమును మహాభిమానముతోడను, మహాకౌతుకముతోడను జెప్పి చూపించుచుండెను.

క్రమముగా సూర్యతాప మధికమగుచుండెను. కాని యీముప్పురిలో నెవ్వరును దానిని లక్ష్యముచేయుట లేదు. వారు మనఃపూర్వకముగాఁ గ్రీడానిమగ్నులై యుండిరి. అప్పుడు జీర్ణములైనమలినవస్త్రములను ధరించియున్న యొకవృద్ధపురుషుఁ డాప్రవాహతీరము ననుసరించి వారియొద్దకే వచ్చుచుండెను. కాని వారాతనివంకఁ జూడనేలేదు. ఆవృద్ధుఁడు వారిని సమీపించినప్పు డాతని నీడం గాంచి బాలిక యులికిపడి లేచి తత్తరముతోఁ బెద్దబాలునికడకుఁ జేరి నిలువఁబడియెను. ఆమె యట్లుతడఁబాటుగఁ బరుగెత్తి వచ్చుటచే భూమియదరి యాబాలునిమందిరమును, గోటయును గూలి నేలఁ బడిపోయెను. రెండవబాలకుఁ డదియంతయుంగాంచి విజయానందభరంబున బిగ్గఱగా నవ్వనారంభించెను.

ఆగంతకుఁ డగువృద్ధుఁడు పెద్దబాలునిఁ గాంచి "కుమారా! ఇంతమాత్రమున నిరాశుఁడవు కావలదు. ఈజీవితమున నీవు హతాశఁ జెందుట కవకాశమే లేదు. దారుణమగు కాలవజ్రాఘాతముచే గగన

చుంబితము లగు నా శాపేప్రిమామందిరము లెన్నెన్నియో చూర్ణ విచూర్ణము లై పోవుచుండును !" అనియెను.

ఆముప్పురునుగూడ నతివిస్మితులై యావృద్ధుని మొగమువంకఁ జూచుచుండిరి. ఆముదుసలి తనచినిఁగినగుడ్డ నాయిసుక నేలను బఱచుకొని కూరుచుండెను. కొంతసేపటి కా పెద్దబాలకుఁడు "మీరు నన్నెట్లు గుర్తించితిరి ?" అనిఁ ప్రశ్నించెను.

వృద్ధుఁడు మందహాసము చేయుచు "శశాంకకుమారా ! నిన్నెవ్వరు గుర్తింపలేకుందురు ? నీయీపింగళకేశకలాపమే నీమోహనమూర్తిని బ్రకటించుచుండును. ఉత్తరప్రదేశమందలిప్రజలు దీనినిబట్టియే నిన్నానవాలు పట్టఁగలరు రణాంగణమున శత్రువీరులుకూడ దీనిని బట్టియే నిన్ను గుర్తింతురు. నిన్ను గుర్తించుట యంతకష్టమా? " అనియెను.

ఇట్లుచెప్పి యావృద్ధుఁ డొకయున్మత్తునివలె నవ్వ నారంభించెను. అది గని యాబాలకు లత్యాశ్చర్యచకితులైరి. బాలిక యాబాలకుని గట్టిగఁ గౌఁగిలించుకొనియెను. వృద్ధుఁడు చటాలున లేచి తనవస్త్రమునుండి యొకమురళిని బైకిఁ దీసెను. అంతలోనే యాతని కేమితోఁచెనో గాని తీసినమురళిని మరల నట్లే దాఁచెను. అనంతర మాతఁడు " కుమారా ! నీతో నెన్నియోవిషయములనుగూర్చి మాటాడవలయునని యిక్కడకు వచ్చి యుంటిని. కాని యిక్కడ మాటాడుట కవకాశము లేదు. నాతోఁగూడ రమ్ము! " అనియెను.

మంత్రౌషధమహిమచే ముగ్ధులైనవారుంబోలి యాముప్పురు నాతనివెంట బయలుదేఱిరి. నిప్పులగుండమువలె మండిపోవుచున్న యాయిసుకనేల యంతయును దాటిపోయి పురాతనరాజభవనప్రాంతమున నున్నఘట్టముకడ విఱిగిపోయిన మెట్లమీఁద నావృద్ధుఁడు కూరుచుండెను. ఆబాలకులును బాలికయును క్రిందిమెట్లపై నాసీనులైరి.

అప్పుడు వృద్ధుఁడు తనమురళిని మరల బైకిఁ దీసి హాయిగ మోయింప నారంభించెను. ఆవైశాఖమాసమునఁ బ్రచండకరకిరణప్రతప్తం బగు మధ్యాహ్నకాలమునఁ గరుణారసపూరితంబగు నామురళీమధురస్వరము వెలువడి శాంతభాగీరథీప్రవాహము నుత్తరించియవ్వలతీరమును బ్రకంపితముగఁ జేసివైచుచుండెను. ఆవేణుగానశ్రవణంబున సూర్యతాపజ్వలితం బగునాసైకతప్రదేశముగూడ నించుక శీతలమై యుండవచ్చును. బాలికాబాలకులుముప్వురు నావేణుగానానందపరవశులై కరుణరసామృతపానోన్మత్తులై చిత్రప్రతిమలవలెఁ గూర్చుండి యుండిరి. అంతలో నాకస్మికముగా వేణుగానమాఁగిపోయెను. తత్క్షణమే జగచ్ఛాంతికి భంగము కలిగెనేమోయని యెల్లరకును బొడకట్టెను.

అప్పుడు వృద్ధుఁడు లేచి నిలువఁబడి “కుమారా! మూఁడువందల సంవత్సరములకుఁ బూర్వమున మీగుప్తవంశమునందు నీవలెనే పింగళకేశకలాపుఁ డగునొకరాజపుత్త్రుఁ డుదయించి యుండెను. నీకువలె నాతనికినిగూడఁ బుట్టినప్పటినుండియు దౌర్భాగ్యము వెంటనంటి యుండెను. ఆతఁడును నీవలెనే యుదారహృదయుఁడు; దయాశీలుఁడు; మహావీర్యసంపన్నుఁడు; గుప్తవంశలుప్తగౌరవమును బునరుద్ధారణము గావించుటకై నీవలెనే యాతఁడును తనప్రాణమనోధనంబుల నర్పించుటకు సంసిద్ధుఁడై యుండెను. ఆతనిపేరు స్కందగుప్తుఁడు. ఉత్తరప్రదేశములలో నాతనిపేరుకూడ నిప్పుడు చాలమందికి విస్మృతమైపోయెను. ఇందాశ్చర్యమునకుఁ గారణములేదు. పాటలీపుత్రనాగరికులు కేవలమును గృతఘ్నులు! అందుచేతనే వారాతనినామమును విస్మరించి యున్నారు. కాని యొకప్పు డీస్కందగుప్తుఁడే పాటలీపుత్రమునకుఁ దనసర్వస్వమును ధారవోసి సకలకష్టములకును బాల్పడిపోయెను. కుమారశశాంకా! సముద్రగుప్తుఁడనునామమును నీవు విని యుంటివా? చతుస్సముద్రముద్రితం బగునీభూవలయమునంతను బరిపాలించిన యాతని దిగ్విజయచరిత్రమును నీవాకర్ణించితివా?

కుమారగుప్తుని భవ్యచరిత్ర మెన్నఁడైన నీశ్రవణపుటంబున కమృత రసాయనమైనదా? ఆకుమారగుప్తునితనయుఁడే స్కందగుప్తుఁడు. నీ జనకుని యీయల్పరాజ్యమునందుఁ బ్రజలెల్లరును బింగళకేశదామముం బట్టి యువరాజవగు నిన్ను ననువాలుపట్టినట్లే యాతనిపింగళకేశకలాపముంగాంచి యీసముద్రమునుండి యాసముద్రమువఱకును, హిమాచలమునుండి కన్యాకుమారివఱకును గల ప్రజలెల్లరును యువరాజకుమారుఁడగు స్కందగుప్తు ననువాలుపట్టుచుండిరి. కష్టములును విపత్తులును నొకదానినొకటిమించి యిప్పుడు నిన్నుఁ బరివేష్టింపఁ జూచుచున్నట్లే యప్పుడు స్కందగుప్తునిచుట్టును నింతకంటె బలవంతముగా దురవస్థాపరంపర లాక్రమించి యుండెను. వానిని దొలఁగించుటకై యాతఁ డెన్నియోప్రయత్నములం గావించెను. నీవుకూడ నొకప్పు డట్లే ప్రయత్నింపఁగలవు. దురదృష్టదేవత సర్వదా యాతని వెనువెంటనే తిరుగాడుచుండెను. ఆసంగతి నాతఁ డెఱుఁగనే యెఱుఁగఁడు. ఆతనిసోదరుఁడును, సేవకుఁడును జ్ఞాతులునుగూడ నాతని యెడల విశ్వాసఘాతుకులై పోయిరి. ఆవిశ్వాసహీనులమూలముననే యాతనిజీవితమునకు శాంతి లేకుండఁబోయినది. నీకుఁగూడ నట్లే కాఁగలదు. స్కందగుప్తునిదీర్ఘాయుష్కాలమంతయును యుద్ధవ్యవసాయమునందే వ్యయమైపోయెను. ఆతని యాశలన్నియును వినష్టములైపోవుటచే నాతఁడు భగ్నహృదయుఁడై యనవరతమును యుద్ధయాత్రలలోనే కాలక్షేపము చేయసాగెను. కుమారా! నీవు రాజవగుదువు. కాని నీమార్గ మెప్పుడును గంటకమయమే యైయుండును. నీ వెన్నటికిని సుఖజీవివి కాఁజాలవు. నీసోదరుఁడు, నిన్నుఁ బ్రేమించితి నని వాగ్దత్తము చేసిన నీపత్ని, అమాత్యులు, ప్రజలు, వీరందఱును నిన్నుఁ ద్వేషింతురు. అందఱకును దూరమై నీవును స్కందగుప్తునివలెనే రణాంగణమున వీరమరణముంగాంచఁగలవు. కాని, నీస్వదేశమున మర

ంచవు. నీకుఁ బరదేశమునందే మరణము సంభవింపఁగలదు. స్కంద గుప్తుఁడు స్వదేశమునందే పరదేశీయులతోఁ బోరుచు నాహవభూమి యందుఁ దనదేహమును విసర్జించెను. కాని నీకుఁ బరదేశమున స్వదేశీయులతో మహారణము సంభవించుటయు నాసమరరంగమునందే మరణము కలుగుటయు జరగును. కుమారా! శశాంకా! నీవెంతమాత్రము విచారింపవలదు. నీవు సింహరాశియందు జన్మించితివి. కావున నీవు సింహవరాక్రమవంతుఁడ వగుదువు. దైవము నెదుటఁగూడ నీవు తలవంపవలదు. బ్రిదికియున్నంతవఱకు నదృష్టముతో జరుగఁగల సంగ్రామమునకై నీవు సిద్ధపడి యుండుము. ఈముసలివాని మాటలను విని యాఁడుదానివలె భీతిల్లకుము. పురుషయోగ్యంబులగు కార్యములను, నిర్వహించుటకై ముందంజవేయుము! పత్నీలాభముగాని, పుత్రలాభముగాని, నీకెన్నటికిని నొదవఁబోదు. కారణ మేమని ప్రశ్నింపవలదు. నీనల్లనితమ్ముని నెన్నఁడును విశ్వసింపకుము! వీఁపున సుడి గలిగి గౌరవర్ణుఁడై యున్న కామరూపరాజపుత్రునిఁగూడ నీవెన్నఁడును నమ్మియుండకుము. అట్లుంచితి వేని — అదృష్టచక్రమధ్యమునుండి నీవెన్నటికిని విముక్తుఁడవు కాఁజాలవు — కాని యిదియంతయును నీకుఁ దోఁచుట యసంభవము. ఈజగంబున నెల్లరకు నసాధ్యమగుకార్యము నీకుఁ గూడ నసాధ్యమే యగును. నీయనుజుఁడు నీసింహాసనము నాక్రమించును: నీబాల్యసఖి నిన్నుఁ బెండ్లియాడుటకు నిశ్చయించుకొని యున్నను మోహమాయలకుప్పొంగి యన్యునకుఁ దనతనువును విక్రయింపఁగలదు. సామాన్యలాభలోభమునకుఁ లోఁబడి విశ్వాసులగు నీసేవకులే నీయెడ నక్రమప్రవర్తకు లయ్యెదరు. స్వదేశీయులే నిన్ను నీదేశమునుండి పాఱఁద్రోలెదరు. పరదేశీయులు పరదేశమున నిన్ను మహాప్రీతితో నాదరింతురు. దుష్టగ్రహాచారవశంబునఁ జిక్కియున్న నీవు నీయుపకారులనుగూడ గుర్తింపఁజాలవు. అట్టివారినే నీవు

ప్రేమింతువు. నీకుపకారు లగువారిని నీవుపేక్షింతువు; బాధింతువు—అయినను వారు జన్మాంతరమునందుఁగూడ నిన్ను విడువక నీవెంటనంటియే యుందురు." అని బోధించెను.

విలక్షణచరిత్రుఁ డగునావృద్ధునిమాటల నాలకించి యాబాలిక యతిభయభ్రాంత యయ్యెను. ద్వితీయబాలకుఁడు భయపరికంపితుఁ డయ్యెను. ఆతనినోటఁ దడియారిపోయెను. కాని శశాంకుఁడుమాత్ర మించుకంతయును భయపడలేదు. ఆతఁడు వృద్ధునిం గాంచి "మీ మాటలలో నొక్కటియును నాకు బోధపడలేదు. మీ రెవ్వరు ?" అనియెను.

ఆప్రశ్నవిని వృద్ధుఁడు దెసలు మాఱుమ్రోగునట్లుగా నవ్వుట కారంభించెను. మఱియును వెఱ్ఱివానివలె నృత్యము చేయసాగెను. అది చూచి యాబాలిక ముక్తకంఠయై విలపింప నారంభించెను. మాధవుఁడుకూడ నేడువఁదొడంగెను. ఇప్పుడుమాత్రము శశాంకుఁడించుక సంకోచముతో రెండడుగులు వెనుకకు వైచెను.

వృద్ధుఁ డట్లే నవ్వుచు "నేనెవ్వఁడనా? ఎవ్వఁడనో లల్లా నడుగుము! వృద్ధయశోధవలు నడిగి తెలిసికొనుము! నీతండ్రినిగూడఁ బ్రశ్నించిచూడుము! శత్రుసేనుఁ డిట్లనెనని చెప్పుము! నేనిప్పు డాడిన మాటలు నీకెట్లు తెలియును? అట్లే తెలిసినచో నీవదృష్టమునుగూడ నేమఱించుటకుఁ బ్రయత్నము చేయఁగలవు. నామాటలయర్థము నీ కెప్పటికి బోధపడునో యాసమయమునకు నేను మరల నీయొద్దకు వత్తును" అని చెప్పి వృద్ధుఁడు మరల నృత్యము చేయఁదొడంగెను. కొంత సేపటి కాతఁడు తనవస్త్రములో దాఁచి తెచ్చిన తేజోమయం బగు తీవ్రశస్త్రమును బయటికిఁ దీసెను. దానిం గాంచి శశాంకుఁ డింకను రెండడుగులు వెనుకకు వైచెను.

అప్పుడు వృద్ధుఁడు వికృతస్వరముతో "శశాంకా! నీవు నాకు శత్రుఁడవు. నాధర్మమునకు శత్రుఁడవు. నిహృత్పిండమును ఛేదించి నీయురమునందలి వెచ్చనిశోణితమును బానముచేయవలయునని నాకో క్కటే యిచ్ఛయున్నది. కానియశ్లీల చేయఁజాలక పోవుచుంటినో నీకుఁ దెలియునా? ఏభాగ్యచక్రమునసనుసరించి నీవు తిరుగుచున్నావో దానికే నేనును గట్టువడి యున్నాను." అనియెను.

ఇంతలో నొకపడవ వచ్చి యాఘట్టమున కెదురుగా దూరము నందు నదీసైకతస్థలమునంటి నిలిచెను. ఆనౌకనుండి యిరువురువృద్ధులును నొకబాలికయును గ్రిందికి దిగిరి. శశాంకునకుఁగాని ద్వితీయబాలకున కుఁగాని వారగపడుటలేదు. వృద్ధునకుమాత్రమే యగపడుచుండిరి. క్రమముగా వారాసమీపమునకే వచ్చుచుండుటం గాంచి యావృద్ధుఁ డు "కుమారా! నేనిప్పుడు పాఱిపోవలసియున్నది. ఇఁక నాకిక్కడ నిలుచుట కవకాశము లేదు. చాలమంది ప్రజలిక్కడకే వచ్చుచున్నా రు. శశాంకా! మున్ముం దొకప్పుడు నీవు దారుణమర్మాంతికయాతన లచేఁ బరితపించుచుందువు. అప్పుడు నీకుఁ బునర్దర్శన మగుఁగాక!" అని చెప్పి యావృద్ధుఁ డప్పుడు రావికొమ్మనొకదానిని బెళుక్కున విఱి చి దానిపై గుఱ్ఱపుమూఁపునంబోలి కూర్చుండి యంతలో నామువ్వురిక న్నులకును గానరాకుండఁబోయెను. చిత్రాశశాంకమాధవగుప్తులా శ్చర్యభయస్తంభితులై కొయ్యబొమ్మలవలె నచ్చటనే నిలువఁబడి పోయిరి.

నౌకనుండి దిగినవారు క్రమముగా ఘట్టము కడకు వచ్చిరి. వారిలో వృద్ధుఁడు తరుణునిం గాంచి "ఇదియే రాచవాడకుఁ బోవుఘ ట్టమని తోఁచుచున్నది. ఈయిరువదియేండ్లనుండియు నేను పాటలీపు త్రమునకు వచ్చియుండలేదు. వీరెందాక! ఇచ్చట నెవ్వరైన నున్న చోఁ జూచి వారిని దోవ యడిగి తెలిసికొనిరమ్ము" అనియెను.

వీరేంద్రుఁడు నలుదెసలఁ బరికించి "ప్రభూ! ఘట్టముకడ నెవ్వరును గనఁబడుటయే లేదు" అనియెను. వృద్ధుఁడు తనక్షీణదృష్టితోఁ బైకిఁ దిలకించి "వీరేంద్రా! పైమెట్టుపై నెవ్వరో నిలిచి యున్నట్లున్నది? నీకుఁ గనఁబడ లేదా?" అనియెను.

వీరేంద్రుఁడు పైకి వచ్చి యాబాలికాబాలకులం గాంచి "ఇదియేనా రాజగృహాఘట్టము?" అని ప్రశ్నించెను. ఉన్మత్తుఁడగువృద్ధుఁడు వెడలిపోయినవంకనే చూచుచు శశాంకుఁ డనన్యమనస్కుఁడై నిలిచియుండెను. వీరేంద్రునిప్రశ్న విని యాతఁడు తనదృష్టిని మరలించెనుగాని యాప్రశ్న సరిగా శశాంకునకు వినఁబడ లేదు. అందుచేత నాతఁడు "ఏమంటిరి?" అని ప్రశ్నించెను.

వీరేంద్రుఁ డించుకవిసుఁగుతో "నీకుఁ జెవుడా యేమి? రాజగృహాఘట్ట మిదియే యని యడిగితిని!" అని ప్రశ్నించెను. కాని శశాంకుఁడు ప్రత్యుత్తర మీయకయే "మీరెవ్వరు? ఎటనుండి వచ్చితిరి?" అని యడిగెను.

వీరే—(కోపముతో) అబ్బాయీ! నీప్రశ్నలకుత్తరము లిచ్చుచుండుటకు నాకవకాశము లేదు. రాజభవనమునకుఁ బోవుఘట్టమేదో తెలిపినఁ జాలును!

శశాం—ఇదియే రాచవాడఘట్టము. కాని సామాన్యజనులీతోవను బోరాదు.

వీరేం—సరే. పోవుటనుగూర్చిగాని, పోకుండుటనుగూర్చిగాని నిన్నేమైన నడిగితినా?

అని వీరేంద్రుఁ డావృద్ధునియొద్దకుఁ బోయి "ప్రభూ! ఇదియే రాజగృహాఘట్టమఁట. పైమెట్టుపైఁ గొందఱుపిల్లలున్నారు. వారిలో నొకఁడు కేవలరాజపుత్రునివలె మాటాడుచున్నాఁడు. సామాన్యజనులీతోవను బోరాదఁట!" అని చెప్పెను.

యశోధవళుఁడు నవ్వుచు "వీరేంద్రా! ఆబాలకుఁడు నీతో నిజమే చెప్పెను" అనియెను.

వీరేం—అట్లయినచో మనము మననౌకతో వెనుకకుఁ దిరుగ వలసినదేనా ?

యశో—అక్కఱలేదు. నేనీమార్గముననే పోవచ్చును. విశిష్టామాత్యులకును, రాజవంశీయులకును దక్క నన్యుల కీగంగామార్గమునఁ లోనికిఁ బోవునవకాశము లేదు. ఏమనిన—నగరవాసినులగునంతఃపురస్త్రీలీత్రోవనే గంగాస్నానమునకై వత్తురు. ఆబాలకుఁడీకారణముచేతనే నీతో నట్లు చెప్పియుండు నని తోఁచుచున్నది. నడువుము! ముందు నడువుము! నన్నెవ్వరు నడ్డగింపఁజాలరు.

అందఱును సోపానారోహణమొనర్చి ఘట్టములపైకి వచ్చిచేరిరి. ఒకబాలకుఁడు తమ్మడ్డగించుటకై మార్గమధ్యమున నిలిచియున్నట్లును రెండవబాలుఁడును, బాలికయు నచ్చటఁ గూర్చుండి యున్నట్లును యశోధవళుఁడు కనుఁగొనియెను.

బాల—మీరెవ్వరు?

యశో—నేను రోహితాశ్వదుర్గాధీశ్వరుఁడను. నాపేరు యశోధవళుఁడు.

బాల—మీరెక్కడకుఁ బోవుచున్నారు?

యశో—చక్రవర్తిని సందర్శించుటకై రాచవాడకుఁ బోఁదలఁచితిమి.

బాల—ఈమార్గమున సామాన్యజనులు పోఁ గూడదని మీకుఁ దెలియదా? మీరు తిరిగి దక్షిణతోరణముకడకుఁ బొండు! ఆత్రోవను రాచవాడకుఁ బోవచ్చును.

యశో—మేమీత్రోవనే పోఁ దలఁచినచో నీవు మమ్మడ్డగించెదవా యేమి?

శశాం——(నవ్వి) లేకున్నను మీరెంతవఱకుఁ బోఁగలరు? గంగాద్వారముకడ నున్న ద్వారపాలకులు మిమ్ము వెనుకకు మరలించు వఱకు నూరకుండరు. అప్పుడు మీరు మరల నీమార్గముననే వెనుకకు వచ్చి నౌకపై నెక్కి తిరిగిపోవలయును. ఇక్కడనుండి నగరమునకుఁ బోవుటకు నదీమార్గముకంటె వేఱొకత్రోవ యేదియును లేదు.

యశో——బాలకా! నేనీమగధరాజ్యమునందు సామాన్య మానవుఁడనుగాను. సైన్యమునందు నాకు మహానాయకబిరుద మున్నది. రాజకీయసమావేశమునందు నేను యువరాజభట్టారకపాదీయుఁడను. ఒక్కయంతఃపురమునకుఁదక్క రాజభవనమునందు మఱియెచ్చటికిఁ బోవుటకును నా కాతంకము లేదు.

శశాంకుఁ డాశ్చర్యముతో "మీరు——మీరు——మహానాయకులా?——యువరాజభట్టారకపాదీయులా?——" అనియెను.

యశో——(నవ్వుచు) బాలకా! నీకిందాశ్చర్యపడుట కేమున్నది?

శశాం——నేను పుట్టినది మొదలిప్పటివఱకును నే మహానాయకుఁడుగాని, యే యువరాజభట్టారకపాదీయుఁడుగాని యీవిధముగా రాజగృహమునకు వచ్చుటను జూచియుండలేదు. అట్టివారు రాజభవనమునకు వచ్చునప్పు డెందఱో పదాతిసైనికులును, నశ్వారోహకులును వారిననుసరించి యుందురు. వారికి మార్గమును వదలి నాగరికు లిటునటు పాఱిపోవుచుందురు. ఈసామ్రాజ్యమునం దేయువరాజభట్టారకపాదీయుఁడైనను పాదచారియై తిరుగుచుండఁగా నేనెన్నఁడును జూచియుండలేదు.

యశో——అబ్బాయీ: నీవెవ్వరు?

శశాం——నేను సార్వభౌముని జ్యేష్ఠపుత్రుఁడను. నా పేరు శశాంకుఁడు.

ఆమాట విన్నంతనే వృద్ధుఁడు తనకరవాలమును బైకిఁ దీసి దానియగ్రభాగముచేఁ దనపలితకేశములను స్పృశించెను. అదియే యాకాలమున వీరులయభివాదనపద్ధతి. యశోధవళుఁ డట్లభివాదనముం గావించి "యువరాజా! నేనీపాటలీపుత్రమునకు వచ్చి చాలకాలమైనది. అందుచేతనే నేను మిమ్ముఁ దెలిసికొనఁజాలనైతిని. నాయీయపరాధమును సైరింపుఁడు. నేను పూర్వము రాజసభలకు వచ్చుకాలమున మీరు పుట్టియుండలేదు. అప్పటికి మీపినతండ్రి యగుదేవగుప్తునే సామ్రాజ్యమునకు భవిష్యదధికారిగా భావించుచుంటిమి. యువరాజా! సామ్రాజ్యమునందలి యితరమహానాయకులకుఁ గల వైభవవిశేషములు నాకడ లేవు. కావున నేనిప్పుడు సార్వభౌమసందర్శనమునకీవిధముగఁ బోవుచున్నాను" అనియెను.

శశాంకుఁడు మౌనముతో యశోధవళుని స్థూలోన్నతశరీరమును, నందలి యసంఖ్యశస్త్రఘాతచిహ్నములను లక్ష్యపూర్వకముగఁ బరిశీలించుచుండెను. యశోధవళునివాక్యములు పూర్తియైనపిమ్మట యువరాజాదరసంసూచకస్వరముతో "రండు! మీరు నాతోఁ గలసి రాజభవనమునకు రండు!" అనియెను.

---

## పదియవప్రకరణము.



మనకథాకాలమునాఁటికిఁ బాటలీపుత్రబహిర్భాగమునం దనేకవృజలు నివసించుచుండిరి. పురాతననగరమునకుఁ జుట్టును విశాలతటం బుండుటచేతను లోపలిప్రదేశము సంకుచితమైయుండుటచేతను గ్రొత్తగనివసించువారి కొక్కయడుగునేలయైనను లేకుండఁబోయెను. అందుచే నగరమునందలి పేదవారనేకు లాతటమున కవ్వలివైపుననే చాలవఱకు నివసించుచుండిరి. అనేకసంవత్సరములక్రిందటనే గర

పూర్వదక్షిణసీమలఁ గొన్ని చిన్న గ్రామములు నిర్మింపఁబడియెను. పాటలీపుత్రపౌరు లీజనపదములకు "ఉపనగర"మని పేరిడిరి. నగరమున కుత్తరపశ్చిమదిశల భాగీరథీశోణనదులు ప్రవహించుచుండెను. కాని నగరమున కావలితీరముననైత మనేకపౌరులు నివసించుచుండిరి. ఉదయముననే లేచి తమతమయుదరపోషణములకై వలయు కార్యములను గావించుకొనుట కాజనపదములవా రానగరమునకు వచ్చి సాయంకాలమునఁ దమతమస్థానములకుఁ బోవుచుండురు.

నగరమునకు దక్షిణభాగమునం దున్న యుపనగరమునందలి యొక ప్రాచీనజీర్ణమందిరపురోభాగమునఁ గొందఱు బౌద్ధభిక్షుకులు పొలములోని పచ్చికపైఁ గూర్చుండి సంభాషించుకొనుచుండిరి. ఆ మందిరమునకు వెలుపలిభాగమంతయు లతాతరుపరిపూరితమై యరణ్యమువలె నైపోయెను గాని యందం దున్నతములగు శిలాస్తంభములు మాత్ర మొకటిరెండు కానవచ్చుచుండెను. అతిప్రాచీనకాలమునం దీ ప్రదేశమునఁ బాషాణనిర్మితమగు బౌద్ధమందిరముండెను. కాలక్రమమున నది శిథిలమై పోవుటయు భిక్షుకులు దాని యెదుటనే యొక చిన్న మందిరమును నిర్మించి మూర్తిస్థాపనముం గావించిరి. ఆ పొలమునఁ గూర్చుండియున్న భిక్షుకులందఱును దరుణవయస్కులే యగుటచే వారు కొలఁదికాలము క్రిందటనే గృహస్థాశ్రమమును త్యజించియుందురని తోఁచుచుండెను. సర్వసంగపరిత్యాగులగు భిక్షుకుల కుచితంబైన గంభీరభావ మింకను వారికిఁ బట్టువడలేదు.

ఆ తరుణభిక్షుకులనడుమ నొక ప్రౌఢభిక్షుకుఁ డాసీనుఁడైయుండెను. వయసునఁ గొంత యాధిక్యమున్నను నాతఁ డితరభిక్షుకులతో పరిహాసము లాడుటయందే నిమగ్నుఁడై యుండెను. వీరల కనతిదూరమునం దొక తరుణభిక్షుకుఁడు కూర్చుండియుండెను. ఆతఁ డేదియో దీర్ఘముగ నాలోచించుచున్న ట్లగపడుచుండెను; తోడి భిక్షువులహాస

ప్రచండధ్వను లాతని వీనులవఱకును జేరుటయే లేదు కాఁబోలును! ఆతనింగాంచి యాభిక్షుకు లప్పుడప్పుడు తమలో నేమేమియో యనుకొనుచుండిరి; ఆతని నువహసించుచుండిరి; అంతలోనే హాసధ్వనులచే నాకాశమండలమును బరిపూరితముగఁ జేయుచుండిరి. కాని యెవ్వనిం గూర్చి యీహాసోపహాసబాణవర్షము గురియుచుండెనో యాతని కీప్రచండహాసబాణవర్షధ్వని వినఁబడుటయే లేదు.

ఆభిక్షుకమండలి యిట్టికార్యక్రమమున నిమగ్నమై యుండఁగా నింతలో నొకతరుణి యామందిరముకడకు వచ్చెను. ఆయువతిం గాంచి నంతనే వారిహాసధ్వని మందమయ్యెను. అప్పుడొకఁడాప్రౌఢభిక్షుని యొడలిపై మెల్లఁగ గోకుచు "ఆచార్యా! ఆమె మీకొఱకే వెదకుచున్నదని తోఁచుచున్నది." అనియెను.

ద్వితీ—(నవ్వుచు) ఓరీ! నీకు మతిపోయినదా యేమి? ఆచార్యులవారు వృద్ధులు. యౌవనస్త్రీలు స్వయముగా నొకవృద్ధపురుషుని వెదకికొనుచు వచ్చుట యెన్నఁడైన సంభవించునా?

ప్రథమభిక్షుకుని పలుకులు విని వృద్ధున కానందము కలిగెను. ఆతనిమోమున హాసరేఖ యుదయించెను. కాని యింతలో ద్వితీయుని మాటవలన నాస్మితరేఖ మాయమైపోయెను. అప్పుడాతఁడు కోపావేశముచే మండిపడుచు " ఓరీ! నీవు నన్ను వృద్ధుఁ డనుచున్నావా? అయినను నొకయువతిసమక్షమున నీవట్లనవచ్చునా ? చూచుకొనుము! ఇక్కడనే నిన్నుఁ జంపివైతును!" అనియెను.

ఈగర్జనము నాకర్ణించి ప్రథమభిక్షువు నవ్వుచు " ఆచార్యా! మాయీయల్పాపరాధమును క్షమింపుము. అయిననేమి? ఆనాఁడు సంఘస్థవిరుఁడనలేదా? ఆచార్యదేశానందుఁ డిప్పుడు వృద్ధుఁ డయ్యెను. తరుణభిక్షువులకు శిక్షణమొసంగుట కిట్టి వృద్ధులేగాదా యుపయోగింతురు! వృద్ధుఁడు—"

అనుచుండఁగనే వృద్ధుఁడు క్రోధతీవ్రస్వరముతో " పితండ్రి వృద్ధుఁడు - నీతాతవృద్ధుఁడు-వీఁడొక పిచ్చివాఁడు. చేతికిఁ దొరకెనని నీకుఁ దోఁచుచున్నది. కాఁబోలును. జాగ్రత్త! మిమ్ముందఱ నొక్కు-మ్మడి నిక్కడనే నఱకివైచెదను" అని పలుకుచు వారుణోన్మాదగ్రస్తునివలె నావృద్ధబౌద్ధసన్యాసి లేచి వారిపై దుముకఁబోయెను. అందఱును గలసి యాతనిం బట్టుకొని క్రిందఁ గూర్చుండఁబెట్టఁ బ్రయత్నించిరి. కాని యెంతకు నాతఁడు కూర్చుండఁడయ్యెను. కోపముచేఁ దలదిరిగి పోవుచుండుటచే నాతఁడు మరలమరల లేవఁ బ్రయత్నించుచుండెను. ఎట్టకేలకు మహాప్రయాసపడి వారాతని నెట్లో శాంతింపఁజేసిరి. అనంతర మాతరుణభిక్షువులందఱును గలసి యంజలిబద్ధులై మేమే వృద్ధుల మనియు, నాచార్యకేశానందులగుమీరే తరుణవయస్కులనియు నధ్యయనాధ్యాపనాదిప్రయాసముచే మీకేశము లించుక పలితము లయ్యెను గాని యంతకంటె వేఱేమియుఁ గాదనియు నొప్పుకొని లెంపలు వాయించుకొని తమయపరాధమును బరిమార్జితముగఁ జేసికొనిరి.

ఏయువతిమూలమున మనభిక్షులలో నియకొరణకలహము కలిగినదో యారమణీమణి నిశ్చయముగ నధికరూపవతి యైయుండెను. ధరించిన వసనభూషణాదులంబట్టి యాతరుణియొక యున్నతవంశసంజాత యనియుఁ గాదేనొక ధనాఢ్యుఁడగు నాగరికునియింటి దాసియైయుండు ననియుఁ జూచినవారికిఁ దోఁచుచుండెను. భిక్షుమండలమున జరగుచున్న గందరగోళము నంతయుం గాంచుచు నామె దవ్వుననే నిలిచియుండెను. అనంతర మొకింతతడవునకు వారిలో శాంతి నెలకొనుటయు నామె యేమియో ప్రశ్నించుదానివలె వారిచెంతకు వచ్చెను. ఇంతలో నాచార్యుఁడే యామె నడ్డగించి "నీవు నన్నేగదా వెదకికొనుచువచ్చితివి ?" అని ప్రశ్నించెను.

యువతి మందహాసము చేయుచు "కాదయ్యా! కాదు భిక్షుజినానందులిచ్చటనే యుందురా?" అనియెను.

ఆమె ప్రత్యుత్తరము నాలకించి యాచార్యుని నడుము విఱిగినట్లయ్యెను. అతఁడు హతాశుఁడై పోయెను. ఆమె సరళ మృదుస్వరముతో "భిక్షుజినానందు లిచ్చట నున్నారా?" అని యడిగెను.

ఆచార్యుఁ డేమియును బ్రత్యుత్తరము చెప్పలేదు. అప్పుడు సమీపమునందున్న భిక్షుఁడు "ఉన్నారు!" అనియెను. ఆమాట విని యాయువతి యానందించిన ట్లగపడియెను. అప్పుడామె యుత్కంఠతో "స్వామీ! వారి నొకసారి యిటకుఁ బిలిచెదరా?" అనియెను.

భిక్షు—ఎందుకు?

యువ—(యించుక సంకోచించి) వారితో నాక త్యావశ్యక మగు పని యున్నది.

భిక్షు—ఆపని యేమో నాకుఁ దెలుపవచ్చునా?

యువ—ఆసంగతి మీకుఁ జెప్పఁజాలను. ఆవార్త యెవ్వరితోడను జెప్పఁగూడదని మాయజమానుని యాజ్ఞ యైనది.

భిక్షు—ఏతరుణియైనను వచ్చి యేకాంతముగ నేభిక్షునితోనైనను మాటాడఁగూడ దని మాసంఘారామము (బౌద్ధమఠము)న నొక నియమ మున్నది.

ఆరమణి యించుక సేపాలోచించి "అట్టి నియమ ముండవచ్చును. కాని నేనాయనతో రహస్యముగ మాటాడవలయునని వచ్చియుండలేదు" అనియెను.

భిక్షు—అట్లయినచో రహస్యముగఁ దెలుపవలసిన విషయమునుగూర్చి బహిరంగముగా నీవాతని నెట్లు మాటాడఁగలవు?

యువ—నాయొద్ద నొకయుత్తర మున్నది. దానిని—

భిక్షు—దానిని నాకిమ్ము. నేనాతని కందించెదను.

యువ—(కొంచెము వెనుకకు జరగి) స్వామీ! క్షమింపుఁడు! జినానందభిక్షువునకుఁ దక్క నితరుల కెవ్వరికి నీయుత్తరము నీయవలదని నాయజమానుఁ డాజ్ఞాపించియున్నాఁడు.

భిక్షు—(చిఱునవ్వుతో) ఈసంఘారామమునందలిభిక్షువు లందఱిలోనను జినానందుని నీవెట్లు గుర్తింపఁగలవు!

యువ—ఆయన వచ్చినచో నేను బాగుగ నానవాలుపట్టఁగలను. నాయొద్ద నొకసాంకేతికచిహ్న మున్నది.

ఇంతలో నాయిరువురి వెనుక నున్న యొకభిక్షుఁ డుచ్చైస్స్వరముతో "జినానందా! జినానందా! నీకేమియును వినఁబడుట లేదా? జినానందా! ఏమిది? నీవు సమాధి యైపోలేదుగద!" అని యఱచెను.

అందఱకును వేఱుగా దూరమునఁగూర్చుండి యున్న భిక్షుఁ డేకాగ్రచిత్తముతో నేమియో యాలోచించుచుండెను. అతఁ డిప్పుడా క్రోశించుక తలను పైకెత్తి చూచెను. రెండవ భిక్షుఁ డాతనిం గాంచి "ఈ యువతి యెవ్వరో నీతో మాటలాడఁ గోరుచున్నది. నీవీమాట లేమియు నాలకించుట లేదు కాఁబోలును! ఈమెమూలమున నిప్పు డిచ్చట నెంతయో గడబిడ జరగినది!" అనియెను.

జినానందుఁ డేమియును మాఱుమాట చెప్పలేదు, ఆయువతిం గాంచినంతనే యాతఁడు చటాలున లేచి యామెచెంతకుఁ బోయి యత్యాదరముతో "నీవిక్కడ కెప్పుడు వచ్చితివి? విశేషము లేమి? చెప్పుము!" అని యడిగెను.

ఆయువతి యించుక సేపటివఱకు ననిమిషనయనములతో జినానందుని మొగముపంకఁ దిలకించుచుఁ బిమ్మట నాతనికి వందనము చేసి "మహారాజా! ఈక్రొత్తవేషముతో నున్న మిమ్ములను నేనెంతమాత్రమును గుర్తింపఁజాలనైతిని. విశేషము లున్నవి—కాని—ఇచ్చట నున్న భిక్షులందఱును మహాక్రూరులు. దయయుంచి మీ రించుక యావలి

కి రావలయును" అని చెప్పి యామె యామందిరబహిర్భాగమునందలి వృక్షాంతరాళమునఁ బ్రవేశించెను. ఆభిక్షుఁడుకూడ నామె వెనువెంట నే పోవుచుండెను.

వృద్ధదేశానందుఁ డింతవఱకును స్తబ్ధుఁడై కూర్చుండియుండెను. ఆస్త్రీయును, జినానందుఁడును జెట్లచాటునకుఁబోయి కనుమఱుఁగై నంతనే యాతఁడొక్కయుదుటున లేచి దవ్వుదవ్వుల వారి ననుసరించి పోవసాగెను. ఆతని ప్రవర్తనముం గాంచి తక్కినభిక్షు లందఱును గడుపు లుబ్బ నవ్వనారంభించిరి. కాని దేశానందుఁడు వారివంకఁ దీవ్రదృష్టిక్షేపముం గావించుచు "ఓరీ! మీరెటులైనను బసికుఱ్ఱలు! స్త్రీలచరిత్రమాహాత్మ్యములు పసిబిడ్డలగు మీకేమి తెలియును? కుమార్గగమనోన్ముఖుఁ డగునీతరుణభిక్షునకు బుద్ధి చెప్పుటకై నేనాతని వెంటఁ బోవుచున్నాను! ఇది మీకుఁ బరిహాసముగా నున్నదా?" అనియెను.

దేశానందుని విచిత్రకార్యకారణసమన్వయమును విని భిక్షుకు లందఱును మరల బిగ్గఱగా నవ్వఁదొడంగిరి. కాని యావృద్ధుఁడు వారి నవ్వులను లక్ష్యము చేయలేదు. ఆతఁడు క్రూరవ్యాఘ్రము వలెఁ బొంచుండి తరుమండములచాటున డాగుచు ముందఱికిఁ బోవుచున్న తరుణీతరుణులవెనువెంటనే పోవఁదొడంగెను.

దేశానందుఁడు కన్నులకగపడకుండఁ బోయినతరువాత నొక భిక్షుఁడు మృదుస్వరముతో "ఈజినానందుఁ డెవ్వఁడో మీరెవ్వరైన నెఱుఁగుదురా?" అని ప్రశ్నించెను.

ద్వితీయుఁడు—బాగుగ నాలోచింపఁగా నాతఁ డొకరాజపుత్రునివలె నగపడుచున్నాఁడు. ఏది యెట్లయినను నీతఁ డొకమహాశ్రీమంతునితనయుఁ డనుట కెంతమాత్రమును సందేహము లేదు.

ప్రథముఁడు—ఈజినానందుని చరిత్రవిషయమునం దేదియో రహస్య మున్నది. ఆవిషయమున నెట్టిసంశయమును లేదు. కాని యా రహస్య మేమియో యెంతప్రయత్నించినను నాకు బోధపడుటలేదు.

ద్వితీ—ఏమి ! ఎట్టిరహస్య మున్నది?

ప్రథ—అనఁగా—నీకేమియు సంశయము కలుగుట లేదా? మనసఘస్థవిరుఁడు (మఠాధికారి) నీకేమియు నీవిషయమునఁ జెప్పి యుండలేదా?

ద్వితీ—లేదు. లేదు. ఎన్నఁడును వాతో నేమియును జెప్పలేదు.

ప్రథ—ఆలాగా? ఆనాఁడు నీవెక్కడికో పోయియుంటి వని తోఁచుచున్నది. ఈజినానందుఁడు మనసంఘారామమునకు వచ్చిన దినమున సంఘస్థవిరుఁడు మమ్మందఱ నొక్కచోటికిఁ బిలిచి మీరందఱు నెల్లప్పుడు నీజినానందునిపై నొకకన్ను వైచి యుండుఁ డని చెప్పియున్నాఁడు. రాత్రివేళల నాతనిగదివాకిట నిరువురుభిక్షులు కావలి యుండవలయునని కూడ నాతఁడు నియమించెను. ఎందఱో నవీనభిక్షులీ సంఘారామమునఁ జేరుచుండుటను జూచితిమి గాని సంఘస్థవిరుఁ డెన్నఁడు నెవ్వరివిషయమునను గూడ నిట్టివిలక్షణ మగునాజ్ఞను గావించి యుండలేదు.

ద్వితీ—మనసంఘారామమున కిది యొక మంచివేఁటయే దొరకినది. ప్రస్తుతము మనసంఘమునకు దుర్దినములు సంప్రాప్తములై యున్నవి. కావుననే యిట్టివేఁటలకు విలువ హెచ్చిపోవుచున్నది. ఇం దాశ్చర్య మేమున్నది?

ప్రథ—అది మనకందఱకును గానవచ్చుచునే యున్నది. కాని యింతమాత్రమున జినానందునిరహస్య మెట్లు బయలగును? ఈకొలఁది కాలములోనే యాతనికి రెండుమూఁడుజాబులు వచ్చినవి.

ఆసమయమున వారికిఁ గొంచెముడముగా నొకచో నేలపైఁ

బండియున్న వృద్ధభిక్షువు చటాలున లేచి "సావధా—సావధాను లగుఁడు! అందఱును, జాగ్రత్తగ నుండుఁడు! దూరమున వజ్రాచార్యుల వారగపడుచున్నారు. అనియెను. వజ్రాచార్యుఁ డన సిద్ధభిక్షువు—ఈతనిచేత నెప్పుడును వజ్రయుద్ధముండును.

ఆతనిమాట విని యెల్లరును లేచి నిలువఁబడిరి. కొలఁది సేపటిలోనే యొక చెట్టుకొమ్మ భుజముపై నిడుకొని, చినిఁగినగుడ్డల నొడలందాల్చియున్న యొకవృద్ధభిక్షువు వచ్చి యామందిరము నెదుట నిలువఁబడియెను. ఆతనింగాంచి యందఱును భూపర్యంతమును వంగి యాతనికిఁ బ్రణమిల్లిరి. భాగీరథీతీరమునం దీవృద్ధుని మన మొకసారి చూచియున్నాము. యువరాజశశాంకుని భయంకరభవిష్యోదంతమును దెలిపిన విచిత్రదైవజ్ఞుఁడే యీవృద్ధుఁడు!

వజ్రాచార్యుఁడు—దేశానందుఁ డెక్కడ నున్నాఁడు?

భిక్షులు—ఈవనమున కేఁగియున్నారు.

వజ్ర—సంఘస్థవిరుఁ డేఁడీ ?

భిక్షు— మందిరములో నున్నారు.

* * * *

వెనుకఁ బ్రస్తావించిన వనమునందలిశిథిలశిలాస్తంభముల వెనుక నిలిచి తరళా జినానందులు మెల్ల మెల్లఁగ నేమేమియో సంభాషించుకొనుచుండిరి.

తరళ—మీరీవిధముగా నెంతకాలము గడపెదరు?

జినా—తరళా! చెప్పుము! నేను చేయవలసినపని యేమున్నది? ఏమిచేయఁగలను; నేనిప్పుడనన్యగతికుఁడ నై యున్నాను. వీరు నన్నుఁ బ్రత్యక్షముగా బంధించి యుండ లేదు. కాని యిట్లుంచుటకంటె బంధించివైచుటయే మేలని తోఁచుచున్నది. ఎల్లప్పుడును, రేయుంబవ లష్టప్రహరములును—నా వెంట నెవ్వరో యొక రుండియేయుందురు. వీరు

నన్నుఁ దమదృష్టినుండితప్పించుకొనఁ జూచుట లేదు. పాఠకోప్తులకై నను నాకేమార్గమునుదొరకుట లేదు.

తర—అలాగా? ఇఁక మీరు మరలి రారా?

జినా—మరలి వచ్చుట నాకు సాధ్యమే యగునేని నేనొక్క నిమిషమైన నిచ్చట నిలిచి యుండుదునా తరళా?

తర—మిమ్ములను బలవంతముగా భిక్షువుం గావించుటవలన వారి కెట్టిలాభ మున్నదో నాకు బోధపడుట లేదు. మీతండ్రిగారికి మీరొక్కరే తనయులు-మిమ్మీవిధముగాఁ ద్యజించునప్పుడు మీతండ్రిగారికైనను విచారము కలుగ లేదేమి? అదియే వింతగా నున్నది.

జినా—తరళా! ఎట్టిలాభలోభముచే వీరు నన్నిట్లు భిక్షునిం గావించిరో నీకుఁ దెలియ లేదా? జనకునిమరణానంతరమున నేనొక్కఁడనే యీతనియగణితసంపత్తి కధకారి నగుదును. ఒకవేళ నేను నా యెప్పటిజీవనక్రమమునం దుందునేని—నా—నాయొక్కడిదింక?— నేనాయూధికను బెండ్లియాడి సంసారి నగుదును. కాని నేనేదినమున నీసంఘమునఁ బ్రవేశించితినో—భిక్షువు నైతినో—ఆనాఁటితోనే నాకా యధికారము వదలిపోయినది. ఆనాఁడే నేనీజగంబున నిశ్చయముగా మరణించితి నని చెప్పవచ్చును. ఈస్థితిలో నాతండ్రియనంతరమున నాతని విశాలసంపదకంతకును నేను పేరునకుమాత్రమే యధికారి నగుదును. కాని నిజముగా నాసర్వసంపదయు నీబౌద్ధసన్యాసులకుఁ జేరఁగలదు. తరళా! ఇందుకొఱకే వీరు నన్నిచ్చటికిఁ దెచ్చియున్నారు.- ఈకారణముననే యిప్పటివఱకు—నొక్కనిమిషమైన—నన్నెమరకుండఁ గాఁచుకొనుచున్నారు.

తర—కాని-మహారాజా! మీరావసుమిత్రులే వా?

జినా—(నిట్టూర్పు విడిచి) తరళా! నీ నోటితో నానామము నిప్పు డుచ్చరింపవలదు. శ్రీష్ఠివసుమిత్రుఁ డెన్నఁడో మరణించి యున్నాఁడు. నే నిప్పుడు జినానందుఁడను.—

తర—లేదు మహారాజా! లేదు. మీరు మరణింపలేదు. మీరి ప్పటికిని సజీవులే. ఈతరళ బ్రతికియున్నంతవరకు శ్రీవసుమిత్రుఁ డెప్పటికిని మరణింపఁడు—మీరు మరల నెప్పటివలె నిశ్చయముగ నీజగత్సంసారమునఁ మెలంగఁగలరు—యాధికను బెండ్లి యాడి.—

జినా—(దీర్ఘశ్వాసము విడిచి) ఇది కేవలము నడియాస! త రళా! దురాశయును గాదు! దుస్స్వప్నమును గాదు. ఇప్పుడు నేనట్టి కలగనుటకూడ మహాపాప మగును.

తర—మహారాజా! కేవలనాశాపిశాచగ్రస్తుఁ డగుటచే మీ తండ్రిపేరైన నెత్తువారెవ్వరును నగరమున లేరు. మీతండ్రి యెంద అగ్రహస్తులను బిరుకాలుగాఁ జేయలేదు? పూర్వ మొకప్పుడు నేను మీతండ్రిగారి కఠినచరిత్రముంగూర్చి మాటాడుచు నాతఁడు మనుజుఁ డేకాఁడని యంటిని—పశువంటిని-కాని యిప్పటినాయనుభవమును బట్టి చూడఁగా నాతఁడు పశువును గాఁడు! కేవల పాషాణమే—ఏమ నిన— పశువులకైనను దమకిశోరములపై మక్కువయుండును!

జినా—చీచీ! తరళా! నీవు భ్రమపడుచున్నావు. నాన్నగారికి హృదయమే లేదని యనరాదు. వారికి ధనాశమిక్కుటమే గాని మ నఃకోమలత్వము వారికి బొత్తుగాఁ లేకపోలేదు. తరళా! బౌద్ధసంఘో న్నతికై పుత్రుఁడ నగునన్నుఁగూడ బలియిచ్చినవారు వారేగదా! తనసంపదచే బౌద్ధసంఘ మున్నతింగాంచునని వారివిశ్వాసము! రాజు బహిరంగముగా బౌద్ధమతమునకు శత్రువు గాఁడు. కాని యా తండు బౌద్ధమతానుయాయిమాత్రము గాఁడు. తనమరణానంతర మధి కారమును వహించి నేనొకవేళ బౌద్ధసంఘముతోఁ గలహము పెట్టు కొందునేమో యనుసందేహముచే నాజనకుఁడు నన్నీవిధముగా జీవ ములతోనే చంపివైచెను—తనసర్వమును— అంతయేల?—ధర్మో న్నతికై తనయేకపుత్రుని బలియొసఁగి యాతఁడక్షయపుణ్యమును సం పాదించుకొనియెను.

తర—మహారాజా! ఇఁక మీరేమియును జెప్పనక్కఱలేదు- ఆహా!—మీతండ్రి!—ఇందుకొఱకే మీయెదుట నాతనింగూర్చి నే నేమియుఁ జెప్పఁదలఁచుకొనలేదు.

అని తరళ కోపముతో నూరకుండెను. ఇంతలో సమీపమున నెండుటాకులపై మనుజులు నడచుచున్న పదధ్వని వినవచ్చెను. జినానందుఁ డదరిపడి "ఇఁకఁజాలును! ఎవ్వరో వచ్చుచున్నారు." అనియెను.

తరళ నిర్లక్ష్యముగా "రానిండు! ఇంతగా భయపడవలసిన యావశ్యక మేమున్నది? ఏమగునో చూత్తము!" అని యొక చెట్టునీడను నిలువఁబడి నలుదెసలఁ బరికించి మరల జినానందుని చెంతకుఁ జని "మహారాజా! భయమునకుఁ గారణ మేమియును లేదు. ఆపు సలియుండకొఱకు మనవెనువెంటనే వచ్చెను గాఁబోలును! నాకిఁక నిక్కడ నుండవలసినపని యేమియును లేదు. మహాప్రభూ! మీరు మరణింపలేదు—జీవించియే యున్నారు! ఈమాటమాత్రము మనసునం దుంచుకొనుఁడు! ఇటనుండి మిమ్ము విడిపించుకొని నావెంటఁ గొనిపోయిననే గాని నాపేరు తరళగాదని నమ్ముఁడు!" అని హెచ్చరించి మఱుక్షణమునందే యామె యాయడవిలోఁ బడి నిమిషములో నగపడకుండఁ బోయెను. జినానందుఁ డొకదీర్ఘనిశ్వాసమును విడిచిమెల్లగా వెనుకకు మరలెను. ఆచార్యదేశానందుఁడు రహస్యముగాఁ దరళను వెంబడించి పోవుచున్న ట్లాతఁడు కనుఁగొని యెను



పదునొకండవప్రకరణము



మందిరమంతయు నంధకారబంధురమై యుండెను. నేతిదివ్వె యొకటిమాత్రము మినుకుమినుకు మనుచుండెను. ఆదీపకాంతిలో

మందిరమునందలి దేవమూర్తిమాత్రి మించుక దృగ్గోచర మగు చుండెను. విగ్రహమునకుఁ బుష్పములు, చందనము, నైవేద్యము మొదలగు సామగ్రిలు సిద్ధపఱుపఁబడియుండెను. సామాన్యముగఁ జూచినచో నామందిరమునం దెవ్వరును లేనట్లే యగపడును. కాని యందొకమూల నొక పొడుగైన పురుషుఁడు కూర్చుండి యుండెను. వాఁడు నిస్తబ్ధుఁడై నిశ్చలుఁడై కూర్చుండుటను జూడ ధ్యాననిమగ్నుఁడై యున్నట్లు తోఁచుచుండెను.

ఇంతలో నొకవృద్ధుఁడు వచ్చి ద్వారముకడనిలిచి "ఏమోయీ! స్థవిరా! లోపలనున్నావా?" అని ప్రశ్నించెను.

స్థవి—ఎవరు మీరు?

వృద్ధు—శత్రుసేనుఁడను.

స్థవి—రమ్ము; లోనికి రమ్ము!

వృక్షశాఖ భుజముపై నిడికొనివచ్చి యిదివఱకు మనకుఁ బరిచితుఁడైన వృద్ధవజ్రాచార్యుఁ డప్పు డామందిరాంతర్భాగమునఁ బ్రవేశించెను. ఆతనిం గాంచినంతనే యున్నతపురుషుఁ డగు స్థవిరుఁడు "వజ్రాచార్యా! నీవీవృక్షశాఖ నెక్కడఁ దుంచి తెచ్చితివి?" అని యడిగెను.

వజ్రా—(చిఱునవ్వుతో) సరిసరి! ఇది వట్టికొమ్మగాదు. ఇదియే నావాయువేగతురంగము! దీనిసాహాయ్యముననే నే న్నాయశోధవళ దేవునిచేతులనుండి తప్పించుకొనఁ గలిగితిని! అట్లు గాకున్నచో వజ్రాచార్యునకు బలినిర్వాణ మైపోయినదని నీవీపాటి కాలకించియే యుందువు! (బలినిర్వాణమనిన బౌద్ధసాంప్రదాయమునందు మోక్షమని యర్థము)

స్థవి—అయిన నేమిలే! కార్యసిద్ధియయ్యెనా లేదా?

వజ్రా—అయ్యెనో లేదో నాకుఁ దెలియదు. కాని శశాంకుఁ డింకను బ్రదికియే యున్నాఁడు.

స్థవి—అట్లయిన నీవచ్చటి కేల పోయితివి?

వజ్రా—బంధుగుప్తా! నేనేమి చేయుట కక్కడకుఁ బోయితినో సమస్తమును నీకుఁ దెలిసియే యున్నది. మరల నన్నేల యడిగెదవు? నానోట నే వినఁదలఁచితి వేని వినుము! నేను శశాంకుని జంపఁ బోయితిని.

స్థవి—తుద కేమైనది?

గుము?వజ్రా—ఏమ నేనాతని వధింపఁజాలక పోయితిని.

స్థవి—తగినయవకాశము దొరక లేదు కాఁబోలును.

వజ్రా—అవకాశము లభింప కేమి? శశాంకుఁడు, మాధవుఁడు, చిత్రి, ఈముగ్గురును భాగీరథీతీరమునఁ బ్రియాహ్న సమీపమున నాడుకొనుచుండిరి. వారిలో నొక్క సేవకుఁడైనను లేఁడు!

స్థవి—ఇంకేమి? మంచియదనే దొరకినది!

వజ్రా—ఏమి కావలయును? అంతయు ననుకూలముగనే యున్నది. కాని, నేనే మాత్రమి జంపఁజాలక పోయితిని. బంధుగుప్తా! ఏమిచేయుదును? ఆబాలుని కోమలకంఠమును నఱకుటకు నాకృపాణహస్తమును బైకెత్త లేకపోయితిని. నీవిచ్చినవజ్రాయుధ మింకను చేతిలోనే యున్నది. ఇంకను దానినట్లే వస్త్రాభ్యంతరమున దాఁచి యున్నాను. కాని, నేనప్పుడు దానిని బైకిఁ దీయలేనైతిని. స్థవిరా! నరహత్యలు చేసి చేసి నీవు నల్లరాతివైపోయితివి! నీమనంబునఁ గోమలత్వమే లేకుండఁ బోయినది అందుచేతనే నేను నిష్ఫలారంభుఁడనై యేలవచ్చితినో గ్రహింపఁజాలవైతివి. ఇఁక నెన్నటికిని గూడ గ్రహింపఁజాలవు. నీయుపదేశము ననుసరించి నేను శశాంకుని వధింపవలయు ననియే ప్రతిజ్ఞచేసి కోటనుండి బయలుదేఱి పోయితిని. కాని, దూరమున గంగాతీరమున సికతాతలమున నిస్సహాయుఁడై యున్న శశాంకునిం గాంచినప్పుడు మాత్రము నేను నాపూర్వ్కనుండి

యెంతమాత్రమును జలింపలేదు. సమీపమున కేఁగి యాతని దర్శించి నప్పుడుమాత్ర మెవ్వరో నావెనుకనుండి వజ్రముష్టిచే నాచేతులను గట్టిగ బిగించి పట్టుకొన్నట్లయినది. నీయాదేశానుసార మాతని భవిష్యముం గూర్చి యాతనికిఁ దెలిపితిని. కాని, యాతని జంపుటకు మాత్రము నాచేతులు రావయ్యెను. స్థవిరా! సర్వమును భాగ్యచక్రబద్ధమై యుండును. విధివిధానము నతిక్రమించుట యసంభవము గదా! నీవంటి శతాధిక సంఘస్థవిరులును, నావంటి సహస్రాధిక వజ్రాచార్యులును నేకమైనను భాగ్యచక్రగమనము నణుమాత్రమైనను మరలింపఁజాలరు. గంగాసైకతప్రదేశమున నాసీనుఁడై యున్న యా బాలుని యదృష్ట తేజోమయంబగు ముఖకమలము నీక్షించినచో శత్రుసేనబంధుగుప్తులలో నెవ్వరికైనను నాతని యొక్క కేశ గోజమునకైన నపాయ మాపాదించుట యశక్యమేయని నాకుఁ దోఁచినది.

వజ్రాచార్యునిమాటలవలన బంధుగుప్తునిమనశ్శాంతి యంతయును నశించిపోయెను. అతఁడు క్రోధోద్రేకముతో "పిరికిపందా! నీవు పురుషుఁడవా? శుద్ధ—శుద్ధనపుంసకుఁడవు! ఆకుఱ్ఱవానిసుందరరూపమును, గాంతిని గనుంగొని మోహపరవశుఁడవై పోయితివా? మారుని యాసురమాయ నిన్నుముంచివైచినది! అందుచేతనే కోమలశరీరుఁ డగునొకబాలుని వధించుకార్యముగూడ నీకశక్యమైపోయెను. వజ్రాచార్యా! నీవు మాగధసంఘమునకు నాయకుఁడవు. ఉత్తరపథపుటార్యసంఘము నీయంగుళీసంచాలనమున నడచుచున్నది. అట్టినీవు భాగ్యచక్రకల్పనాంధకారమధ్యమున దాఁగి కూర్చుండఁజూచుచుంటివా? శత్రుసేనా! అల్పవయస్కులు, అజ్ఞానులు, వృద్ధస్త్రీలు మొదలగువారుదక్క భాగ్యచక్రముపై విశ్వాస ముంచి స్వస్థచిత్తులై యూరక కూర్చుండు వారీకాలమున నెవ్వరున్నారు? ఛీ ఛీ! సిగ్గు సిగ్గు! శశాంకసంహార మిఁక నీవలనఁ గానేరదు. ఆర్యసంఘోన్నతి

కొఱ కొకసామాన్యబాలకుని సంహరింపఁజాలకపోయితివి. వజ్రాచార్యా! నీకీర్తిం దాఁకిన యీదుష్కళంకమును నీవిఁక నెన్నటికిఁ దొలఁగించుకొనఁగలవు? యుగములవెంట యుగములు గడచిపోయినను నీయీకళంకచరిత్రము బౌద్ధసంఘమునఁ జిరకాలమువఱకును బ్రతిధ్వనింపకమానదు. ఛీ ఛీ! నీకువచ్చినయేం దైన్యానికి వచ్చినది? సిగ్గు లేదా? ఏమొగము పెట్టుకొని నీవిచ్చటికి మరల వచ్చితివి? అక్కడనే చావలేకపోయితివా?

వజ్రి—స్థవిరా! నీవును వృద్ధుఁడవేగాని బాలుఁడవు గావు గదా! నీవెంట్రుక లన్నియును సంఘసేవలోనే పలితము లైపోయినవి. ఏనవీనమార్గముచే నేనిప్పుడు నీకు బోధింతును? చక్కఁగాఁ గన్నులు తెఱచి చూచినచో సకలజీవచక్రమును భాగ్యచక్రముచే బంధింపఁబడియున్నట్లు నీకు గోచరించుట లేదా? అల్పవయస్కులు, నజ్ఞానులును, వయోవృద్ధులునుదక్క నీయుగమునం దితరు లెవ్వరును భాగ్యచక్రమును విశ్వసింపకుండుటయే నిజమగునేని నీవీవిధముగా నదృష్టగణనముం గావించుచు నంకెలకూడికలతోఁ జచ్చుటెందులకు? నీవిప్పుడుగూడ శశాంకునిజన్మపత్రికను జేతిలోఁ బెట్టుకొనియే కూర్చుండి యుంటివే! బంధుగుప్తా! నీవును నేను నొక్కనాఁడే భిక్షుదీక్షం గైకొంటిమి. ఇరువురము నేకీభవించియే సంఘసేవ గావించుచుంటిమి. సుఖదుఃఖములలో సంపద్విపత్తులలో భుజమును భుజమును సోఁకునట్లిరువురము నొక్కచోటనే నిలిచి యుంటిమి. అంత యొడలు మఱచిపోయితివా? బాలకులభయప్రకంపితకరుణాలాపములకుఁగాని, స్త్రీలసంతాపప్రతప్తాశ్రుజలములకుఁగాని నాహృదయము కరఁగిపోవుట నీవెన్నఁడైనఁ గాంచితివా? బంధుగుప్తా! నీవు నన్ను నిష్కారణముగాఁ దిరస్కరించుచున్నావు. శశాంకుఁడు నాచేతులలోఁ జచ్చువాఁడు గాఁడని నాకు సంపూర్ణవిశ్వాస మున్నది. స్థవిరా! శశాంకుఁ

డింకను బాలుఁడే యనుకొనుచుంటివా ? ఆతనిజీవితప్రవాహ మప్పుడే తారుణ్యసీమ నడుగుపెట్టుచున్నది. ఆతనిముఖమండలమునందలి రాజోచితగాంభీర్యము నాకు దృగ్గోచర మైనది. భయమన నేమియో యాతఁ డెఱుంగఁడు. మగధసార్వభౌముఁ డగుట కాతఁడే సర్వవిధముల యోగ్యుఁడై యున్నాఁడు. స్థవిరా ! నీవు వ్యర్థప్రయత్నములు సేయుచున్నావు. కాని, అంగవంగకళింగగౌడమగధ దేశములలో శశాంకునప్రతిహతగతి కవరోధముం గల్పింపఁజాలుమగవాఁ డొక్కఁడును లేఁడు ! నిశ్చయముగా లేఁడు. ముమ్మాటికిని లేఁడు !

అని చెప్పి వజ్రాచార్యుఁడు కూర్చుండెను. స్థవిరుఁడును గొంత సేపటివఱకు నిస్తబ్ధుఁడై కూర్చుండి పిమ్మట హీనస్వరముతో "నరే—కాని—గణితమంతయు నసత్యమనియా నీయభిప్రాయము ?" అనియెను.

వజ్రా—గణిత మెన్నటికి నసత్యము కానేరదు. కాని యొకవేళ నీగణనమునం దేదియో తప్పుండనచ్చును.

స్థవి—(విచారసూచకస్వరముతో) అట్లయినచోఁ గొంచెము సేపాఁగుము. మరల నొకసారి గణితము చేసి చూచెదను.

అని సంఘస్థవిరుఁ డామందిరమునందొకమూల మినుకు మినుకుమనివెలుఁగుచున్నదీపము నొక్కింతయధికప్రకాశితముగఁ జేసి తాళపత్రముపై లేఖినీసహాయమున గణితము చేయ నారంభించెను. ఈస్థితిలో నొకగడియ గడచెను. ఇంతలో నెవ్వరో యామందిరము చెంతకు వచ్చి యర్గళమును జప్పుడు చేసిరి.

వజ్రా—ఎవరువారు ?

వ్యక్తి—నేను బుద్ధమిత్రుఁడను.

వజ్రా—వి శేషము లేమి ?

బుద్ధ—కపోతికసంఘారామము (ఇది పాటలీపుత్రమునందలి ప్రాంతమఠము, అశోకచక్రవర్తి దీనిని స్థాపించెను) నుండియేదో యావశ్యక మగుసందేశమును గొని తెచ్చినాఁడు. ఆతని లోనికిఁ దీసికొని వత్తునా ?

వజ్ర—వలదు. కొంచెముసే పాఁగుము.

కొంతసేపటికి బంధుగుప్తుఁడు తలపైకెత్తి "నాగణిత మెంతమాత్రమును దప్పిపోలేదు. నేఁడు రెండుజాములవ్వేళవఱకును శశాంకునకు మృత్యుయోగ మున్నది. నక్షత్రము ప్రతికూలముగ నున్నదిగాని సూర్యుఁడుమాత్రము సహాయుఁడై యున్నాఁడు" అనియెను.

వజ్ర—ఔను నిజమే—నేను చెప్పమఱచితిని. మాసంభాషణమారంభమగుటకుఁ బూర్వమే యొకవిఘ్నము తటస్థించినది.

బంధు—అది యేమి ?

వజ్ర—విఘ్నమనఁగా యశోధవళదేవుఁ డాకస్మికముగఁ బ్రత్యక్షమగుటయే—

బంధు—(భయముతో) ఏమంటివి ?

వజ్ర—యువరాజభట్టారకపాదీయమహానాయక యశోధవళదేవుఁ డప్పుడచ్చటికి విచ్చేసెను. బంధుగుప్తా! నీవేకాదా యాతనికుమారుని సంహరించితివి ? రోహితాశ్వదుర్గాధిపతి నప్పుడే మఱచిపోయితివా ?

ఆమాట విన్నంతనే యింతవఱకును గ్రిందఁ గూర్చుండియున్న బంధుగుప్తుఁడు చటాలున లేచి కంపితకంఠస్వరముతో "శక్రసేనా! పరిహాసింపకుము! నిజము చెప్పుము! నిశ్చయముగా యశోధవళుఁడే నగరమునకు వచ్చెనా? ఇది సత్యమే యైనచో నిఁక ననర్థములకు మేరయే లేదు: ఇది కేవలము నాయొక్కనికే కష్టముగాదు. సకల సంఘములకును గష్టపరంపరలు సంభవింపనై యున్నవని నమ్ముము. వజ్ర

చార్యా! నిజము చెప్పుము! ఆతఁడు నిజముగ యశోధవళుఁడేనా?" అనియెను.

వజ్ర—బంధుగుప్తా! కేవలమీపది సంవత్సరములలోనే నేను యశోధవళుని మఱచిపోయితి ననుకొంటివా? ఉండుముండుము. కపోతిక సంఘారామమునుండి వచ్చిన సందేశ మేమియో విందము—బుద్ధమిత్రా! ఆదూతను లోనికిఁ దీసికొనిరమ్ము.

అంతలో నొకతరుణభిక్షుఁ డొకవృద్ధభిక్షునితో లోనఁబ్రవేశించెను. ఆయిరువురును యథోచితప్రణామములం గావించిన తరువాత వజ్రాచార్యుఁడు "విశేషము లేమి?" అని ప్రశ్నించెను.

వృద్ధు—రోహితాశ్వదుర్గాధిపతి మహానాయక యశోధవళదేవుఁ డిరువదిసంవత్సరముల కిప్పుడు మరల నగరమున కేతెంచె నను నిశ్చయవార్త మహాస్థవిరులకుఁ దెలియవచ్చినది. కావున నాలోచన సభాసమావేశ మగుటకు మీయనుమతిని వేఁడుచున్నారు.

వజ్ర—యశోధవళుఁడు నగరమున కేతెంచిన సంగతి మాకును దెలిసినది. రేపటి యుదయమునఁ బురాతనదుర్గశిఖరమున సభాసమావేశము కాఁగలదు. కాని యాదుర్గశిఖరమున సూర్యకిరణ ప్రసారమగుటకు ముందుగనే సభాకార్యములు పూర్తి కావలయును.

వజ్రాచార్యుని యీయాజ్ఞను విని యాభిక్షులిద్దఱును బ్రణామములం గావించి యామందిరమునుండి వెడలిపోయిరి.

బంధుగుప్తుఁడు వ్యాకుల హృదయముతో "యశోధవళుఁడు నిజముగనే నగరమున కేతెంచి యున్నాఁడు. శత్రుసేనా! ఇఁక నెవ్వరికిని బ్రదుకు నాస యగపడుట లేదు. నేఁటివఱకును నిద్రించుచున్న సింహ మిప్పుడు మేల్కొన్నది. ఆతని పుత్రుని నేనే సంహరించితి నను వృత్తాంత మాతని కప్పుడే తెలిసియుండెను. నన్నొక్కని మాత్రము చంపుటతో యశోధవళుఁ డూరకుండునని తోఁచుట లేదు. ఆతఁడు

సకల బౌద్ధసంఘములను పాతాళమున కణఁగఁ ద్రొక్కువఱకు నూరకుండువాఁడు గాఁడు.

వజ్రి—ఔను. అనర్థము సమీపించి నట్లే తోఁచుచున్నది.

బంధు—(తీవ్రదృష్టితో) వజ్రాచార్యా! నామాటలు నీకు సరిగా బోధపడుట లేదని తోఁచుచున్నది. యశోధవళుని చేతనే నాకు మరణము తటస్థించునట్లగపడుచున్నది. ఉండుము! ఒకసారి గణితము చేసి చూచెదను.

అని చెప్పి మఱియొక దీపమును వెలిఁగించి బంధుగుప్తుఁడు తాళపత్రముపై మరల గణితము చేయసాగెను. కొలఁదిసేపటిలోనే యాతని మొగము వెలవెలఁబాఱెను. ఆతఁడు తాళపత్రమును, లేఖినిని దూరముగ విసరివైచి యుచ్చస్వరముతో "నిజము! నిశ్చయము; వజ్రాచార్యా! నిజముగా యశోధవళుఁడే నన్నుఁ జంపఁగలఁడు! గణిత మెన్నటికిని అసత్యము గాఁబోదు. శత్రుసేనా! నన్ను రక్షింపుము! రక్షింపుము! యశోధవళుని ప్రతీకార మతిభయంకరమైనది!" అని యఱచెను.

వజ్రి—(నవ్వుచు) స్థవిరా! ఊరక! యిట్లు భయపడెద వేల? యశోధవళుఁ డిప్పుడే నిన్నుఁ జంపరాలేదుగదా! భాగ్యచక్ర ప్రభావముపై నీకెంత మాత్రమును విశ్వాసమే లేదుగాదా?

బంధు—(విచారముతో) మిత్రా! శత్రుసేనా! క్షమింపుము. సత్యము నెఱుంగక కటుశబ్దప్రయోగముచే నిన్ను నొప్పించితిని. యశోధవళుఁ డనిన నాకెంతయో భయమగుచున్నది. శస్త్రవిహీనుఁడును, శృంఖలాబద్ధుఁడు నగునాతని తనయుని గుక్కను జంపినట్లుగా నేను చంపివైచితిని. ఈసంగతి యాతని కెంతకాలము క్రిందటనో తెలిసియే యుండును, అందుచే యశోధవళుఁడు ననెన్నటికిని క్షమింపఁ జాలఁడు!

వజ్రి—(నవ్వుచు) నీవింకను మరణమునకై భయపడు చున్నావా!

బంధు—వజ్రాచార్యా! నీవు వెఱ్ఱివాఁడవు! నీకుఁ దెలియఁజెప్పుట యెట్లు? నేనప్పుడే మరణమునకు సంసిద్ధుఁడనై యుండలేదు. ఇంకను నెన్నియో ఘనకార్యములు నాచే నిర్వహింపఁ బడవలసి యున్నవి.

వజ్రి—బంధుగుప్తా! శాంతింపుము! ఊరడిల్లుము! భయవ్యాకులుఁడవై జ్ఞానబంధమును ద్రెంచివైచుకొన్నంతమాత్రమున నీవు మృత్యువును దప్పించుకొనఁ గలుగుదువా? సంఘస్థవిరుఁడవగు నీ వార్యసంఘనేతవుగదా! ఈవిధముగా భయవిహ్వలుఁడవై పోవుట నీవంటి వానికిఁ దగదు.

కాని యీయూఱడింపువలన సంఘస్థవిరుని భయము తొలఁగి పోవునా? ఆతఁడు వగచుచు "వజ్రాచార్యా! రక్షింపుము! నన్ను రక్షింపుము! ఎచ్చటనైన నన్నుఁ దాఁచి యుంచుము. పుత్రహత్యాసంజనితమహాక్రోధపరవశుఁడై ప్రతీకారముం గావింప నెత్తివచ్చుచున్న యశోధవళుని భయంకరాకారము నాకీమందిరమునందలి ప్రతిస్తంభము చాటునను గానవచ్చుచున్నది. ఈయంధకారగర్భమునందంతటను దారుణ కృపాణపాణియైయున్న యశోధవళుని విశ్వమూర్తి నాకన్నుల యెదుటఁ దాండవ మాడుచున్నట్లున్నది!

వజ్రి—(మందహాసముతో) భయపడవలదు. ధైర్యమును వహింపుము. నడువుము. నిన్నొకరహస్యగృహమునం దుంచెదను.

బంధు—(కంపముతో) నడువుము! నడువుము! త్వరగా నడువుము!

వజ్రాచార్యుఁడు బంధుగుప్తు నాసనమునుండి లేవఁదీసి యొకగుప్త మందిరముకడకుఁ దీసికొనిపోయి కవాటమును దెఱచి దీపికాసహాయ

మున లోపలఁబ్రవేశించి యొక్కొక్క మెట్టుగాఁ గ్రిందికి దిగి పోయి యాతని నాగృహమునఁ బ్రవేశపెట్టెను బంధుగుప్తుఁడు భయభ్రాంతుఁడై వెనుకకుఁ దిరిగి తిరిగి చూచుచు వెఱ్ఱివానివలెఁ బ్రవర్తించుచుండెను. అంతలో నామందిరమంతయు నంధకారబంధురమైపోయెను.

---

## పండ్రెండవ ప్రకరణము.

సాయంకాల మయ్యెను. తమ మతిగభీరముగ నలుముకొనుచుండెను. అట్టిసమయమున నుపనగరమునందలి విశాలరాజమార్గమునుండి యొకతరుణీమణి నగరాభిముఖంబుగఁ బోవుచుండెను. చీకటి పడుచుండుటచే నామె యతివేగముగ నడచుచుండెను. అప్పు డాబాటను జనసంచారము బొత్తుగా లేదనియే చెప్పవచ్చును. మార్గమధ్యమునం దొకరిద్దఱుమాత్ర మగపడిరి. కాని యామె వారి నతిక్రమించి చాల దూరమువఱకును ముందటికిఁ బోయెను. క్రమక్రమముగ గాఢాంధకార మధికమగుటచేఁ గన్నుమిన్నును గానరాకుండఁ బోయెను. అప్పు డేమిచేయుటకును దోఁచక యాయువతి మెల్లమెల్లన నడవఁదొడంగెను.

ఆసమయమున వెనుకనుండి యెవ్వరిదో యడుగులచప్పుడు వినవచ్చుటచే నామె చటాలున నిలిచినచోటనే నిలువఁబడిపోయెను. ఆశ్చర్యము! అంతలో నాపదధ్వనియు నాఁగిపోయెను. అప్పుడాయువతి యటునిటుఁ బరికించి కొంతసేపటికి మరల ముందటికి నడవసాగెను. ఎవ్వరో తన్ను వెంబడించి వచ్చుచున్నట్లును, వారు కొలఁదిదూరమునందే యున్నట్లును నామెకుఁ దోఁచుచుండెను. తనమనసు కుదురుపఱచుకొనుటకై యామె మరల నచ్చట నాఁగిపోయెను. అట్లు నిలిచినంతనే యాపదధ్వనియును నిలిచిపోయెను.

ఆస్త్రీ యించుకవిచారమునం బడి యొకక్షణకాలము వఱకును నడచినట్లే నడచి యిటు నటుఁ జూచి తటాలున నొకయింటివెనుకకుఁ బోయి నిలువఁబడెను. అంతలోనే యామార్గమునుండి యాపాదమస్తకమును వస్త్రాచ్ఛాదితమై యున్న యొకమనుష్యవిగ్రహము నడచిపోవుచున్నట్లామెకుఁ గానవచ్చెను. అంధకార మగుటచే నావ్యక్తి మొగ మామెకు బాగుగ నగపడలేదు. ఆవిగ్రహ మట్లే ముందటికిఁ బోవుచుండెను. పిమ్మట నాయువతి యింటిచాటునుండి యీవలికి వచ్చి యావ్యక్తి వెనువెంటనే నడవ నారంభించెను.

సర్వాంగములను వస్త్రముచే మఱుఁగుపఱచుకొనియున్న యావ్యక్తి యట్లు కొంతదూరముపోయి తనలో "అయ్యో ఆమె యీమార్గమునఁ బోలేదు కాఁబోలును! ఇఁకఁ దోవ లేదు. వెనుకకు మరలవలసినదే" అని యనుకొనియెను.

ఆమాటలు స్పష్టముగా నాయువతికిఁ వినఁబడియెను. వెంటనే యామె చీకటిలో నింకొక యింటిచాటునకుఁబోయి దాఁగికొనియెను. ముందరుగుచున్న యావ్యక్తి యప్పుడు వెనుకకు మరలి మెల్లమెల్లగ వెడలిపోయెను. అంధకారమునం దావ్యక్తి యగపడకుండఁ బోయినతోడనే యామెమరల మార్గమునకు వచ్చి వేగముగా నడచి పోవఁదొడంగెను. కాని యొక్క యరగడియ యైనతరువాత మరల నామె కడుగులచప్పుడు వినవచ్చుచుండెను.

ఇప్పుడుమాత్ర మామెకుఁ జాలభయము కలిగెను. వెంటనే యామె యాత్రోవప్రక్క నున్నతరుషండమునఁ దూరి దాఁగికొనియెను. కొన్నినిమిషములకు మరల నావస్త్రాచ్ఛాదితమూర్తి యామెకామార్గమునఁగానవచ్చెను. ఆవ్యక్తి మునుపటివలెనే ముందటికిఁ బోయెను; మరల వెనుకకు మరలెను. అట్లు మరలివచ్చుచు నావ్యక్తి "కానిమ్ము! ఈసారికూడ నామె పాఱిపోయినది. తరళ నన్ను నిర్బయు

ముగా మోసగించినది!" అని యనుకొనుమాట లామెకుస్పష్టముగా వినవచ్చెను.

ఆవిగ్రహ మట్లు కొంతదూరము పోయినతరువాత నాయువతి చటాలునఁ జెట్లచాటునుండి వెలువడి మార్గమధ్యమున నిలిచి బిగ్గరగా "ఓమహారాజా; ఆచార్యమహారాజా! మీ రెక్కడకుఁ బోవుచున్నారు? రండు?" అనియెను.

వస్త్రావృతపురుషుఁ డాశ్చర్యస్తంభితుఁడై యచ్చటనే నిలువఁబడి పోయి కొంతసేపటికి వెనుకకుఁ దిరిగి చూడఁదొడంగెను. అప్పు డాయువతి పకపక నవ్వుచు "మహారాజా! అట్లు భయపడియెద రేమి? నేను మీతరళను!" అనియెను.

తోడనే యాపురుషుఁడు తనముసుఁగును దీసివైచి సమీపమునకుఁ బోయి తరళను బాగుగఁ బరిశీలించి యొకసారి నవ్వుకొని "ఔనౌను. అదియే యిది. అనుమానము లేదు. నిజముగా నీమె తరళయే" అని నిశ్చయించుకొని "సుందరీ! దయయుంచుము!" అనియెను.

తరళ మందహాసముతో "ఆచార్యస్వామీ! ఇంతటి గాఢాంధకారనిశాసమయమున నింతపూనికతో మీరు నన్ను వెంబడించి వచ్చుటకుఁ గారణమేమి?" అని ప్రశ్నించెను.

దేశాచార్యుఁడు సంకోచముతో "అబ్బే! లేదు. లేదు. అట్టి కారణ మేదియును లేదు—మి—మిక్కుటముగఁ జలిపిచుచుండుటచే నెక్కడనైనఁ జలిమంట యగుపడు నేమో యని వెదకికొనుచు నిక్కడకు వచ్చితిని" అనియెను.

తర.—(బిగ్గరగా నవ్వుచు) ఆచార్యా! ఏమంటిరి. ఇట్టిభీకర గ్రీష్మసమయమున మీకుఁ జలిగా నున్నదా? సెబాస్. అయ్యో! మీకు వాతబాధ యేమైన నున్నదా యేమి?

దేశానందుఁడు ప్రత్యుత్తరము చెప్పఁ జాలకపోయెను.

తర—సరే, పోనిమ్ము! ఇంకొకమాటయడిగెదను. ఆపాదమస్తకమును ముసుఁగువైచికొని మీరేల నన్ను వెంబడించి వచ్చితిరి?

దేశా—ఇది రాత్రివేళగదా! ఎవ్వరైనఁజూచి నన్నానవాలు పట్టెదరేమోయని—

తర—(నవ్వుచు)ఆలాగా? తెలిసినది! మీరిప్పుడు మీప్రియురాలిని సందర్శించుటకై సంకేతస్థలమున కరుగుచుంటిరి కాఁబోలు!

దేశా—(కళవళపాటుతో) లేదు. లేదు ఎంతమాట యంటివి తరళా! సంసారము నంతను ద్యజించి భిక్షువు లైనవారము మేము! ఇట్టిమాకుఁ బ్రియురాండ్రెవ్వరుందురు? సంకేతస్థలములు సందర్శనములు నని యేమేమో యనుచున్నావే! మేలు మేలు!

తర—ఆచార్యా! ఈమాటల కేమి? మన మించుక వెలుఁగునకుఁ బోవుదము రండు!

దేశా—వెలుఁగెందుకు తరళా? ఈప్రదేశముమాత్రము బాగుగ లేదా?

తర—ఔను గాని యిట్టిచోట మనమిరువురమును గలసి యుండుట నెవ్వరైనఁ జూచినచో నీసంగతి యంతటను వ్యాపించి మన పేరునకుఁ గళంకము గలుగదా?

దేశా—(తలయూఁచుచు) ఔనుతరళా! నీవన్నమాటసత్యమే.

తర—కావున నేనింకఁ బోయెదను. మీరిచ్చటనే నిలిచి యుండుఁడు!

దేశా—అనఁగా? నీవిప్పుడే పోయెదవా?

తర—నేను నగరమునకుఁ బోవలయును. ఇక్కడ నెట్లుందును? చాల నాలస్యమైపోయినది. ఇంటికిఁ బోవలదా?

దేశా—వలదు తరళా! వలదు! నీవిప్పుడే పోవలదు! ఇంచుకసేపైన నిచ్చట నుండుము! కన్నులార నొక్కింతసేపైన నీరూపము

గనుఁగొనుచు నాహృదయమును నిండించుకొందును. తరళా! నేనిరెండుకోశముల దూరమును గుక్కవలెఁ బరుగెత్తుకొని వచ్చుట నీకొఆకేసుమా!

తర—నిజాన్! నిప్పుకొఱకు వచ్చితి నని మీరిప్పుడేగదా చెప్పియుంటిరి? ఆచార్యా! ఇంతలోనే యిన్ని మాటలా?

దేశా—ఆఁ! దానికేమిలే! ఊరక యట్లంటిని.

తర—మఱి నిజముగా నిప్పు డేమందురు?

దేశా—తరళా! నాబుద్ధియంతయు స్థానభ్రష్టమైపోయినది.

తర—ఆలాగా? మీ కిట్టిగతి యెవ్వరిమూలమున కలిగినదయ్యా?

దేశా—నీ—

తర—(అల్పకోపాభినయముతో) అమ్మయ్యా! ఈమునలితనములో మీమదిహృదయమునఁ బ్రేమరసము పరిపూర్ణముగ నిండిపోవుచున్నది కాఁబోలును!

దేశా—చాలుఁజాలు! తరళా! వెఱ్ఱిమాట లాడకుము! నిజముగా నీహృదయము ప్రేమపరిపూర్ణమైనదనియె నేను విశ్వసించి యుంటిని!

తర—సరే! ఇప్పు డేమైనది? ఆచార్యా! ఎందుకొఱకు మీ రిప్పు డింతగాఁ గోపపడియెదరు?

దేశా—ఏమియు లేదు! కేవల మరసికురాలివలె నీ పలుకులు—

తర—నేనే మంటిని?

దేశా—నేనామాట నానోట నుచ్చరింపనైన నుచ్చరింపను.

తర—మిమ్ము నేను "వృద్ధు" లని యంటిని, అంతేనా?

దేశా—(కోపముతో) వృద్ధుఁడు—వృద్ధుఁడు—మాటిమాటికిని వృద్ధుఁడు—ఇఁక నీవు నగరమునకుఁ బొమ్ము! మన—ఇఁక నెట్టి

ప్రియసంభాషణమును వలదు! నేనిఁక సంఘారామమునకుఁ బోయెదను

తర—ఆచార్యా! ఇట్లూరక కోపించెదరేల? మీవంటి సర్వజ్ఞులగు ప్రేమమయుల కిట్టియల్పవిషయముల కై కోపించుట బాగుగ లేదు.

దేశా—(సంతోషముతో) ఆఁ! తరళా! ఆఁ! ఇప్పుడు నీకుఁ బ్రేమరసమూల్యము నిజముగా బోధపడినది. తారుణ్యముచే గలిగిన ప్రేమ—అది ప్రేమ గాదు—అది కేవలమును బ్రేమచ్ఛాయయే—వయసు ముదిరిననే గాని మనుజులకుఁ బ్రేమతత్త్వము బొత్తుగా బోధపడదు. ఉదాహరణముకొఱకు—

తర—పాలు కాఁగి కాఁగి పాయసమైనప్పు డవి పాలకంటె నధిక మధురము గాదా?

దేశా—(తల యూఁచుచు) ఔను తరళా! ఔను. నీవు నిజము చెప్పితివి. తరళా! ఏమని చెప్పుదును? నేనూరకయే నిన్నుఁ గాంచి పిచ్చివాఁడ నగుచుంటినా? ఒడలే మఱచిపోవుచుంటిని—ప్రేమదగ్ధుఁడ నైపోవుచుంటిని—

ఆచార్యుని ప్రేమసమాధి క్రమక్రమాభివృద్ధి నందుచున్నదనియు, నాతని ప్రేమరసపూర్ణప్రవాహము నడ్డగించుట యెంతమాత్రము నశక్యమనియు భావించి తరళ మృదుస్వరముతో "ఆచార్యా! ఇదియేమి? ఏమనుచున్నారు? నేనొక సామాన్యస్త్రీని—క్షుద్రదాసిని—మీరా నన్నిట్లనవలసినవారు? మీరు మహాపూజ్యులు—ఆచార్యపాదభిక్షువులు—మీ యాయు వంతయును బుద్ధభగవానుని సేవలోఁ గడచి పోవుచున్నది. ఇట్టి యసహ్యాకరసంభాషణము మీవంటివారి వాక్కున నెంతమాత్రమును శోభించుట లేదు" అనియెను.

దేశా—(కన్నులు మూసికొని) తరళా! ప్రేమభరముచే నే నడుగంటిపోవుచున్నాను. నే నెవ్వఁడనైననేమి? ఎంతవాఁడ నైననేమి?

నాజీవితములను నీచరణములపై నర్పించి యుంటిని. నీవాదరింపవేని నేనాతుచ్ఛప్రాణములను విసర్జించి వైచెదను.

తరళ తనలో నవ్వుకొనఁ దొడంగెను. ఆప్రాణియందుఁ గామరోగలక్షణము లస్పష్టముగా నిమిడి యున్న ట్లామె గ్రహించెను. తరళ యేమియు మాటాడక చిత్రప్రతిమవలె నిలిచియుండుటం గాంచి దేశానందుఁడు తటాలున నేలపైఁ జాగిలఁబడి యామెచరణములను బట్టుకొని భావనాపరవశుఁడై "చెప్పుము తరళా! చెప్పుము! నన్ను స్పృశించుచు శపథపూర్వకముగాఁ జెప్పుము!" అని వేడుకొనఁ దొడంగెను.

తర—ఆచార్యా! ఇదియేమి? మీవంటివారిట్లు చేయవచ్చునా? ఎంత యపచారము! విడువుఁడు! నాపాదములను విడువుఁడు! అయ్యో! ఇది రాజమార్గముగదా!

అని పలుకుచు నామె మెల్లఁగాఁ దనచరణముల నాతని చేతి నుండి విడిపించుకొనియెను.

దేశా—(వస్త్రముపై ధూళిని దులుపుకొనుచు) చేయుము! శపథము చేయుము! శీఘ్రముగా—

తర—ఏమని శపథము చేయవలయును?

దేశా—మిమ్ము దూరము చేయనని శపథము చేయుము!

తర—ఆచార్యా! మీరిప్పుడు చెప్పినమాట యతి మహత్తరమైనది. ఆకస్మికముగ నొక్కసారిగా నేనెట్లు ప్రత్యుత్తరమీయఁగలను. నేను సంపూర్ణయౌవనవతినై యున్నాను. మఱియునిది వసంతకాలము! ఇట్టిసమయమున నేనొక్కనియొద్ద శపథపూర్వకముగా నెట్లు కట్టువడి యుండఁగలను?

దేశా—(తనలో) కాంతలందఱు నిట్టివారే. నేనిప్పు డధికముగాఁ దీవరించినయెడల సర్వనాశన మైపోవును. కొంతకాలము

వఱకు నోపికపట్టి యుండుటవలన నష్టమేమున్నది? ఈమె నన్నుఁ దప్పిం చుకొని యెక్కడకుఁ బోఁగలదు ? ఎక్కడకుఁ బాఱిపోయినను మరల నీమె జినానందునికడకు రావలసినదేగదా!

తరళఁ గూడఁ దనలో "అసహాయులకు భగవంతుఁడే సహాయుఁడు. నేను మహాగర్వాంధనై నిన్ను విడిపింపనిచో నాపేరు తరళగాదు" అని వసుమిత్రునితో శపథపూర్వకముగాఁ జెప్పి యుంటిని. ఏయుపాయముచే నాతని విడిపింపఁగలనో నాకేమియును దోఁచుట లేదు. నిరాశ్రియుల కాశ్రయుఁడగు పరమేశ్వరుఁడే నాకీమార్గమును జూపియున్నాఁడు. ఈవృద్ధకవీశ్వరుని సహాయసంపత్తిమూలముననే నేనా వసుమిత్రుని బంధముక్తునిం గావింతును. ఈతని నెక్కింతతడ వాడించితినా నాకార్యమవలీలగా నెఱవేఱఁ గలదు. ఈతని లోఁబఱచుకొన్నచో నెట్టియాటంకమును లేకుండ సంఘారామమునకుఁ బోవుటకు నాకవకాశము కలుగును. ఆపిమ్మట నీతని నాసపెట్టి యేయుక్తిచేనైనను వసుమిత్రుని గారాగృహవిముక్తునిం గావింతును" అని యాలోచించుకొనుచుండెను.

తరళ యేమియు మాటాడకుండుటచే దేశానందుఁ డామెం గాంచి "తరళా ! నీహృదయమునం దేదియో యాలోచనసభ జరగుచున్నట్లున్నది." అనియెను.

తరళ—మీలోపల నేవిచారణ యగుచున్నది ?

దేశా—నీ విచారణయే—

తర—నేను నావిషయమే యాలోచించుచున్నాను.

దేశానందుఁడు తరళహస్తమును గట్టిగఁ బట్టుకొని యుత్కంఠతో "నిజమేనా? తరళా ! నిజమే చెప్పితివా ? చెప్పుము! చెప్పుము! నావీనులు పవిత్రము లగుఁగాక !" అనియెను.

తర—ఇదేమియాచార్యా ! విడువుఁడు నాచేయి విడువుఁడు. తటాలున నీయవస్థలో నిక్కడ కెవ్వరైన వత్తురేమో !

దేశానందుఁ డదరిపడి హతాశుఁడై తరళహస్తమును వదలి వైచి "తరళా ! సరేకాని—నామాటకు నీవెప్పుడు ప్రత్యుత్తర మిచ్చెదవు ?" అనియెను.

తర—చెప్పు.

దేశా—నిజమేనా ?

తర—నిజమే—

దేశా—సరే. ఇఁకఁ బొమ్ము! నిన్నింటివఱకును దీసికొనిపోయి విడిచి నేను మరలిపోయెదను.

తర—అట్లయినచో మీరు ముందునడువుఁడు.

దేశానందుఁడు ముందు నడచుచుండెను. కొలఁదిసేపటిలో దూరమున నగరమునందలిదీపప్రకాశము కానవచ్చెను. నగరమునఁ బ్రవేశించినంతనే తరళ చింతలన్నియును వదలిపోయెను. మార్గమధ్యమునం దేయుక్తిచేతనో యాతని మరలించి పంపవలయు ననియు, నట్లు చేయకున్నచోఁ దననివాసమాతనికిఁ దెలిసిపోవు ననియు, నందువలనఁ దనప్రయత్నమున కెప్పుడైన భంగము కలుగకపోదనియుఁ దరళ భావించుకొనియెను.

అట్లు భావించుకొనుచు నామె కొంతదూర మరిగి "ఆచార్యా! ఇఁక మీరు రావలదు. వెనుకకుఁ దిరుగుఁడు ! మీవంటియౌవనపురుషునితో రాత్రివేళ నొంటిగా నేనుండుటఁ జూచినచో నెవ్వరికైన ననుమానము కలుగకుండునా ?" అనియెను.

తరళ తన్నుఁదరుణపురుషుఁ డనియే నిజముగ భావించుచున్నదని నిశ్చయముగాఁ దెలియుటచే దేశానందునకుఁ బట్టరానిసంతోషము కలిగెను. అతఁడాయానందావేశమున నొడలుమఱచియుండుటం గాంచి తరళ యాచీకటివేళ నంధకారములోఁ జటాలునఁ దప్పించుకొని యెక్కడనో దాఁగిపోయెను. ఎంతపరిశోధించినను దేశానందున కామెజాడయే యగపడదయ్యెను.



## పదుమూఁడవప్రకరణము.

మధ్యాహ్నకాలము. సార్వభౌముఁడు కొలువుదీర్చియుండెను. చక్రవర్తి యుచితవేషముతో సభాభవనమున భద్రాసనాసీనుఁడైయుండెను. నాగరికులు తమతమవిన్నపములు ప్రభువునకు విన్నవించుచుండిరి. ఆవిశాలసభామందిరమున నలుదెసలను ముఖ్యాధికారులు నమాత్యులును దమతమయాసనముల నలంకరించి యుండిరి. నాగరిక ప్రముఖులును, జమీాదారులును వారిచెంతనే కూర్చుండి యుండిరి. అందఱకును వెనుకఁ బౌరులు గుమిగూడి యుండిరి.

చక్రవర్తివదనమండలమునం దెంతమాత్రమును బ్రసన్నభావము గనఁబడుటలేదు. మహాసేనగుప్తచక్రవర్తి స్వభావముచేతనే చింతాశీలుఁడు; మఱియు స్థానేశ్వరరాజసందర్శనమైనదాదిగా నాతని చింతాప్రభావము క్రమాభివృద్ధిం గాంచఁదొడంగెను. సింహాసనదక్షిణపార్శ్వమున వేదికక్రింద గుప్తసామ్రాజ్యముఖ్యామాత్యుఁ డగుహృషీకేశవర్మ దర్భాసనాసీనుఁడై విరాజిల్లుచుండెను ఆతనివెనుక మహాధర్మాధ్యక్షుఁడగు నారాయణశర్మ యొకపీఠమునఁ గూర్చుండి యుండెను. ఆయిరువురకును వెనుక మహాదండనాయకరవిగుప్తుఁడును, మహాబలాధ్యక్షుఁడగుహరిగుప్తుఁడును కవచసేనాధికారియగుమహానాయక రామగుప్తుఁడును,మున్నగుసామ్రాజ్యప్రధానాధికారులాసీను లైయుండిరి. ఈయధికారులందఱును వయోధికులే—వారినిలకుంతలము లన్నియును రాజసేవలోనే పలితము లైపోయినవి. వీరందఱును సార్వభౌమవంశీయులే. సింహాసనమునకు రెండవవైపున సామ్రాజ్యమందలి తరుణాధికారులుండిరి. వైయురుఁగుపై నున్నతప్రాచీనవంశసంభూతు లగు సరదారులు, అమీారులు, ఉమ్రావులు మొదలగువారి కేర్పడియుండు పీఠములు

శూన్యములై యుండెను. ఏవియోగొప్పయుత్సవసమయములందుఁ దక్క వారెల్లరును రాజసభ కేతెంచు నాచారము లేదు.

సభామండపచతుర్ద్వారములకడను సేనానాయకులు రక్షణకృత్యములను నిర్వహించుచుండిరి. ఇంతలో యువరాజశశాంకునిభుజపైఁ జేయివైచి స్థూలోన్నతశరీరుఁడును, యోధవేషధారియు నగునొక వృద్ధుఁడు గంగాద్వారమార్గమున సభాభవనమునకు వచ్చుచుండుట నుత్తరద్వారముకడనున్న ప్రతీహారి కనుంగొనియెను. ఎనిమిది తొమ్మిదియేండ్లప్రాయంపుబాలిక యావృద్ధునికుడిచేతివ్రేలిని బట్టుకొనియుండెను, ఆతనివెనుక నొకయువకుఁడుండెను. ఈదృశ్యముంగాంచి మహాప్రతీహారి యాశ్చర్యచకితుఁడయ్యెను. ఔను! ఆదృశ్య మాశ్చర్యకరమైనదే! ఏమన—సామాన్యుల కీనదీతీరమార్గమునుండి సభాభవనమునఁ బ్రవేశించుట కవకాశము లేదు. రాజ్యమందలియున్నతాధికారులును* సార్వభౌముఁడును దక్క నితరు లీమార్గమున నడవరు. ఆగంగాద్వారమున వచ్చుట కన్యుల కధికారమే లేదు. అధికారము కలవారైన నెన్నఁడు నేకతము పాదచారులై వచ్చుట జరగి యుండ లేదు. అట్టివారు మహాడంబరముతో నేనుగులను గుఱ్ఱములను, వాహనములను నధిరోహించి వచ్చుచుండుట యాచారము. వారివెంట సంగరక్షకసైన్యముకూడ నుండును. కాని యట్టివారిలో నెవ్వరునుగూడ నిదివఱ కీవిధముగా నింత ప్రేమతో—వాత్సల్యముతో—యువరాజశశాంకుని దేహమును స్పృశించి యుండుట యెవ్వరును జూచియుండ లేదు. అదియే యాశ్చర్యకారణము!

అట్లు సభామందిరమున కేతెంచుచుఁ ద్రోవలో నావృద్ధుఁ డేమియో చెప్పుచుండెను. యువరాజశశాంకుఁ డేకాగ్రచిత్తముతో నామాటల నాలకించుచుండెను. ప్రతీహారిగాని, వారినాయకుఁడుగాని యాశ్చర్యముతోఁ దమ్ముఁ జూచుచున్నట్లు వారెంతమాత్రము నెఱుంగనే యెఱుంగరు.

అప్పుడు వృద్ధుఁడు“ యువరాజా ! నేను కామరూపమునుండి మరలివచ్చినప్పు డీమార్గముననే సభామందిరమునఁ బ్రవేశించితిని. ఆహా ! ఆదిన మూనాఁడే గతించిపోయినది. అప్పుడు నేను కామరూపప్రభుఁడగుసుస్థిరవర్మను శృంఖలాబద్ధునిం గావించి తీసికొని వచ్చితిని. ఆసమయమున నాగరికు లత్యంతోత్సాహముతో, గర్వముతో జయధ్వనులం గావించిరి. సంగ్రామమున గాయములు తగిలినమీతండ్రిగా రప్పుడు పల్లకి నధిరోహించి వచ్చుచుండిరి. యువరాజా! అప్పటికి మీ రుదయించియుండలేదు. అప్పటి కీసామ్రాజ్యమున కింతటి దుర్దశ సంభవించియుండలేదు ; ఇంతశిథిలమై యుండలేదు. అప్పుడు నేను నిశ్చయముగనే మహానాయకుఁడ నైయుంటిని. నేనప్పుడు పిడికెడు గోధుమగింజలకై రోహితాశ్వదుర్గప్రాంతమునందలి ప్రతియూరను భిక్షమడుగుకొనుచుండుట లేదు.”

అని పలుకుచుండఁగా వృద్ధునికంఠము రుద్ధమైపోయెను. శశాంకుని వినీలవిశాలనయనము లశ్రుజలపూరితము లయ్యెను—వారు మెల్లమెల్లఁగా సభాభవనతోరణముకడ కేతెంచిరి. అప్పుడు ప్రతీహారనాయకుఁడు యువరాజునకుఁ బ్రణమిల్లి యధికనమ్రభావముతో “మహాప్రభూ ! ఈవృద్ధయోధవీరుఁడెవ్వరో దయయుంచి యానతిచ్చెదరా?” అని ప్రార్థనాపూర్వకముగఁ బ్రశ్నించెను.

యోధు—(విన్నఁదనముతో నా పేరు యశోధవళుఁడు. యువరాజభట్టారకపాదీయమహానాయకుఁడను.

ఈమాట వినినంతనే ప్రతీహారనాయకుఁడు భయవిస్మయాకులుఁడై రెండడుగులు వెనుకకు జరగెను. త్రోవను నడచుచున్న పాంథున కాకస్మికముగా విషసర్పము కనఁబడినచో నెట్టివిలక్షణావస్థకలుగునో యీనాయకున కప్పు డట్టియవస్థయే కలిగెను. వానియవస్థం గాంచి యశోధవళుఁడు మందహాసముగావించెను.

ఇంతలోఁ బ్రతీహారులలోనియొకవృద్ధుఁడచ్చటికి వచ్చి యశోధవళునివంక బాగుగఁ బరికించి త్రోడనే తనయొఱనుండి కరవాలమును జరాలునఁ దీసి యాఖడ్గాగ్రముతోఁ దనకపాలమును స్పృశించుచు నుచ్చైస్స్వరమున "మహానాయకునకు విజయమగుఁగాక! మాళవకామరూపదేశములలో నేను మహానాయకు లగువీరావక్కను నిలిచి యుద్ధము చేసినవాఁడను!" అనియెను.

ఆతనిజయధ్వని నాలకించి యుత్తరతోరణముకడ నున్నవారందఱును జయధ్వనులం గావించిరి. యశోధవళదేవుఁడు ముందఱికరిగి యావృద్ధసైనికుని గాఁగిలించుకొనియెను. అప్పుడు మరల నొక్కసారి జయధ్వని యయ్యెను. అనంతరము యువరాజును, యశోధవళదేవుఁడును సభాభవనమునకుఁ బోయిరి. ప్రతీహారసేనానాయకుఁడుమాత్రము విస్మయస్తంభితుఁడై నిలిచినచోటనే నిలువఁబడిపోయెను.

సభాభవనతోరణమున కెదుట నిరువురుదండధారు లుండిరి. వారు యువరాజుం గాంచినంతనే ప్రణమిల్లి మెల్లఁగా నావృద్ధునిం గూర్చి ప్రశ్నించిరి.

తత్క్షణమే వారిలో నొకఁడు సభాభవనమధ్యభాగమునకుఁ బోయి బిగ్గఱగా "పరమేశ్వర, పరమవైష్ణవయువరాజభట్టారకపాదీయమహానాయకయశోధవళదేవులవారు సార్వభౌమసందర్శనమునకు దయచేసియున్నారు" అని హెచ్చరించెను.

అప్పుడు సార్వభౌముఁడు సింహాసనమునం దొకయోరకొత్తగిల్లి కూర్చుండి యొకనాగరికునివిన్నపము నాలకించుచుండెను. సింహాసనవేదికక్రింద నొకలేఖకుఁడు నిలిచి చక్రవర్తియాజ్ఞలను వ్రాయుచుండెను. యశోధవళదేవునినామము చెవులఁ బడినంతనే సార్వభౌముఁ డులికిపడి లేచి కూర్చుండెను. అట్లాకస్మికముగ లేచుటవలన లేఖకుఁడు భయముచే నులికిపడుటయు, నాతనిచేతియందు లేఖనియుఁ దాలపత్రి

మును గ్రిందఁబడిపోయెను. అది గని మహాధర్మాధ్యక్షుఁడగు నారాయణవర్మ బొమలు ముడివైచెను. పాపహా లేఖకుఁడు పడఁబోయి యొకపీఠమును గట్టిగాఁ బట్టుకొనియెను. కావుననే యాతఁడు బ్రదికి పోయెను.

అప్పుడు చక్రవర్తి దండధరునింగాంచి "ఏమంటివి?" అని ప్రశ్నించెను.

దండ—పరమేశ్వరపరమవైష్ణవ—

చక్ర—వింటిమి—యువరాజుతో వచ్చినవా రెవ్వరు?

దండ—రోహితాశ్వదుర్గమహానాయక యువరాజభట్టారక పాదీయయశోధవళ—

చక్రి—ఎవరు? యశోధవళుఁడే!

దండ—చిత్తము.

అప్పుడు మహామంత్రిహృషీకేశవర్మ నారాయణవర్మంగాంచి "మహాధర్మాధ్యక్షా! ఆవచ్చినవారెవ్వరు? సార్వభౌము లాకస్మికముగా నిట్లేలయులికిపడిరి?

నారాయణవర్మ యూర్ధ్వవదనుఁడై యున్నమాటలను వినుచుండెను. మహామంత్రిప్రశ్న యాతనికి వినఁబడనే లేదు.

చక్రి—చాలుఁ జాలు! ఇట్లగుట యెన్నటికిని దటస్థింపదు. రోహితాశ్వదుర్గాధిపతి యశోధవలదేవుఁ డెంతకాలముక్రిందటనో శాశ్వతవిశ్రాంతి నందియుండును. రామగుప్తా! మీరు పోయి జాగ్రత్తగఁ బరికించి రండు! నిశ్చయముగా నాతఁ డిప్పుడు రోహితాశ్వదుర్గము నాక్రమించియున్న కృత్రిమపురుషుఁ డై యుండవచ్చును.

రామగుప్తుఁడు లేచి యుత్తరతోరణముకడకు బయలుదేఱెను. దండధరుఁ డాతని వెంటనే పోయెను. కాని వారెంతవఱకును బోనక్కఱయే లేకపోయెను. యువరాజు భుజముపైఁ జేయివైచి యశోధ

వళుఁడు మెల్లఁగ ప్రోకులికే వచ్చుచుండెను. అతనిఁగాంచి రామగుప్తుఁడు నిశ్చేష్టుఁడై నిలువఁబడి పోయెను. కేవల మొక్కక్షణకాలము మాత్రమే—అనంతరము సామ్రాజ్యనౌకాసేనామహానాయకుఁ డగు రామగుప్తుఁడు చేతాలునఁబోయి దీనహీనుఁ డగునావృద్ధునిచరణములఁపై వ్రాలెను. అది గని తక్కినసంగతు లేమియు నెఱుంగకున్నను నాగరికులందఱు నొక్కపెట్టున నాకసము ప్రతిధ్వనించునట్లు జయధ్వనులం గావింపనారంభించిరి. ఎంతప్రయత్నించినను దండధరులు వారిని వారింపఁ జాలకుండిరి. ఆధ్వని విని సార్వభౌముఁ డావేశముతో లేచి నిలువఁబడియెను. అంత సభాసదులందఱు నొక్కసారిగా లేచి నిలిచిరి. అట నున్న తరుణరాజపుత్రుల కందఱకు నది యొకవిచిత్ర దృశ్యముగాఁ దోఁచెను—స్థూలోన్నతశరీరుఁ డగు నొకవృద్ధుఁడు యువరాజుభుజముపైఁ జేయివైచుకొని కలసి వచ్చుచుండఁగా సర్వనౌకాబలాధ్యక్షుఁ డగురామగుప్తుఁడు సామాన్యసైనికునింబోలి వారి ననుసరించి వచ్చుచుండెను. అది గని వారియాశ్చర్యమునకు మేరయే లేక పోయెను.

హృషీకేశవర్మ కచ్చటిసంగతు లేవియును దెలియకుండుటచే నాతఁ డత్యాతురుఁడై యావృద్ధునిం గాంచి కంపితపాదములతో వేదిక కడకు వచ్చి నిమిషములో నాశ్చర్యావిష్టుఁడై "యశోధవళుఁడు మరణించె నని యెవ్వరు చెప్పినారు?" అని కేకవైచెను.

యశోధవళదేవుఁడు వినమ్రుఁడై యాతనికి నమస్కరింపఁబోయెను. మహామంత్రియగు హృషీకేశవర్మ యాతని వారించి గాఢాలింగనముం గావించెను. అది చూచి నాగరికులందఱును మరల నత్యుచ్చస్వరముతో జయధ్వనులం గావించిరి.

అందఱు నాశ్చర్యనిమగ్నులై యుండిరి. ఆనందావేగప్రకంపితములగుపాదములతోఁ జక్రవర్తి వేదికనుండి క్రిందికి దిగియెను. జన

కుఁడు కన్నులఁ బడినంతనే యువరాజు సాష్టాంగప్రణామముం గావించెను. సార్వభౌముఁడు చూడనైనలేదు — ఛత్రచామరధారు లాతని వెంటనే దిగిరాసాగిరి. కాని మహాబలాఢ్యుఁడగు హరిగుప్తుఁడు సంజ్ఞ చేయుటయు వారచ్చటనే యాఁగిపోయిరి.

సార్వభౌమాగమనముం గాంచి హృషీకేశరామగుప్తు లొకప్రక్క కొదిగిల్లిరి. యశోధవళదేవుఁ డొఱనుండి కరవాలమును బైకిఁ దీయుచుండెను. ఇంతలోనే చక్రవర్తి యతిత్వరితముగ వచ్చి యతిదృఢంబుగ నాతనిం గౌఁగిలించుకొనియెను. ఈయద్భుతదృశ్యముం గాంచి రాజాధికారులు, సభాసదులు, నాగరికులు నెల్లరు నానందాతిరేకముచే నైకకంఠ్యముగ జయజయనినాదములం గావింపఁదొడంగిరి.

సార్వభౌముఁడు యశోధవళునిం గాంచి యానందగద్గదస్వరముతో "మీరు నిజముగా యశోధవళదేవులేగద?" అనియెను.

యశోధవళుఁడు మౌనముతో నశ్రువులను వెలార్చుచుండెను. అట్లె హృషీకేశవర్మయు, రామగుప్తుఁడును నశ్రుజలపూరితనయనులై యుండిరి. హరిగుప్తుఁడు ముందటికి వచ్చి సార్వభౌముని వెనుక నిలిచెను. యువరాజశశాంకుఁడు దవ్వుల నిలిచి కరుణారసాత్మకం బగునీయభినవాద్భుతదృశ్యమును స్థిరదృష్టితోఁ దిలకించుచుండెను.

సార్వభౌముఁడు యశోధవళునితోఁ గలసి మెల్ల మెల్లఁగ వేదికకడ కేఁగెను. యువరాజు, హృషీకేశవర్మ, రామగుప్తుఁడు, నారాయణశర్మ మొదలగుముఖ్యరాజాధికారులు వారిని వెంబడించిరి. సార్వభౌముఁడు వేదికాసోపానముపై నడుగిడినంతనే యశోధవళదేవుఁడు చటాలున నట నాఁగి "మహారాజాధిరాజా! సింహాసనము నధిరోహింపుఁడు!" అనియెను.

యశోధవళదేవుఁడు వేదికపైఁ దనప్రక్కను గూర్చుండవలయునని చక్రవర్తి కోరెక. కాని యెంత చెప్పినను నాతఁ డందులకంగీక

రింపఁ దయ్యెను. చక్రవర్తి సింహాసనాసీనుఁ డైనపిమ్మట యశోధవళుఁడు యువరాజు చేయిపట్టుకొని యాతని వేదికపై నెక్కించెను. యువరాజు సింహాసనము నలంకరించెను. పిమ్మట యశోధవళుఁడు సింహాపీఠసమక్షమున నిలువఁబడి తనకరాసి నొఱనుండి పైకిఁదీసి తనకపాలమునకు సోఁకించి దానిని సార్వభౌమునిచరణసన్నిధిని నివేదించెను. మరల సభలో జయధ్వనులు చెలరేఁగెను; అప్పుడు చక్రవర్తి యాకృపాణముం దీసి దానిని దనకపాలమునకుం దాఁకించి యశోధవళునకు మరల నిచ్చివేసెను.

పిమ్మట ఖడ్గపాణి యగుయశోధవళుఁడు యువరాజుం గాంచి “మహారాజకుమారా! పూర్వమీయశోధవళుఁడు సార్వభౌమసందర్శనముం గావించునప్పు డీసింహాసనము శూన్యమైయుండెడిది. నేఁటికిఁ జాలకాలమునుండియు నాకు యువరాజకుమారున కభివాదనముం గావించుభాగ్యము లభించుట లేదు. మీతండ్రిగారి చిన్నతనమున వారు యువరాజకుమారులై యుండి యీసింహాసనంమలంకరింపఁగా నేనొక్కసారిమాత్రము దర్శించియుంటిని. కుమారా! మరల నిప్పు డట్టి మహాభాగ్యముం గాంచఁగలిగిన యతివృద్ధసేవకుఁ డగు నీయశోధవళునిప్రణామమును స్వీకరింపుము” అనియెను.

ఇట్లు విన్నవించి యాతఁడు తనకరవాలమును గపాలమున కద్దుకొని శశాంకునిచరణసమీపమునం దుంచెను. యువరాజు దానినందుకొని సింహాసనమునుండియు, వేదికనుండియుఁ గ్రిందికి దిగి వచ్చి వినయవినమితుఁడై యశోధవళునకు నమస్కరించెను.

తత్క్షణమే నలుదెసలనుండియు సహస్రముఖములకో జయధ్వనులు చెలరేఁగెను. సార్వభౌమునిచింతాపూర్ణముఖమండలముపైఁ బ్రఫుల్లభావము గోచరించెను. ఆతఁడు శిరఃకంపము చేయుచు “ధన్యుఁడనైతిని” అనియెను.

వృద్ధయశోధవళదేవుఁడు యువరాజు నెత్తి కౌఁగిలించుకొని పలుమాఱు లాతనిమస్తకమును జుంబించుచు మరల నాతని సింహాసనముపైఁ గూర్చుండఁ జేసెను. అనంతర మాతఁ డాసింహాసనమున కెదుట నిలిచి "మహారాజాధిరాజా! ఇంతకాలమునకుఁ దరువాత "బరమపూజ్యులగు సార్వభౌములను నేను సందర్శింపవచ్చిన కారణమును విన్నవించెదను. నాయేకపుత్త్రుఁ డగుకీర్తిధవళుఁడు మేఘనాదపరతీరమున సామ్రాజ్యకార్యమును సాధించుటకై తనప్రాణములను విసర్జించెను. ఆతని కొకతనయ యున్నది. ఆమెను బోషించుటకైనను నాకిప్పుడు శక్తి లేకుండఁబోయినది. ఏహస్తముచే సామ్రాజ్యచిహ్నమగుగరుడధ్వజమును ధరియించి నేననేకవిజయయాత్రలలోఁ బ్రముఖుఁడనై యుంటినో, యాహస్తముతో రోహితాశ్వదుర్గపర్వతవాసులగు ప్రజలయొద్ద భిక్షలను గొనుటకూడ నాకతికష్టమైపోవుచున్నది. ఏదేనొకనవీనోద్యోగనిర్వహణమునకుం గడంగుద మనిన వయసుచెల్లిపోయిననే నందుల కెంతమాత్రము నర్హుఁడనుగాకుంటిని, నాకీర్తిధవళుఁడు సామ్రాజ్యసేవయందే తనదేహప్రాణముల నర్పించెను.

అట్టిరాజభక్తునిబిడ్డపోషణమునకై సార్వభౌముఁ డన్నపానాదుల నొసంగు నేర్పాటు గావించినచో నీవృద్ధయశోధవళుఁడు నిశ్చింతుఁడు కాఁగలఁడు! సామ్రాజ్యమున కిప్పటికిని దరవారితో నావశ్యక మున్నది. ఈవృద్ధునిబాహువులలో నింకను సామర్థ్యమున్నది; కరమునఁ గరవాలముం దాల్చుటకు యోగ్యత యున్నది. ఈతనికి రెండు మెదుకులయున్నమునకుఁ గఱవు వచ్చునను భయము లేదు. అరణ్యమృగముల వేఁటాడి యామాంసముతో నీవృద్ధుఁ డెట్లో తనశేషజీవితమును గడుపుకొనఁగలఁడు. కాని—మహారాజా! కీర్తిధవళునిపుత్త్రిక పసిబాలిక. ఆబాలిక మాంసాహారము భుజింపదు.

ఆబిడ్డకొఱకు నేనిప్పుడు సార్వభౌముని నాలుగుగోధుమగింజలకు భిక్షమడుగుచున్నాను. ఇంతయేల? తినుట కొక్కమెతుకైన నింట లేకుండుటచే నేను నామృతపత్నిరత్నవలయమును విక్రయింపవలసినవాఁడ నైతిని. నాపురాతనసేవకు లిదియంతయుం గాంచి భిక్షాప్రవృత్తినవలంబించి కొంతధనము సేకరించి నాకిచ్చియున్నారు. ఆధనముతో నేనారత్నవలయమును విడిపించుకొని యిప్పు డీపాటలీపుత్రమునకు వచ్చియుంటిని.—మహారాజాధిరాజా! ఒకమనవి. నాపౌత్రి యగు లతిక రాజగృహమునం దొకదాసిగా నుండఁగలదు. ప్రతిదినమును ప్రాతస్సాయంకాలముల నామెకొక్కకడి యన్నము దొరకినఁ జాలును! కాని, మాంసము మాత్రి మామెకుఁ బనికిరాదు. ఇన్నియేండ్లు గడపిన యీయశోధవళుఁ డీమెకొఱకుఁ భిక్షాటనము సేయఁజాలఁడు. మాళవములోనిసంపద మంటిపాలయిపోయినది. వంగమునందలి రాఁబడి వమ్మయిపోయినవి. పుత్రవిహీనుఁ డగునీవృద్ధున కీబిడ్డకంటె నిక "నా" యనువా రెవ్వరును లేరు. ఈశానిపర్వతప్రాంతమునందలి కృషిజలకడ స్వామిభాగ మగుషష్టాంశమునుగూడ నడిగి తెచ్చువారు లేరు. పర్వతారణ్యప్రజల నదిమిపట్టి తెచ్చు సేవకు లొక్కరును లేరు. సార్వభౌమా! ధవళవంశము మహాశ్రీమంతమైనది కాని, యది యిప్పుడు నామమాత్రావశిష్టమైపోయినది. ఆయశోధవళుఁడు నిశ్చయముగా మరణించె ననియే చెప్పవచ్చును. రోహితాశ్వము శూన్యమైపోయినది. నేను యశోధవళుని ప్రేతమనుమాత్రమే—ఒక్కకడియన్నము నకైన గతిలేకుండ నీభూమిపై దినముల గడపుచున్నాను. నాకిప్పుడు దుర్గాధిపతిగా నుండుట కర్హత లేదు" అని మనవి చేసెను.

యశోధవళునికనతిదూరమున నాతని మనుమరాలిని జెంత నిడికొని వీరేంద్రసింహుఁడు నిలిచియుండెను. ఆతఁడప్పుడు యశోధవళునియింగితము నెఱింగి యాబిడ్డ నాతనియొద్దకుఁ దీసికొని వ

చ్చెను. యశోధవళుఁడు మనుమరాలిచేయి పట్టుకొని " అమ్మా! లతికా! మహారాజాధిరాజునకుఁ బ్రణమిల్లుము." అనిబోధించెను.

బాలిక సార్వభౌమునకు సాష్టాంగప్రణామముం గావించెను. వీరేంద్రసింహుఁ డామెవెనుక నిలువఁబడి వీరోచితవిధానమున జక్రవర్తి కభివాదనముం గావించెను.

అనంతరము యశోధవళుఁడు మరల "మహారాజాధిరాజా! ఈ బాలికయే నాకీర్తిధవళుని యేకపుత్త్రిక. ఈపసిపాప తండ్రి సామ్రాజ్యముకొఱకు వంగదేశసంగ్రామమునఁ బ్రాణత్యాగము గావించెను. ఈబిడ్డతల్లి వైధవ్యదుఃఖమును భరింపఁజాలక సతీజనోచితం బగుసహగమనము చేసినది నాకిప్పు డీబాలికను బోషించుసామర్థ్యము లేదు. ఈకుమారిపోషణభారమును సార్వభౌములే వహింపవలయును. అనాదికాలమునుండియు రాజ్యముకొఱకుఁ బ్రాణముల నర్పించినసైనికుల దారపుత్త్రాదులను సంరక్షించుభారమును సార్వభౌములే వహించుచుండిరి. నేనీవిశ్వాసముతో నే—ఈయాశతో నే-పితృమాతృవిహీనయగు నీయనాథబాలిక కొక్కకడియన్నము నిమ్మని మిమ్ము యాచించుచున్నాను!" అనియతికరుణముగ విన్నవించెను.

యశోధవళునిమాటలు వినుచున్నంతవఱకునుజక్రవర్తి కన్నులనుండి యశ్రుధారలు ప్రవహించుచునే యుండెను. ఆయశ్రుధారలచే ముడుతలువడినయాతనికపోలములు తడిసిపోవుచుండెను. యశోధవళుని విన్నపము ముగియుటకు ముందుగనే సార్వభౌముఁడు సింహాసనమును విడిచి చటాలున లేచి నిలువఁబడి గద్గదస్వరముతో "నా—బా—ల్యప్రాణ—మిత్ర—" అని యింక మాటాడఁజాలకపోయెను. కంఠస్వరము రుద్ధమైపోయెను. అప్పు డాతఁడు శోకనిశ్చేతనప్రేతమువలెఁ దటాలున సింహాసనముపైఁ గూలఁబడిపోయెను. సభామందిరమునందలి సభ్యులందఱును నిస్తబ్ధులై నిలువఁబడిపోయిరి.

అప్పుడు నారాయణశర్మ వేదికకడ నిలిచి 'సార్వభౌమా! నేఁడు సభాకార్యములు సాగుట కష్టముగాఁ దోఁచుచున్నది. ఆజ్ఞయైనచో వ్యాయామార్థులై వచ్చిన నాగరికులను బంపివైచెదను ” అని మనవి చేసెను.

చక్రవర్తి తనయంగీకారమును సూచించెను. యశోధవళుఁడింకను నేమియో మాటాడ నుపక్రమించుచుండ మహామంత్రి యగు హృషీకేశవర్మ యాతని వారించి తాను వేదికకడ కరిగెను.

సభామందిరము మెల్లమెల్లఁగ రిక్తము కాసాగెను. ఇఁక రాజకీయోద్యోగులుమాత్రమే యచ్చట మిగిలియుండిరి. అనుదినమును సభాకార్యములు ముగిసినతరువాత మంత్రిసభ సమావేశ మగుచుండు నాచార మున్నది. అందు ముఖ్యాధికారులుమాత్రమే కూడియుందురు.

అప్పుడు మంత్రి హృషీకేశవర్మ చక్రవర్తి నుద్దేశించి "నేఁడు మీరించుక యస్వస్థులైయున్నట్లగపడుచున్నారు. కావున నీదినమున నిఁక మంత్రిసభ సమావేశ మగుటగూడ వాంఛితము లేదు ”అనియెను.

చక్రి—నేఁడాలోచనాసభాసమావేశ మవశ్యముఁ గావలసియున్నది. సాయంకాలము సముద్రగృహమున సభ చేరవలయును. అత్యావశ్యకంబు లగుకార్యములు గలవు. ఇప్పుడిచ్చటికి రానియధికారులుకూడ సాయంకాలసభకు వచ్చునట్లు దూతలమూలమున వార్తల నందింపుము.

రామగుప్తుఁడు యశోధవళుని దనయింటికిఁ దోడ్కొనిపోవలయునని కుతూహలపడుచుండెను. యశోధవళుఁడుగూడ నాతనియాతిథ్యము నంగీకరించి చక్రవర్తియాజ్ఞను వేఁడుకొనియెను.

చక్రి—యశోధవళా! ఇంతవఱకు నీప్రశ్నకు—నీవిన్నప మునకు నేనెట్టిప్రత్యుత్తరమును జెప్పనేలేను. మీరు వాశ్రో రంమ! నేఁడు మీరు సామ్రాజ్యాధిపతులైతిరి.

అనంతరము సార్వభౌముఁడును, యశోధవళుఁడును, శశాంకుఁడును సభాభవనమునుండి వెడలిపోయిరి.

---

## పదునాల్గవ ప్రకరణము.

రాజభవనమునకు వెనుకభాగమునం దొకపుష్పవాటిక యున్నది. చాలకాలమునుండి యెవ్వరును శ్రద్ధతోఁ బరామర్శింపకుండుటచే నిప్పుడాయుద్యానమును రాజభవనాంగణమును నరణ్యప్రాయము లైపోయెను. కాని గంగాతీరమునందలిచిన్నతోఁటమాత్రము జాగ్రత్తగాఁ బోషింపఁబడుచుండుటవలన నిప్పటివఱకు నది యతిరమణీయముగానుండెను. ఈయారామమునం దుఁబూలచెట్లును, దీగలును దక్క మఱియేమియును లేవు. పుష్పవాటికకు నలుదెసలనున్న యావరణము లకడనున్న నానావిధంబు లగుపుష్పవల్లికలు విస్తరించి యాతోఁట యావరణమున దట్టముగా నల్లుకొని యుండెను. అందుఁ గొన్నిలతలు పుష్పవిలసితంబులును, గొన్నివల్లికలు నవకోమలసుందరపత్రపల్లవములచే వినమ్రములునైయుండెను. చతురంబగు నాపుష్పవాటికామధ్యమున నందందుస్ఫటికశిలానిర్మితంబు లగువేదికలు విరాజిల్లుచుండెను. వానినలువంకలను వివిధంబులగు పుష్పవృక్షము లుండెను. అవి యన్నియును గణనాతీతంబు లగురమణీయకుసుమగుచ్ఛంబులచేఁ బ్రఫుల్లములైయుండెను. ప్రభాతసమీరకుమారుఁడు గంగావక్షము నుండి లేచి మెల్లమెల్లఁగ నేతెంచి పుష్పతరుశాఖల నల్లలాడించుచు నయ్యారామప్రదేశమునంతను సురభిశీతలంబుగఁ జేయుచుండెను.

ఆమందానిలసంచాలనంబున ననంఖ్యాంబులగువివిధవర్ణకుసుమంబులు తరులతలనుండి క్రిందికి దిగజాఱుచు నాప్రదేశమునంతను సుందరప్రసూనశయ్యలచే నలంకరించుచున్నట్లుండెను. అంధకార మింకను బూర్తిగా నంతరించి పోలేదు. అది యుషఃప్రకాశమునకు భయపడి రాజభవనంబున మూలమూలలను, తరుషండముల మధ్యప్రదేశమునను నెట్టెటులో యింకను దాఁగియే యుండెను. సూర్యభగవానుఁడియసంఖ్యజ్వాలామయకిరణశరవర్షంబునం గాని యది పాతాళమువఱకు నను గంటిపోవదు.

అప్పు డాకస్మికముగాఁ బుష్పవాటికాకవాటము తెఱవఁబడియెను. అందుచే ద్వారమునకుఁ బైభాగమున నలమియున్న మాధవీలత కంపింపఁ దొడంగెను. ఆద్వారమునుండి యొకబాలిక తోఁటలోఁ బ్రవేశించెను. అళివినీలంబులగునామెకుటిలకుంతలములు వాయులహరీతరంగములపై నానందనృత్యము సేయుచుండెను. ఆమె యారామమునఁ బ్రవేశించి యందందు వెదకి చూచెను. ఎవ్వరును గనఁబడలేదు. అందుచే నామె వెనుకకు మరలి ద్వారముకడకు వచ్చి మూసినతలుపులను దెఱచుచుండ నింతలో ద్వారముకడకే తెంచి నిలిచియున్న మఱియొకబాలిక యుచ్చస్వరంబున నవ్వుచు “యువరాజా ! దొంగను బట్టుకొంటిని సుమా !” అనియెను.

ఆమాట వినఁబడినతోడనే ప్రథమబాలిక పరుగెత్తిపోవుటకుఁ బ్రయత్నించెను. కాని,నూతనబాలిక యామెను గట్టిగఁ బట్టుకొని పోనియదయ్యెను. ఇంతలో శశాంకమాధవగుప్తులు నవ్వుచుఁ బరుగుపరుగున నచ్చటికే వచ్చిరి.

శశాంకుఁడు మొదటిబాలికం గాంచి నవ్వుచు “చిత్రా! ఇట్టులొక్కపెట్టునఁ బరుగెత్తుకొని మాకంటె ముందుగా వచ్చితివేల ?” అనియెను.

చిత్రి యేమియు మాటాడలేదు. అప్పుడు రెండవబాలిక" చిత్రి కు గోపము వచ్చినది !" అనియెను.

శశాం—(నవ్వుచు) చిత్రి యలిగినదా? ఎవ్వరిమీద ?

బాలి—మీమీద నే.

శశాం—నామీదనే ? ఏల ?

బాలి—మీరు నాకు బూవులు గోసియిచ్చుటకొప్పుకొంటి రని—

శశాంకుడు పకపక నవ్వనారంభించెను. క్రోధలజ్జావివశమై యున్న చిత్రివదనమండలము కషాయిత మయ్యెను. ఆమె క్రోధముం గని రెండవబాలిక యించుక లజ్జించి" కుమారా! నడువుము; మనమావైపునకు బోయి పూవులను గోసికొందము రండు !"అనియెను.

అరనిముసములో నాబాలికయు మాధవుడు నాపుష్పవాటి కం బ్రవేశించి యదృశ్యులైరి. వారు వెడలిపోయినతరువాత శశాంకుడు "చిత్రా! నీవు నాపై నేల కోపించితివి ?" అనిప్రశ్నించెను.

చిత్రి ప్రత్యుత్తర మీయక యే రెండడుగులు వెనుకకు జరిగెను. శశాంకుడు ముందటికి బోయి యామెచేయి పట్టుకొనబోయెను. కాని యామె తటాలున నాతనిచేయి విదలించికొనియెను. తుదకెట్లో శశాంకు డామెపాణిగ్రహణముం గావించెను.

శశాం—చిత్రా! నేనేమిచేసితిని ? నాపైనితంకోపమేల?

చిత్రి యవ్వలిమొగమై యేడువ నారంభించెను. శశాంకు డామెనోదార్చి శాంతింపజేయుటకై చాలసేపటివఱకును బ్రయత్నించెను. ఎంతయో ప్రార్థించినపిమ్మట జిత్రి మృదుస్వరముతో" మీరు—మీరు—లతికకు— బూవులు గోసి యిచ్చెద నని యొప్పుకొంటిరట గాదా ?" అనియెను.

శశాం—వెఱ్ఱిదానా! ఇదియా నీకోపకారణము? పాపము, లతిక మనయింట రెండుమూడుదినము లుండుటకై వచ్చినయతిథిస్వరూపిణి.

ఆమెతో నాడుకొనవలదా ? ఆమె నెల్లవిధముల సంతుష్టిపఱచుచుం డుమని యమ్మ నాకాజ్ఞాపించినది. అదిగాక లతిక మనయింటికి వచ్చి యున్న పరాయిబాలిక. మరియాదకొఱ కామెతో నాడుచుఁ బాడుచు నామెను గౌరవింపకున్నచో బాగుగ నుండునా ? నీవే చెప్పుము!

చిత్రముఖమండల మతిగంభీర మయ్యెను. ఆమె విరక్తస్వర ముతో " సరే — మీరుమరియాద చేయవలసినదే — కాని యామెకుఁ బూవులు గోసిపెట్టి యూడిగము సేయుటకు మీరేల యంగీకరింపవ లయును ?

కుమారుఁ డీప్రశ్న కేమని యుత్తరమీయఁగలఁడు ? ఆతఁడు చిత్రి నూఱడించుట కెన్నియోప్రయత్నములను గావించెను. కాని యామె కూఱడిల్లియుండుట కెంతమాత్రము నిష్టము లేదు కాఁబో లును !

శశాంకుఁ డీక నిరుపాయుఁడై " సరే ! అట్లయిన నేను నీకే పూవులను గోసియిచ్చెదను. లతిక కొక్కపూవైనను నీయను. ఇంకను గోప మెందులకు ?" అనియెను.

ఇప్పటికిఁ జిత్రిహృదయ మొక్కించుక శాంతించెను. ఆపుష్ప వాటికయందు వికసించినపూవు లన్నియును గోయవలయునని యాపి ల్లలందఱును త్వరపడుచుండిరి. అందఱును దాముగోసినకుసుమముల నన్నిటిని దెచ్చి యారామమధ్యమునందున్నయొక వేదికపైఁ గుప్పవో యుచుండిరి. శశాంకుఁడుమాత్రము తాను గోసినపుష్పములను జిత్రి యొడిలోఁ బోయుచుండెను. మాధవుఁడు లతికయొడిలోఁ బోయు చుండెను.

ఇంతలోఁ బుష్పవాటికాద్వారముకడనుండి " ఓరీ ! కుమారుఁ డిచ్చటనేఁ యున్నాఁడు ! ఇటు రమ్ము !" అనుమాటలు వినవచ్చెను.

శశాం—ఎవరక్కడ?

"యువరాజా ! నేను—అనంతుఁడను.—నరసింహుఁడు మీకొఱకు వెదకుకొనుచున్నాఁడు !"

అని యిరువురుబాలకు లాద్వారమును దెఱచుకొని లోపలఁ బ్రవేశించిరి. వీరిలో నొకఁడు మాప్రియపాఠకులకుఁ బరిచితుఁడే—అతఁడు చరణాద్రిదుర్గాధిపతి యగుయజ్ఞవర్మతనయుఁ డనంతవర్మ—రెండవవాఁడు చిత్రకు సోదరుఁ డగునరసింహదత్తుఁడు !

నర—యువరాజా ! ఇక్కడ నేమి చేయుచున్నారు?

శశాం—(నవ్వుచు) నీసోదరికి దాస్యము చేయుచున్నాను. రోహితాశ్వదుర్గమునుండి రెండుమూఁడుదినములక్రిందట లతిక మాయింటికిఁ జుట్టమై వచ్చినది. కావున నేనామెకుఁ బూవులను గోసి యిచ్చి మరియాద చేయఁ దలఁచితిని. కాని యట్లు చేయుట నీసోదరి కిష్టము లేకపోయినది. అందుచే నేనిట్లు చేయవలసివచ్చినది. మాధవుఁ డిప్పుడు లతికకు దాసుఁడైనాఁడు.

ఈమాటవిని నరసింహుఁడు, ననంతుఁడును బిగ్గఱగా నవ్వ నారంభించిరి. చిత్ర లజ్జావనతవదన యయ్యెను. నరసింహుఁ డామెం గాంచి "చిత్రా ! యువరాజు పెద్దవాఁడై పదిమందిని బెండ్లియాడిన ప్పుడు నీమేమి చేయుదువు ?"

చిత్ర తల యూఁచుచు "నే నెన్నటికిని గూడ నట్లు చేయనీయను !" అనియెను.

ఈమాట విని యందఱు నవ్వ నారంభించిరి.

నర—(నలువంకలఁ జూచి) తోఁటలోనిపువ్వులన్నియుఁ గూడ నైపోయిననే. ఇఁకఁ జెట్లయినను మిగులునో లేదో ? పొద్దెక్కి పోవుచున్నది. ఇఁక నదికిఁ బోవుట మంచిది కాదా ? ఒకజామువఱకు నెవ్వరికిని స్నానమే తేలదు ! మహాదేవియొద్దనుండి మూఁడునాలుగుకబురులు వచ్చిననే గాని యెవ్వరికిని భోజనముమాటయే తోఁచదు !

ఈమాటలు విని శశాంకుఁడు నవ్వుచు "నరసింహా! మాలో నీవొక్కఁడవే పెద్దవాఁడవు! బుద్ధిశాలివి! గుణములదొంతివి! సమయము మించకుండ నీవన్ని పనులను జక్కఁ జేసికొనఁగలవు. ఔనా?" అనియెను.

యువరాజిట్లు పలుకుచుండఁగనే యాతోఁటలోని కొకదాసి వచ్చి కుమారునకుఁ బ్రణామము చేసి "మహాదేవిగారుమిమ్మందఱను వేగముగా స్నానము చేసి రమ్మన్నారు" అని మనవి చేసెను.

నరసిం—(బిగ్గఱగా నవ్వుచు) కుమారా! నేనన్నమాట సరి పోయినదా?

తత్క్షణమే యందఱును బయలుదేఱి రాజభవనమునకుఁ బోయిరి. భవనపటాంగణసమీపమునం దున్న యొకయరుఁగుపై నున్నతకాయుఁ డగునొకపురుషుఁడు పరిచారము చేయుచుండెను. చూచినంతనే లతిక పరుగెత్తుకొనిపోయి యాతనిపాదములను గౌఁగిలించుకొనియెను. శశాంకమాధవులుగూడ నామె వెంటనే పోయి యాపురుషునకు నమస్కరించిరి. తక్కిన బాలకులించుకదూరమున నిలిచియుండిరి. ఆపురుషుఁడు యశోధవళుఁడే!

యశోధవళుఁడు శశాంకుని పింగళకేశకలాపమును జేతితో నిమురుచు "యువరాజా! వారెవ్వరు?" అని ప్రశ్నించెను.

శశాంకుని కనుసన్న యెఱింగి యనంత నరసింహులు సమీపించి యశోధవళదేవునకుఁ బ్రణమిల్లిరి. శశాంకుఁడు యశోధవళునకు వారి పరిచయముం గావించెను. తోడనే యశోధవళుఁడు చిత్రానంతులను రెండుచేతులతో నెత్తుకొని స్తబ్ధభావముతో విమనస్కుఁడై నిలువఁబడి తనలో "సామ్రాజ్యమునందలి సరదారులును, ముఖ్యవంశజులగు ప్రకృతపురుషులును దమకెట్టియాధారమును లేకుండుటచే రాజధానికే తెంచి యున్నారు. సామ్రాజ్యమునం దందఱును బికారులే

నైపోవుటచే భిక్షమిడుటకెవ్వరును లేకుండ నున్నారు. వృద్ధ చక్రవర్తియే యిప్పుడందఱకు నాశ్రయదాత కావలసియున్నాఁడు. అతఁడును నావలెనే వృద్ధుఁడైపోయెను. ఆతని పుత్రులిరువురు నింకను బాలకులే—రాజ్యరక్షణమునకసమర్థులు! ఈవృద్ధసార్వభౌముని మరణమునకై శత్రువులు నలుదెసలనుండియు నెదురుచూచుచున్నారు. ఇఁక నుపాయ మేమున్నది—"అని తలపోయుచుండఁగా దాసి యాతని సమీపించి ప్రణామము గావించి "ప్రభూ! చాలప్రొద్దెక్కినది. మహాదేవిగారు బిడ్డలను స్నానము చేయించుటకై పిలుచుచున్నారు!" అని మనవి చేసెను.

యశోధవళుఁడు చటాలునఁ జిత్రాసనతులను గ్రిందికి దింపెను. తత్క్షణమే యందఱును నాతనికి నమస్కరించి పాడలోనికిఁ బరుగెత్తుకొని పోయిరి.

యశోధవళుఁడు మరల నాలోచనా నిమగ్నుఁడై తనలో "లతికంగూర్చిన విచారముచే నేనుగలఁతఁజెంది సార్వభౌముని సన్నిధికి వచ్చియుంటిని. కాని యిక్కడకు వచ్చి చూచుసరి కందఱియవస్థయు ను శోచనీయముగనే యగపడుచున్నది. ఎవ్వరికిని రాజకార్యదక్షత యే లేదు. వృద్ధుఁడైన సార్వభౌముఁ డధిక పరిశ్రమను సహింపఁజాలకుండెను. బహిశ్శత్రుభయముచే నాతఁ డహోరాత్రములును జింతాక్రాంతహృదయుఁడై యున్నాఁడు. ఎవ్వ రెట్టి యల్పాపచారము గావించినను నాతఁడే సంచలింపవలసి యుండెను. రాజకార్యభారమును వహించుట కింకను రాజపుత్రు లర్హులై యుండలేదు. హృషీకేశశర్మయు నారాయణశర్మయుమాత్రమే సామ్రాజ్యమునకుఁ బ్రస్తుతము ప్రధానులై యున్నారు. వారుగూడ వృద్ధులే యగుటచే నధికశ్రమను సహింపఁజాలకున్నారు. ఇఁక నీసామ్రాజ్యసంరక్షణమునకు నుపాయ మేమున్నది? ఈప్రాచీనసామ్రాజ్యము సుస్థిరమైయుండుట

కిఁక నాధార మేమున్నది? ” అని వితర్కించుచుండ నావృద్ధునివదన మండల మెఱ్ఱనై పోయెను.

అట్లాతఁ డతిదీర్ఘముగ నాలోచించి యాలోచించి యొక్క చో నిలువఁబడి తుట్టతుదను “నాయేకపుత్రుఁడు కీర్తిధవళుఁడు సామ్రాజ్యముకొఱకు సమరాంగణమునఁ దనదేహమును సమర్పించి యున్నాఁడు. రాజకార్యముకొఱకు నేనును నాజీవితమును బలిసేయ వలయును. సామ్రాజ్యముకొఱకే కర్మక్షేత్రమునఁ బ్రవేశించి యీ నాశేషజీవితమును గడపివైచెదను. మాపూర్వులగు పాటలీయమహా నాయకులు సామ్రాజ్యముకొఱకుఁ దమతమప్రాణధనంబులనర్పించుచు జిరకాలమునుండియుఁ గీర్తిశేషు లగుచున్నారు. ఆవంశమందలి కడప టివాఁడనగునేనుగూడ నాపరమపూజ్యులచరిత్రము నాదర్శముగఁ జేసి కొని వారిమార్గముననే యనుసరించి పోయెదను” అని నిశ్చయించు కొనియెను.

యశోధవళుఁడు దృఢప్రతిజ్ఞుఁడు. తలఁచినపని నెఱవేర్చువఱకు నాతఁ డత్యాతురుఁడై యుండును. ఇప్పు డాతఁ డీవిధముగా నిశ్చయిం చుకొని యింక నిమిషమైన నూరకుండఁజాలక “ఎవరక్కడ?” అని కేక వైచెను.

తోడనే ప్రతీహారి యట కేతెంచి ప్రణమిల్లుటయు యశోధ వళుఁ డాతనిం గాంచి “సార్వభౌము లిప్పు డెచ్చట నున్నారు? నేనిప్పు డేపోయి వారిని సందర్శింపవలయును.” అనియెను.

ప్రతీ—మహాస్వామీ! మహారాజాధిరాజ సార్వభౌములవా రిప్పుడే గంగాద్వారముకడకుఁ బోయియున్నారు.

యశో—నీవిప్పుడే పోయి వారికి నామనవిని విన్నవించి రమ్ము.

“చిత్తము” అని ప్రతీహారి యాతనికిఁ బునఃప్రణామమును గా వించి వెడలిపోయెను.

## పదునేనవ ప్రకరణము

—:o:—

గంగాద్వారమునకు వెలుపల నున్న విశాలసోపానముల పైభాగమున సార్వభౌముఁడు కూర్చుండి యుండెను. ఆతనియెదుట విశాల సైకతప్రదేశమున దూరముగా భాగీరథీజలప్రవాహరేఖ కానవచ్చుచుండెను. చక్రవర్తి యాఘట్టమునందుఁ గూర్చుండి బాలికాబాలకుల జలక్రీడల నాలోకించుచుండెను. ఆసమయమునఁ బ్రతీహారివచ్చి ప్రణామము చేసి “ దేవా! మహానాయకయశోధవళదేవుఁడు మహారాజ సందర్శనము నపేక్షించుచున్నాఁడు” అని మనవి చేసెను. అది విని చక్రవర్తి “ ఆతని నిచ్చటికిఁ దీసికొని రమ్ము! ” అని సెలవిచ్చెను. తీప్రహారి పునరభివాదనము చేసి పోయి కొంతసేపటికటకు యశోధవళదేవుని దీసికొని వచ్చెను. సార్వభౌముఁడు మందహాసముతో నాతనిం గాంచి “ ఏమియశోధవళా! విశేషము లేమి? ” అని ప్రశ్నించెను.

యశోధవళుఁడు చక్రవర్తికి నమస్కరింపఁబోయెనుగాని మహారా జాతని నట్లు చేయనీయక చేయిఁబట్టుకొని తనచెంతఁ గూర్చుండు మనియెను. కాని యశోధవళుఁ డట్లుచేయక యించుక దూరమునఁ గూర్చుండెను.

కొంతసేపైనతరువాత యశోధవళుఁడు ముకుళితకరయుగళుఁడై “మహారాజాధిరాజా! నాపౌత్రి యగులతిక నాయనంతరమున నిరాశ్రయమై కడగండ్ల పాలగు ననుభయముచే నామెకొఱకు నేను మిమ్ములను యాచింప వచ్చితిని. కాని, యిచ్చటిస్థితిగతులను బరిశీలింపఁగా నాకంతయు విలక్షణపరిణామ మగపడుచున్నది. అభిజాత సాంప్రదాయకులలో ననేకులు బికారులైయున్నట్లు నాకిప్పుడు స్పష్టము

గాఁ దెలియవచ్చినది. నిరాశ్రయులగు విధవలకును, అనాథలకు నిరాధారులగు బాలికాబాలకులకు నిప్పుడు మీరొక్కరే యాశ్రయస్థానమై యున్నారు. కాని, మీ శిరోజములు పలితములై పోయినవి. మీరు కడుంగడు వృద్ధులైనారు. మనకిప్పుడు మహాప్రయాణకాల మాసన్నమైయున్నది. మీ యనంతరమున సామ్రాజ్యస్థితియుఁ బ్రజాస్థితియు నెట్లుండునో యను విచారము నా హృదయమునకు దారుణయాతనం గల్పించుచున్నది. నేనిచ్చటికి వచ్చి సకలవ్యవహారములను, సకలసందర్భములను గాంచి యిప్పుడు నాలౌకికవిచారమునే మఱచిపోయితిని. మీకుమారులింకను బాల్యదశయందే యున్నారని చెప్పవచ్చును. వారికింకను రాజకీయ వ్యవహారములను నేర్చవలసిన ప్రాయము రాలేదు. మీ ముఖ్యాధికారు లగు హృషీకేశ, నారాయణవర్మలుం గూడ వృద్ధులై రాజకార్యపరిశ్రమను సహింపఁజాలని యవస్థలో నున్నారు. మీ నవీనాధికారులకుఁ దమంతట స్వయముగా నేకార్యము చేయుటకును సాహసము కలుగుట లేదు. వారికా శక్తియును లేదు. ఏవిషయమైనను మీకు విన్నవించుటకుఁ గూడ వారు భయపడుచున్నారు. ఈయన్నివిషయములను బాగుగ నాలోచించి చూడఁగా మీరు జీవించియుండఁగనే రాజకార్య వ్యవహారములయందతిమాత్ర మగు లోపము వ్యాపించియున్నట్లు తేటపడుచున్నది. ప్రస్తుతస్థితిలో నిజమాలోచింపఁగా జరణాద్రిదుర్గము సామ్రాజ్యమునకు సింహద్వారము. కాని, యాదుర్గాధిపతి యగు శార్దూలవర్మతనయుఁడు మహావీరయజ్ఞవర్మ నాతనితమ్ముఁడు దుర్గమునుండి పారఁద్రోలినవార్త యిప్పటికిని సార్వభౌముని చెవికిఁ జేరదయ్యెను. ఈజేయు మండలముగ మంగవంగదేశములకుఁ బొలిమేర నున్నది. ఆదుర్గాధిపతి ప్రాచీనకాలమునుండియు నొక ముఖ్యామాత్యుఁడుగాఁ బరిగణింపఁబడుచుండెను. కాని, యాతఁడుదత్తుని దుర్గ

మితరు లపహరించుటచే నాతని పుత్రికాపుత్రికులు భిక్షాన్నజీవులై పోయినారు. మహారాజాధిరాజా! మనస్సంక్షోభము గూర్చుట కింతకంటె నిఁకేమి కావలయును? మీజీవితకాలమునందే యీపాటలీపుత్రమున కెట్టిదురవస్థ తటస్థించినదో మీ రణుమాత్రమైనను గ్రహించుట లేదు. తోరణద్వారములకుఁ గవాటములు లేవు. నగరతటము శిథిలమై యుత్పన్నమగుటకు సిద్ధముగా నున్నది. దానిని బాగుపఱచువా రెవ్వరును లేరు. రాజభవనశిలాపటాంగణ మిప్పుడు పచ్చికబీడై పాడువడియున్నది. ఇప్పటివఱకుఁ గోశమున ధనాగమము లేదుగదా! వాడలోఁ బనివాండ్రుగూడ ననేకులున్నారు. కాని, యే పనియును బాగుగ జరుగుచుండుట లేదు. అదియేమని మీ రైనఁ బరామర్శించుట లేదు. నలుదెసలయందును మనశత్రువులు శిథిలావస్థయందున్న మనసామ్రాజ్యముపైఁ గాకులవలె లుబ్ధదృష్టులై సమయమును వేచి పొంచుండి చూచుచున్నారు. వంగదేశము పేరునకు సామ్రాజ్యమునఁ జేరియున్నది గాని, దానిపై నధికారమెవ్వరికిని లేకుండఁ బోయినది. మహాదేవి యనుమహాసేన జీవించియున్నది గావున వారాణసీచరణాద్రిదుర్గములు బహిరంగముగా స్థానేశ్వరసామ్రాజ్యమునఁ జేరిపోకుండ నిలిచి యున్నవి. ఈసంగతి మీకును దెలిసియేయుండును. ఒకవేళ దురదృష్టవశమున మహాదేవి మరణించినప్పుడుగాని—ప్రభాకరుఁడు జననియాజ్ఞ నుల్లంఘించినప్పుడుగాని—నిశ్చయముగా మనకెంతటి సామర్థ్యమున్నను, యెంతసైన్యమున్నను, ఎంత దేహబలమున్నను మనసామ్రాజ్యమును సంరక్షించుకొనుట దుస్సాధ్యము కాకమానదు. ఇట్టిస్థితిలో మనరాజధాని శత్రువులు ముట్టడింపకుండఁగనే యుద్ధముచేయవలసిన యావశ్యకము కలుగకుండఁగనే శత్రువులకు హస్తగతము కాఁగలదు” అని చెప్పి యశోధవళుఁ డూరకుండెను.

కొంతసేపటివఱకు నిరువురును నిస్తబ్ధులై యుండిరి. అనంతరము చక్రవర్తి మెల్లఁగా "యశోధవళ దేవా! నీవు చెప్పినసంగతు లన్నియును నిజమే. కాని నేనేమి చేయుదును! నేను వయోవృద్ధుఁడను. శశాంకుఁడు పసిబాలుఁడు. శశాంకుని కాలమున సామ్రాజ్యమునకు వినాశనము తటస్థింపఁగలదని జ్యోతిష్కులు చెప్పియున్నారు! విధి విధానమెట్లున్నదో యట్లు జరుగక మానదుగదా" అనియెను.

యశో—(తీవ్రస్వరముతో) మహారాజా! మీరిట్లు సంభాషించుట యుచితముగాదు. ఎవ్వఁడో యొకపిచ్చివాని—మోసగాని—మాటలను విశ్వసించి సామ్రాజ్యమునకు జలాంజలి విడిచి యూరకుండుట మీవంటివారికిఁ దగునా? జ్యోతిష్కులా? వారికిఁ దోఁచిన వన్నియును వాగుచుందురు; అనేకవిషయములను జెప్పుచుందురు. వారు చెప్పినట్లే ప్రవర్తింపవలయు నన్నచో మానవుఁడు సంసారమును బరిత్యజించి వానప్రస్థాశ్రమమును స్వీకరింపవలయును. యువరాజకుమారుఁడు బాలుఁడైన నేమి? తీవ్రబుద్ధికుశలుఁడు—సమరకళాకోవిదుఁడు—కాని, మీరాతనికిఁ దగిన శిక్షణము నొసంగుచుండుట లేదు. సామ్రాజ్యశకటమును నడపించుటకై శౌర్యవీర్యాదికముకన్నఁ గూటనీతియే యత్యావశ్యకమైనది. రాజకీయవ్యవహారము లెట్లు జరుగుచున్నవో యని చాలకాలమువఱకును సూక్ష్మావలోకనము చేయుచుండవలయును. ఈధర్మమును మీరెట్లుమఱచితిరో వింతగానున్నది. కాలప్రవాహమునం దప్పుడప్పు డద్భుతకృత్యములం గావించు నొక్కొక్క బాలతరంగ ముదయించుచుండును. ఆ బాలకులకృత్యము లేయితిహాసము లగుచుండును. సముద్రగుప్తుఁడు కేవలమును బదునాలుగేండ్ల బాలుఁడే గాని, యాతఁ డుత్తరరాజసముద్రమునంతను మథించి యశ్వమేధముం గావించెను. స్కందగుప్తుఁడు పదునైదేండ్ల పసివాఁడు. ఆతఁడు శస్త్రహస్తుఁడై హూణులప్రథమకల్లోలమునంతను

నణగించివైచెను. ఇట్టిస్థితిలోఁ బదునాలుగేండ్ల వయసుగల మన శశాంకనరేంద్రగుప్తుఁ డీప్రాచీనసామ్రాజ్యము నుద్ధరింపఁజాలువాఁడు గాఁడని మనమెట్లు నిర్ణయింపఁగలము? ఎవ్వరు చెప్పఁగలరు? మహారాజా! ఈసంశయము లన్నియును వీడుఁడు! ఇప్పటికైనను సామ్రాజ్యోద్ధరణాశ లేకపోలేదు. ఇంకను వేళ యున్నది. కాని యిట్లూరకున్నచో నిఁక మీఁదమాత్రము సాగదు.

చక్ర—యశోధవళా! ఈస్థితిలో నేనేమి చేయఁగలను? ఏమి చేయవలయునో నీవే చెప్పుము.

యశో—మీరు చేయవలసినపని యతిసామాన్యమైనదియే. ఒకప్పుడు మీదాసుఁడగునీతఁడు మహారాజాజ్ఞచే సామ్రాజ్యసర్వకార్యభారమును దనతలపైఁ బెట్టుకొని నిర్వహించి యున్నాఁడు. ఈ క్షీణబాహువులలో నప్పటితారుణ్యశక్తి యిప్పుడు లేకపోయినను నిజముగా నీహృదయమునందుమాత్ర మపారబలము లేకపోలేదు. మహారాజా! దేవరయాజ్ఞయైనచో మరల నీసేవకుఁడు మునుపటివలెనే రాజ్యకార్యభారమును వహించుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు! సార్వభౌమా! రాజకార్యనిర్వహణమునందే నాకీర్తిధవళుఁడు ప్రాణముల నర్పించి యున్నాఁడు. ఆతనివృద్ధజనకుని కోరికకూడ నట్లు చేయవలయుననియే—మా లతికకు భిక్షాన్నమును సంపాదించి పెట్టుటకై నే నిచ్చటికి వచ్చియుంటిని. కాని, యిక్కడకు వచ్చినతరువాత నాయాశ్రయదాతయాశ్రయమే కూలిపోవుటకు సంసిద్ధమై యున్నట్లు నాకు గోచరమయ్యెను. ఇట్టిస్థితిలో నాబిడ్డ కాశ్రయ మిచ్చువారెవ్వరు? హృషీకేశనారాయణశర్మలిప్పుడు చేయుచున్న పనులను వారే నిర్వహించెదరుగాక! లోకుల కన్నులచాటునుండియే నేను సార్వభౌమునకును, సామ్రాజ్యమునకును సేవ సేయవలయు నని కోరుచున్నాను.



యశోధవళుఁ డిట్లు చెప్పుచుండఁగాఁ జక్రవర్తి దీర్ఘవిచారనిమగ్నుఁడై యధోవదనుఁడై యుండెను. కొంతసేపటికాతఁ డించుక మొగమెత్తి "యశోధవళా! రాజకీయకార్యభారమును వహించుటకు నీవు నిజముగా సిద్ధపడియుంటివా?" అని ప్రశ్నించెను.

యశో—ఈదాసానుదాసుఁ డెన్నఁడైన మహారాజాధిరాజసమక్షమున నసత్యములాడియుండెనా!

చక్ర—యశోధవళా! ఏమని చెప్పుదును! ఈవిచారముచేఁ గొన్నిసంవత్సరములనుండి నాకు నిద్రయే పట్టుట లేదు. భవిష్యత్కాలచింతలచే నేనున్మత్తుఁడనై పోవుచున్నాను. మిత్రమా! నీవీసకలకార్యభారమును వహించి యున్నచో నేనిఁక నిశ్చయముగా నిశ్చింతుఁడనై యుండఁగలను.

యశో—(వినయముతో) ప్రభూ! ఇప్పుడంతయును నాకుఁ దెలిసిపోయినది. భవిష్యత్కాలచింతలచే మీహృదయమున కొకనిమిషమైనను విశ్రాంతి కలుగుట లేదు. ఎవ్వరును జెప్పకుండఁగనే యీసంగతి తెలియుచున్నది. కేవలభయముచేతనే రాజకీయోద్యోగులు మీసమక్షమునకు రాసాహసించుట లేదు. పను లన్నియు దుమ్మునఁ గలసిపోవుచున్నను మీయెదుటికివచ్చి మనవిచేయుటకు మీయధికారులలో నెవ్వనికిని ధైర్యము గలుగుట లేదు. జీవితమంతయును రాజకార్యనిర్వహణమునందే గడపుచున్న హృషీకేశశర్మవంటివానికైన మిమ్మేదైన నడుగుటకు ధైర్యము లేకుండెనన్నచో నితరులమాట చెప్పుట యెందులకు? ఇంతకంటె నాశ్చర్యమేమైన నున్నదా? స్థానేశ్వరరాజు వెడలిపోయినతరువాత సార్వభౌముఁడు మరల నెన్నఁడును నగుమొగముతో నగపడనే లేదని నాగరికులు బహిరంగముగాఁ జెప్పుకొనుచున్నారు.

యశోధవళుఁ డిట్లు చెప్పుచుండఁగాఁ జక్రవర్తి దీర్ఘవిచారని మగ్నుఁడై యధోవదనుఁడై యుండెను. కొంతసేపటికాతఁ డించుక మొగమెత్తి "యశోధవళా! రాజకీయ కార్యభారమును వహించుటకు నీవు నిజముగా సిద్ధపడియుంటివా?" అని ప్రశ్నించెను.

యశో——ఈదాసానుదాసుఁ డెన్నఁడైన మహారాజాధిరాజసమక్షమున నసత్యములాడియుండెనా!

చక్రి——యశోధవళా! ఏమని చెప్పుదును! ఈవిచారముచేఁ గొన్ని సంవత్సరములనుండి నాకు నిద్రయే పట్టుట లేదు. భవిష్యత్కాలచింతలచే నేనున్మత్తుఁడనై పోవుచున్నాను. మిత్రమా! నీవీసకల కార్యభారమును వహించి యున్నచో నేనిఁక నిశ్చయముగా నిశ్చింతుఁడనై యుండఁగలను.

యశో——(వినయముతో) ప్రభూ! ఇప్పుడంతయును నాకుఁ దెలిసిపోయినది. భవిష్యత్కాలచింతలచే మీహృదయమున కొకనిమిషమైనను విశ్రాంతి కలుగుట లేదు. ఎవ్వరును జెప్పకుండఁగనే యీసంగతి తెలియుచున్నది. కేవలభయముచేతనే రాజకీయోద్యోగులు మీసమక్షమునకు రాసాహసించుట లేదు. పను లన్నియు దుమ్మునఁ గలసిపోవుచున్నను మీయెదుటికివచ్చి మనవిచేయుటకు మీయధికారులలో నెవ్వనికిని ధైర్యము గలుగుట లేదు, జీవితమంతయును రాజకార్యనిర్వహణమునందే గడపుచున్న హృషీకేశశర్మవంటివానికైె మిమ్మెదైన నడుగుటకు ధైర్యము లేకుండెనన్నచో నితరులమాట చెప్పుట యెందులకు? ఇంతకంటె నాశ్చర్య మేమైన నున్నదా? స్థానేశ్వరరాజు వెడలిపోయినతరువాత సార్వభౌముఁడు మరల నెన్నఁడును నగుమొగముతో నగపడనే లేదని నాగరికులు బహిరంగముగాఁ జెప్పుకొనుచున్నారు.

చక్ర—యశోధవళా! అందలిప్రత్యుత్తరమును సత్యమే-ప్రభాకరుఁడు పాటలీపుత్రమునకు వచ్చుచున్నాఁడని వినినంతనే నాకుఁ బిచ్చిపట్టినట్లయ్యెను. ప్రభాకరుఁడు పాటలీపుత్రమునం దున్నంతకాలమును నేనాతనిచాయవలె వెన్నంటి తిరుగుచు నేయుంటిని. దాసునివలె నేనాతని తిరస్కారములను సహించితిని. ఏమని చెప్పుదును! గుప్తసామ్రాజ్యచక్రవర్తి నగు నేను కేవలమొకనీచసేవకునివలె నాతనికి శుశ్రూషలొనర్చితిని. అప్పుడు నేను సముద్రగుప్తునివంశజుఁడ ననుమాటనుకూడ మఱచిపోయితిని. ప్రభాకరుఁడు నాభాగినేయుఁడనుమాటను మఱచితిని. ప్రతినిమిషమునందును నాతనియనుచరులు నారాజ్యమందలియధికారుల నవమానించుచుండిరి. అల్పకారణమాత్రమున నాతనిసేనలు నాసేనలపై డీకొనినవి. సైనికులు నగరమునఁ బ్రవేశించి యంతటను దోచుకొనఁదొడంగిరి. నిరపరాధులగు నాప్రజలను వారు నిర్బంధములపాలుగావించి బాధించిరి. వారి యత్యాచారములు దుస్సహములగుటచేఁ దుట్టతుదకు నాప్రజలు వారిపైఁబడి వారిశిబిరముల నగ్నిముట్టించిరి. యశోధవళా! ఆలౌహిత్యతీరమున యజ్ఞవర్మ నాప్రాణములను సంరక్షించుట యిట్టి యసహ్యంబులగు నత్యాచారములను సహించుటకేనా?

యశో—దేవా! నేనెల్లవిషయములను వినియుంటిని. ఇక్కడకు వచ్చి నేనెట్టివిచారవార్తలను వినియుంటినో, యట్టికష్టసమాచారముల నిఁక నెన్నఁడును వినఁబోను. నేనువిన్నవిషయములవలననే నాకొకనవీనజ్ఞానోదయ మైనది. మహారాజా! ఈదాసున కాజ్ఞ యొసంగుఁడు! మరల సామ్రాజ్యభారమును నాతలపైఁ బెట్టుకొందును.

చక్ర—మిత్రమా! ఈభారమును నీవు వహించుట కింకను నాయనుమతి యేల? నేనిప్పుడే మంత్రిసభను సమకూర్పించెదను

యశో:— వలదు మహారాజా! సభలో నావశ్యకము లేదు. హృషీకేశ, నారాయణశర్మలను బిలిపించి మాటాడినఁ జాలును.

చక:— మంచిది. అట్లే కానిమ్ము—ఎవరక్కడ? ప్రతీహారీ!

దూరమున నున్న ప్రతీహారి యాపిలుపు విన్నంతనే సమీపించి యభివాదనము గావించెను. చక్రవర్తి యాతనిం గాంచి "వినయసేనుని దీసికొని రమ్ము" అని యాజ్ఞాపించెను.

ప్రతీహారి నమస్కరించి వెడలిపోయెను. కొండొకసేపటిలో వినయసేనుఁడు వచ్చెను. సార్వభౌముఁ డాతనిం గని "వినయసేనా! హృషీకేశశర్మను, నారాయణశర్మను, హరిగుప్తుని రెండుజాముల వేళకు రాజభవనమునకుఁ దీసికొని రమ్ము!" అని యుత్తరువు చేసెను.

వినయసేనుఁడు "చిత్తము" అని యభివాదనము చేసి వెడలిపోయెను. సార్వభౌమయశోధవళు లచ్చటినుండి నగరునకు వెడలిపోయిరి.

---

## పదునాఱవప్రకరణము

పాటలీపుత్రపు పురాతనరాజభవనమునకుఁ జుట్టును నత్యగాధం బగు కందకము కలదు. అది యెల్లప్పుడు గంగాజలముచేఁ బూర్ణీభూతమై యుండును. చైత్రవైశాఖమాసములలోఁ గూడ దానియందు నీరు నిండియుండును. మనకథాకాలమున వర్షర్తువునందు మాత్రము దానిలో నీరుండి వేసవికాలమున దానియడుగుభాగము వనలతాదులచేఁ బరివ్యాప్తమగుచుండెను. ఆకందకములోనికి నీరువచ్చు కాలువ చాలకాలమునుండి బాగుచేయింపకుండుటచే నది యిసుకచేఁ గప్పఁబడి పోయెను. వర్షాకాలమున మాత్రము కాలువనుండి యెట్లో నీరు ప్రవహించి యాకందకమునఁ జేరుచుండును. కందకముపై నున్న తటము

గూడ బాగుచేయింపక పోవుటచే నందందు శిథిలమై కొన్నికొన్ని చోటులఁ బడిపోయి యుండెను. నగరుచెంగటితటము నీలశిలలచే నిర్మింపఁబడినది గాని, నగరతటముమాత్రము మ్రానిపలకలచేఁ గట్టఁబడుట వలన నెక్కొక్కచో నది బొత్తుగనే యగపడకుండఁ బోయెను. పైని మ్రానియావరణము కుళ్ళి లోపలిమన్నంతయును బయటికి వచ్చి యగడ్తలోఁబడుటచే నగడ్తయు నందందుఁ బూడిపోయియుండెను తటముపై నిబిడారణ్యము వ్యాపించి యుండెను. నగరమునందలి జనులు పట్టపగలుగూడ నచ్చటికిఁ బోవుటకు భయపడుచుండిరి.

ఏనాఁటియుదయమున యశోధవర్ముఁడు తాను రాజకార్యభారమును వహించెదనని చక్రవర్తికి మనవి చేసియుండెనో, యామఱునాఁటి యుషఃకాలమునకుఁ బూర్వము రాజభవనప్రాంతతటంబున మూఁవురుబౌద్ధభిక్షు లేమేమియో సంభాషించుకొనుచుఁగూర్చుండిరి. ఇంకను బాగుగ వెలుఁగు రాలేదు. అప్పుడు వారికొకింతదూరమున వృక్షచ్ఛాయాంధకారమునం దొకభిక్షువు నిలిచియుండెను. ఆవనమునందచ్చటచ్చట ననేకభిక్షువులు నిలిచి ద్వారపాలక కృత్యమును నిర్వహించుచుండిరి.

కూర్చుండి మాటలాడుచున్న మూఁవురుభిక్షులలో నిరువురు మాప్రియపాఠకులకుఁ బరిచితులే. తృతీయభిక్షువు కపోతికసంఘారామమునకు మహాస్థవిరుఁడగుబుద్ధఘోషుఁడు. బంధుగుప్తుఁడు, శత్రుసేనుఁడు, బుద్ధఘోషుఁడు యీముగ్గురును నుత్తరప్రదేశములలోని బౌద్ధసంఘనేతలు.

బుద్ధఘోషుఁడు—మన మిన్నాళ్లవఱకును బుద్ధభగవానుని నామస్మరణము చేయుచు సంఘోన్నతికొఱకుఁ బాటుపడుచున్నారము. ఈప్రయత్నమునందు మనకింతవఱకు సామాన్యముగా నెట్టి విఘ్నములును గలుగుటలేదు. ఇప్పుడుమాత్ర మనేకవిఘ్నపరంపరలు

తటస్థింపనున్నట్లు పొడకట్టుచున్నది. రోహితాశ్వదుర్గాధిపతి యశోధవళదేవుఁ డిచ్చటికి వచ్చుచున్నాఁ డనుసంగతి యాతనిరాకకు ముందే మనకుఁ దెలియవలసినది. ఏమి యీమందవ్యాపారము! కరూశదేశమునందలిసంఘస్థవిరు లందఱును నిశ్చింతులై నిద్రించుచున్నారని తోఁచుచున్నది. యశోధవళునింబోలినమహాపరాక్రముఁడును, సుదక్షుఁడు నైనసంఘవైరియెడల వారింతనిర్లక్ష్యభావముతో నుండుట మహాశ్చర్యముగా నున్నది.

శత్రుసేనుఁడు బుద్ధఘోషునిమాటలను సావధానముగ నాలకించి "మహాస్థవిరా! ఈవిషయమునఁ గరూశదేశములోనిసంఘస్థవిరులయందు విశేషదోష మున్నదని నాకుఁ దోఁచుట లేదు. పుత్రమరణానంతరమున యశోధవళుఁడు విచారోన్మాదగ్రస్తుఁడై యుండెను. ఆతఁడట్లే దుర్గమునఁ గాలక్షేపము సేయుచుండెను. ఎనుబదియేండ్లపండువంటిముదుసలి యీవిధముగా నొక్కసారి తరుణుఁడగుననియుఁ, దారుణ్యమునందలియాతనిశౌర్యమును, సర్వశక్తులును నాకస్మికముగా నిట్లు విజృంభించు ననియు నెవ్వరికైనఁ గలనైనఁ దెలియుట యసంభవము గాదా? నిశ్చయముగా నట్లూహించుట యసంభవము. ఇట్టియుద్దేశముతోనే యీసంఘస్థవిరు లందఱును నిశ్చింతులై యుందురు.

బుద్ధఘోషున కీమాటలు సమంజసములుగాఁ దోఁచుట లేదు కాఁబోలును! ఆతఁడప్పుడు తీవ్రస్వరముతో "వజ్రాచార్యా! బౌద్ధసంఘమున ననేకసంవత్సరములనుండి వ్యాపించియున్నదుర్దినము లన్నియును దొలఁగిపోయి శుభదినోషఃకాలమైనప్పుడు జాగరూకతను, ఆలోచనను ద్యజించి యూరక నిద్రించుచుండుట మహామూర్ఖతయు, నదూరదర్శితయు, నపచారరము నని చెప్పుటకు సందేహ మేమున్నది? విశ్వకల్యాణకార్యభారమును నెత్తిపైఁ బెట్టుకొన్నవా రిట్లు

నిర్లక్ష్యభావముతో మెలంగుట యుచితము గాదు. ఇప్పట్టున నీకరూశదేశసంఘస్థవిరులు మహాపరాధ మొనర్చి రనియే నాయభిప్రాయము. వారియపరాధముంగూర్చి యెన్నటికైనను జర్చింపక విడుచువాఁడను గాను. కాని యిప్పుడు సమయముగాదు. ముందురాఁబో వుకష్టముల నివారించునుపాయమును శోధించుటయే మనకిప్పుడు ప్రధానకర్తవ్యమై యున్నది.

వజ్ర—మహాస్థవిరా! మీయాలోచన యుక్తియుక్తముగనే యున్నది.

బుద్ధ—యశోధవళుఁ డిప్పుడు తనదీర్ఘకాలమోహనిద్రనుండి జాగరితుఁడై పాటలీపుత్రమునకు వచ్చి రాజసభలోఁ బ్రవేశించి యున్నాఁడు. ఇప్పుడు చక్రవర్తియు నాతఁడు నొక్కచోటనే యున్నారు. ఆతఁడు వచ్చువార్త యొక్కింతుకయుందుగనే మనకుఁ దెసిలి యున్న యెడల నెన్నియో యుపాయములను బన్ని యాతఁడు సార్వభౌముని గలసికొనకుండునట్లు చేసి యుందుము. ఫలసిద్ధి యెట్లైనను బ్రయత్నములు చేసియే తీరుదుము. యశోధవళుఁడు మనకు సామాన్యశత్రుఁడు గాఁడు. ఈసంగతి నేను మీకుఁ జెప్పనక్కఱలేదు. ఆతని కార్యదక్షత మనమెఱుంగనిది గాదు. అతఁ డిప్పుడొకసామాన్యకారణమునఁ బాటలీపుత్రమునకు వచ్చియుండలేదు. ఈసంగతి బాగుగ జ్ఞప్తియందుంచుకొనుఁడు! రాజధానిలోఁ బ్రవేశించినతరువాతఁ బ్రస్తుతము సామ్రాజ్యము నావరించియున్న భయంకరవ్యవస్థలును, గల్లోలములును నాతనికి గోచరములు గాక మానవు. ఈసంగతులన్నియు గ్రహించినతరువాత నాతఁడు స్వస్థముగా నూరక కూర్చుండువాఁడు మాత్రము కాఁడని నాకు బాగుగాఁ దెలియును. ఇప్పుడు సార్వభౌము, యశోధవళుతో యేవిషయములంగూర్చి యేమేమి యాలోచనలఁ గావించుచుండిరో తెలిసికొనుటకు మనకెట్టిమార్గమును లేదు. వజ్ర

చార్యా! సంఘస్థవిరా! మీ రింతటినుండి యతిజాగరూకులై మెలంగవలయును. లేకున్న మనకు సర్వనాశనము గలుగక మానదు. యశోధవళుఁ డీనగరమున కెట్లు వచ్చెనో యావిషయ మెవ్వరైన నేమైన విని యుంటిరా ?

శత్రు—కేవలము వినుటయే గాదు. ఆతఁ డీనగరమునఁ బ్రవేశించుట నేను ప్రత్యక్షముగనే చూచియున్నాను.

బుద్ధ—(ఆశ్చర్యముతో) నీవు ప్రత్యక్షముగనే చూచితివా ? అది యెట్లు ?

శత్రు—నేను శశాంకు నెటులైనఁ జంపుటకై రాచనగరుచుట్టును దిరుగుచుంటిని. తుదకు శశాంకుఁడు నా కగపడియెను. నేను గంగాద్వారముకడ నిలిచి శశాంకునకుభయము గల్పించుటకై యాతని భవిష్యద్వృత్తాంతము సత్యావేశముతోఁ జెప్పుట కారంభించితిని. నేనట్లు చెప్పుచుండఁగా నదీతీరమునందలి యొక నౌకనుండి యొక వృద్ధుఁడు నొక తరుణుఁడును దిగుచున్నట్లు నాకగపడియెను. వారట్లు దిగి యించుక సమీపించినంతనే నేను యశోధవళుని గుర్తించితిని. తోడనే నేనొకవృక్షశాఖ నాక్రమించి యాకస్మికంబగు నావిపత్తునుండి నాప్రాణసంరక్షణము గావించుకొంటిని.

“అటుపిమ్మట నేమి జరగినదో మీ రెవ్వరైనఁ గనుపెట్టితిరా ?” అని బుద్ధఘోషుఁడు చింతాక్రాంతహృదయముతోఁ బ్రశ్నించెను.

ఇంతవఱకును నిస్తబ్ధుఁడై కూర్చుండియున్న బంధుగుప్తుఁ డప్పుడు “ ఆఁ! కొన్ని సంగతులు తెలిసినవి. గంగాద్వారమునొద్దనే యాతఁడు శశాంకుని సందర్శించెను. వారిరువురకును బరిచయ మయ్యెను. అప్పుడు యువరాజు సభామందిరమున కాతని దీసికొనిపోయెను. యశోధవళుఁ డింకను సజీవుఁడై యున్నాఁడను సంగతిని జక్రవర్తి మొదట విశ్వసింపలేదు. క్రమముగా యశోధవళుసభామందిరమునం

బ్రవేశించుటఁ గాంచి తోడనే సార్వభౌముఁడు వేదికనుండికిందికి దిగి యెదురుగఁ బోయి యాతనింగౌఁగిలించుకొనియెను. అప్పుడు యశోధవళుఁ డందఱియెదుటను సభలో నిలువఁబడి నామనుమరాలిపోషణ మునకై పిడికె డన్నమును మిమ్ము యాచింపవచ్చితి నని సార్వభౌమునకు మనవి చేసికొనియెను. ఈసంగతు లన్నియును వాడలోనున్న మన గూఢచారులవలనఁ దెలియవచ్చినవి.

ఆలోచనాధీనమానసుఁడై యాలకించుచున్న బుద్ధఘోషుఁడప్పుడు " సరే, మంచిది. సార్వభౌమయశోధవళుల కింకను నెట్టిసంభాషణము జరగినదో యెవ్వరికైనఁ దెలియునా ?" అని ప్రశ్నించెను.

శత్రు—లేదు. ఆవిషయమై యేమియుఁ దెలియ లేదు. యశోధవళుఁ డంతఃపురముననే నివసించి యుండె ననియు, నచ్చటనే యాతని భోజనాదికవ్యవస్థలు గావింపఁబడియెననియుమాత్రమే తెలియవచ్చినది. యశోధవళుఁడు మహాదేవియుండునంతఃపురమునం దుండుటచే నాతనికి విషప్రయోగముం గావించుట మనకసాధ్యమైనది. ఆతఁడు వచ్చినతరువాత మంత్రులయాలోచనసభగూడ జరగినది. కాని యందేమేమియేర్పాటు లయ్యెనో యెవ్వరికిని దెలియ లేదు. ఏమనిన—ఆఘాతుకుఁడు—ఆదుష్టవినయసేనుఁడు —ఆ వేళ సభాగృహద్వారమునొద్ద స్వయముగనె కావలియుండెను.

బుద్ధ—అట్లయినచో రాచవాడలో నిప్పుడున్నచారులకంటె రెట్టింపుమంది నుంచవలయును. ఇప్పుడున్న వారికంటెను నధికవిశ్వాసపాత్రులనే యికార్యమున నూతనముగ నియోగింపవలయును.

బంధు—సరే. ఇటుపిమ్మట మంత్ర్యాలోచనముల విషయమై యేమి చేయవలయును ? నేనిప్పుడు వంగదేశమునకుఁ బోవలసియున్నది.

బుద్ధ—వంగదేశమునకా ? ఏల ?

బంధు—(విషణ్ణుఁడై) ఆతనికుమారుని జంపినవాఁడను నేనే యని యశోధవళున కిదివఱకే తెలిసి యుండును. కీర్తిధవళుఁడు శస్త్ర విహీనుఁడై యున్న సమయమునఁ గుక్కనుం బోలె నేనతినిర్దయుండనై యాతనివధించినసంగతి యశోధవళుఁడు గ్రహించినప్పుడాతఁ డెట్టిప్రతీకారమును గావించుటకుఁ బ్రయత్నించునో యెవ్వరూహింపఁగలరు ? ఆతనితీవ్రస్వభావము మీరెఱుంగనిది గాదు. ఆతనిప్రతీకారేచ్ఛ యెంతభయంకరమైనదో మనకందఱకును బాగుగఁ దెలిసినవిషయమే. మహాస్థవిరా ! నేనిప్పుడు ఈ పాటలీపుత్రమునం దుండుట క్షేమము గాదు. నేనిప్పుడే వంగదేశమునకుఁ బోయెదను; అచ్చట నిశ్చింతుఁడనై యుండి నాయావశ్యకకార్యములను నిర్వహించుచుండెదను.

బుద్ధ—(తీవ్రస్వరముతో) సంఘస్థవిరా ! నీకిప్పుడు మతిచాంచల్యము గలుగలేదుగద ! ఈఘోరసంకటసమయమున నీవీ పాటలీపుత్రమును విడిచి పాఱిపోవుటయా? నీయొక్కని ప్రాణముల కాసించి సర్వసంఘకార్యములను ధూళిపాలు చేయ దలఁచితివా? చీచీ! సిగ్గు సిగ్గు ! మృత్యువు తప్పనిదే యైనయెడల నీవీసంఘకార్యనిర్వాహణమునందే ప్రాణములను విసర్జించుట మేలైనపని. నీపూర్వులగు నెందఱో సంఘస్థవిరులును, మహాస్థవిరులును, భిక్షులును సంఘమునకై సంతోషపూర్వకముగాఁ దమతమప్రాణములను సమర్పించి యున్నారు. అట్లు సమర్పించుటవలననే సంఘమింతవఱకును సజీవమై యుండుట కవకాశము కలిగినది. బంధుగుప్తా ! నీయం దింతటిమృత్యుభయవిహ్వలభావము నేనిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. ఇప్పుడు క్రొత్తగా నీకిట్టిమరణభయ మేల కలుగుచున్నది ?

బంధు—(కంపితస్వరముతో) సామాన్యమైనమరణమునకు నేనింతగా సంచలించువాఁడను గానని మీకుఁ దెలిసినవిషయమే. కాని—ఆయశోధవళునిచేతిమరణము—అది యతిదారుణ మైనది !

ఆమరణయాతన యతిఘోరమైనది. సహస్రకుఠారాఘాతములవలనం గలిగినమరణమైనను దానికంటెసుఖకరమే—మహాస్థవిరా! అందుచేతనే నేనిప్పుడు వంగదేశమునకుఁబోవుట. అటకేఁగి నిశ్చింతుఁడనై యింతకంటె నధికముగా సంఘసేవ సేయుదును; దూతలవలనను, నుత్తరములవలనను నేనెల్లసంగతులను జాగరూకుఁడనై తెలిసికొనుచు, సంఘకార్యముల నుచితరీతిని నిర్వహించుచుండెదను.

బుద్ధ—(దృఢస్వరముతో) అట్లు చేయుట యసంభవము! అశక్యము! బంధుగుప్తా! ఇట్టికష్టసమయమునఁ బ్రాణముల కాసించి సంఘమును త్యజింపఁ దలఁచితివేని నీయిచ్చవచ్చినచోటికిఁ బోయి బ్రదుకుము!

బంధుగుప్తుఁ డధోవదనుఁడై యించుకసేపూరకుండి "మహాస్థవిరా! ఈవిషయమున మనలో నెవ్వరిదోషమును లేదు. మనమందఱము నదృష్టచక్రబద్ధులమై యున్నాము. నాయదృష్ట మెట్లున్నదో యట్లె యగుఁగాక! సరే. నేనిక్కడనుండి పోవలయు నను నుద్దేశమును మార్చుకొంటిని" అనియెను.

ఆసమయమునఁ బూర్వదిక్కున నారింజపండురంగుగల తేజఃపటలము వ్యాపించుచుండెను. క్షణకాలములో నొకభిక్షు వచ్చటికేతెంచి "దేవా! ఇప్పుడీస్థలము మిగుల నపాయకరమైనది. సూర్యోదయమగువఱకు నిట నుండుట మనకవకాశము లేదు. అప్పుడే మార్గమున జనసంచారమున కారంభమైనది" అని చెప్పెను.

తత్క్షణమే యామువ్వురును దత్తరముతో లేచి వేర్వేఱుత్రోవలననుసరించి వెడలిపోయిరి. అప్పుడు బుద్ధఘోషుఁడు వారియొద్ద సెలవు గైకొనుచు "బంధుగుప్తా! నీవింతగా భయపడవలసినపని లేదు. యశోధవళునివలన నీకణుమాత్రమైన ననిష్టము కలుగకుండునట్లు నాశక్తికొలఁదిఁ బ్రయత్నములం గావించెదను. ఇఁకమీఁదట శిథి

ల దేవాలయపాతాళగృహమునందక్క నింక నచ్చటనుమనయాలోచన సభ చేరఁగూడదు" అని నిశ్చయించి బుద్ధఘోషుఁడు వెడలిపోయెను.

ఆతఁడు పోయినతరువాత శత్రుఘ్నుఁడు మందహాసముతో "బంధుగుప్తా! భాగ్యచక్రమునందు నీకు విశ్వాసము లేదుగాదా?" అనియెను.

బంధుగుప్తుఁ డేమియు నుత్తర మీయలేదు. ఆతఁ డధోవదనుఁడై మౌనముతో నడచుచుండెను.



## పదునేడవ ప్రకరణము



"చెలీ! తరళా! నిన్నటిదినమంతయు నగపడలేదేమే? యెక్కడకుఁబోయితివి? నీకొఱ కెన్నియోసారులు మార్గమునఁ బ్రతీక్షించితిని. కాని నీజాడయేదీ? నిమిషనిమిషమునకు నీవువత్తు వని యెదురు చూచి విసిఁగిపోయితినే! రాత్రియంతయుఁ గన్నులు మూఁతలుపడనేలేదు! నీకు దయ యేది? రాత్రి నిద్దురపట్టకుండుటచే శయ్యపై నిటునటుఁ బొరలుచుఁ దపించి మూఁడవజామున లేచి కిటికీయొద్దకుఁబోయి యెంతయోసేపు నిలిచితిని. అమ్మకుఁగూడ రాత్రి నిద్రలేదు కాఁబోలును! నేనట్లు నిలిచియుండుట నామె చూచి 'అమ్మా! అచ్చటనిలిచియుంటివేమి? నిద్రపట్టుట లేదా?" అని ప్రశ్నించినది. "నేనిప్పుడే లేచితిని; ఉక్కగా నుండుటచేఁ గిటికీయొద్దకు వచ్చినిలిచితిని" అని నే నుత్తర మిచ్చితిని. తరళా! నీవు రాలేదేమి?"

అని యీవిధముగా నొక్కతే ప్రశ్న నిన్ని విధములుగా నడిగినయామె సంపూర్ణయౌవనవిలసిత యగు నొకరమణీమణి; ఆమె ప్రాయ మిరువదియేండ్లకుఁ గొంచెము తక్కువగనే యుండును. ఆమె మేనికాంతి తప్తకాంచనముం బోలి యించుక పచ్చగా నుండెను.

ఆమెసర్వాంగకములును సుందరములై సంపూర్ణములై యుండెను. సంక్షేపముగఁ జెప్పవలయు ననిన నారమణీమణి యసమానసుందరీమణి యని చెప్పినఁ జాలును. ఆమెంబోలినసౌందర్యవతి యీలోకమున దుర్లభురాలని చెప్పుట యతిశయోక్తి కానేరదు.

తరళా దేశానందులను మన మేనాఁడు విడిచిపెట్టితిమో యామఱునాఁటిసంగతి యిది! జాముపొద్దెక్కినది. ఇంతలోఁ దరళ యామందిరమునకు వచ్చి తనయజమానునితనయను సందర్శించెను. తరళ తనకన్నులఁ బడినంతనే యాసుందరీమణి ప్రశ్నించినపలుకుల నింతకుముందే వినిపించియుంటిమి.

ఆ కాంత యదేమాటగా నట్లు ప్రశ్నించుట నాలకించి తరళ నవ్వుచు "చెలీ! నిన్నటిదినమున నేను నాప్రియుని జూడఁబోయితిని. అక్కా! నేను నీదాసీత్వమును జేయుచు నాకుఁగూడ నొకప్రియతముని సంపాదించుకొంటిని " అనియెను.

ఆసుందరి వక్రదృష్టితోఁ దరళం గాంచి "అక్కయ్యా! చాలు; పొమ్ము! —కార్యమేమిచేసి వచ్చితివే?" అనియెను.

తర—(నవ్వుచు) ఏమిచేసితిని? మనసునకు నచ్చినక్రొత్తప్రియుఁడు లభించినప్పు డందఱుయువతులు నేమి చేయుదురో నేను నదియే చేసితిని! రేయంతయును గుంజవనమునఁ గడపి యరమోడ్పుగన్నులతో నిప్పుడే యిక్కడకు వచ్చితిని. మీరు గొప్పవారు! ఇదేమి యన్యాయమో గాని నిజము చెప్పినచో విసిఁగి కొందురు. చెలీ! నేను నిన్నతిసరళముగా నడుగుచున్నాను. కోపగింపకుము! వినుము—మావంటినిరుపేదలశరీరములు మాంసాస్థులచే నిర్మింపఁబడినవి కావాయేమి? మా కెట్టికోరికలు నుండఁగూడదా యేమి? మేమెట్టి వినోదవిషయములను సంతోషముతోఁ జూడఁగూడదా? అక్కయ్యా! దేవుఁడుసృష్టించినప్రేమ యంతయును మీగొప్పవారికొఱకే కాఁబోలు

నేమి? మార్గమున వచ్చుచుండఁగా భాగ్యవశమున నామనసువచ్చిన శ్యామసుందరుఁ డొకఁడు నాకు లభించినపుడు నేనాతని ధిక్కరించి రావలసినదా? నావయసుమాత్ర మేమంత యధికమై పోయినది? ఇంచుమించుగా నీకంటె నొకటి రెండేండ్లు పెద్దదాననై యుందునేమో! ఇంతేగద! చూడుము! నాపన్నొక్కటైన నూడిపోయినదా? నాకుటిలకుంతలముల వినీలకాంతు లించుకైనను బలుచఁబడినవా?

సుందరి—(కృత్రిమకోపముతో) చావుము! హా పాతకురాలా! యమమందిరమునకుఁ బ్రయాణమై పొమ్ము! ఆపాడుమృత్యుదేవత నిన్ను మఱచియేపోయినదేమి? నీకొకవల్లభుఁడు గూడ దొరకినాఁడా? అట్లయినచో ఆభాగ్యము వదలుకొని మరల నిక్కడ కేల వచ్చితివే? ఆసంతోషవార్తఁ నాకుఁ దెలుపవచ్చితివా?—తరళా! నీపరిహాసములు చాలును! ఇఁకవలదు. శీవే! చెలీ! నీవిక్కడ కెట్లు వచ్చితివే? ఏమి చేసికొని వచ్చితివో? చెప్పుము! ఇట్లాలసించినకొలఁది నాకేమియుఁ దోఁచుట లేదు.

తర—ఎట్లు వచ్చితినో నాకును దెలియదు. ఎందులకు వచ్చితినోమాత్రము తెలుపఁగలను. నీకొఱకే వచ్చితిని. అక్కా! నిజముగా నీకొఱకే—ఇంతయాత్రపడియెద వేల? కొంచెము లోపలికైనఁ బోవలదా?

సుందరి మాఱుమాటాడకుండఁ దరళ భుజముపైఁ దనుభారమును మోపి యామెను వెంటఁబెట్టుకొని లోనికిఁబోయెను తరళయామెతోఁ గలసి రెండవయంతస్తునం దొకగదిలోఁ బ్రవేశించి తలుపు మూసి గొళ్లెము పెట్టెను.

అప్పుడు సుందరి తరళకంఠమును గౌఁగిలించుకొని యత్యుత్కంఠతో " దర్శనము లభించినదఁటే? " అనియెను.

తర—ఆ! లభించినది.

ఇంక నేమియు ననక సుందరి తరళను దనవక్షమునం జేర్చుకొని యామెమోమును ముద్దు పెట్టుకొనియెను.

తరళ—(నవ్వుచు) తుదకు నేఁ జేసినయుపకారమునకుఁ బురస్కారమింతేనా?

సుంద—(మందహాసముతో) ఇంతకంటెను యోగ్యముగ బహుమానము నిన్ను దర్శించిన నీశ్యామసుందరుఁడు వచ్చి యీయఁగలఁడు లే!

తర—అక్కయ్యా! నాశ్యామసుందరుఁడా? కాక నీలోకమోహనుఁడా?

సుంద—ఎంత వాచాటవే! నీశ్యాముఁడే—రాత్రి నీవెవ్వని దర్శించుటకుఁ బోయియుంటివో యాతఁడే.

తర—(పకపకనవ్వుచు) అలాగా? వాఁడు నాకేమిబహుమానమీయఁగలఁడక్కా! అబ్బే! వాఁడు ముసలికోఁతి! రాత్రి వానిమెడకొకగొలుసును దగిలించి వచ్చితిని. ఇంకొకనాఁడుపోయి వానిఁ గావలసినట్లు వానిచేతి నైనయాటల నాడించివత్తును.

సుంద—ఎన్నిమాట లాడుచుంటివే తరళా! ఏమిజరిగినదో యొక్కమాటలోఁ జెప్పఁగూడదా? నిజముగా నీవక్కడకుఁ బోయి దర్శించితివా? నిజముగా—నిజముగా నేనా తరళా?

తర—(మెడద్రిప్పుచు) నిజముగాదక్కయ్యా! అసత్యము! తెలిసినదా? మావంటిసిరుపేదలకు నిజమాడు టెట్లు తెలియును? పరమేశ్వరుఁడా నిజమును భాగ్యవంతులపాలు చేసివైచినాఁడు.

సుందరి తరళచేయి పట్టుకొని కిటికీవఱకును దీసికొనిపోయి యట నొకయాసనమునఁ గూర్చుండఁజేసి తాను నొకపీఠమునం దాసీనయయ్యెను. అప్పుడు తరళ తనలోఁ దానేమియో గొణుఁగుకొనుచుఁ

గూర్చుండెను. అందుచే సుందరి కోపించి తరళచెంపపై నొకపెట్టు పెట్టెను. ధూర్త యగుతరళ యాప్రహారణమును సేవించియు నోర్చి ముక్తకంఠయై నవ్వుచు నెక్కింతసేపైనతరువాత "సరేమఱి.—అక్కయ్యా! ఇంకను నేను చెప్పవలసిన దేమున్నది?" అనియెను.

సుందరి కోపాభిమానపూరితహృదయముతోఁ దటాలున నవ్వలిమొగమై కూర్చుండెను. ఇప్పుడుమాత్రము తరళ యామెమనసును గరఁగింపఁ బ్రయత్నించెను. ఆమె సుందరియెదుటికి వచ్చి చేముచెంత మోముఁ జేర్చి "అక్కయ్యా! ఓయూధికా దేవీ? ఈపేదచెలిపై నింతయలుక యేటికమ్మా? బాగుగాఁ గూర్చుండుము! ఇటు తిరుగుము. నావంక నించుకంత మొగము త్రిప్పఁగూడదా? ఇదిగో! ఈసారి తప్పక నిజమైనసంగతిని దెలిపెదను. చూడుము! నావంకఁ జూడుము!" అనియెను.

ఆమాటలకు సుకుమారిణియగుయూధికహృదయము ప్రసన్న మయ్యెను. అప్పు డామె యెప్పటివలెఁ దరళవైపునకుఁ దిరిగి కూర్చుండెను. అప్పుడు తరళ మధురస్వరముతో "చెలీ! నిజముగా నేనావసుమిత్రులను దర్శించితిని. ముందుగా నేను వారి తండ్రియొద్దకుఁ బోయి" శ్రేష్ఠవసుమిత్రులయొద్దఁ గొన్నిరత్నములను బరీక్షించుటకై బంపినారు—అవి యెట నున్నవో మీకుఁ దెలియునా?" అనియడిగితిని. ఈప్రశ్నకావృద్ధుఁ డాశ్చర్యపడి" నాకా సంగతి యేమియును దెలియదు. వసుమిత్రుఁడు నాతో నీవిషయముఁగూర్చి యేమియును జెప్పలేదు." అనియెను. చూడఁగా నావృద్ధుఁడు మంచివాఁడే.—అతఁడు కాపట్యము నెఱింగినవాఁడు గాఁడు. అతనికి సహజముగనే నామాటలపై విశ్వాసము గలిగినది. అనుమానమించుకంతయును లేక తత్క్షణమే యాతఁడు నాకు వసుమిత్రుఁ డున్నప్రదేశమును దెలియఁజెప్పి యిచ్చుటకేఁ బోయి

తెలిసికొని రమ్మని నాకు సహాయునిగా నొక సేవకు నిచ్చి నన్నుఁ బంపించెను. తలఁపనితలంపుగా నిదియొకవిఘ్నము తటస్థించినదని యనుకొనుచు నెట్లో యుక్తి చేసి లేటాలున నాయింటినుండి తప్పించుకొని బయటఁ బడితిని. క్రమముగా నేను వసుమిత్రుఁ డున్న ప్రదేశమునకుఁ బోయితిని. నగరమునకు బాహ్యమునం దున్న యొక్క పాతవిహారమునం దాతఁ డుంపఁబడియెను. ఆతఁడు సంపూర్ణముగాఁ గారాబద్ధుఁడుగాఁడు; గాని యటనుండితప్పించుకొనిపోవుట కాతని కవకాశము లేదు. విహారమందలిభిక్షులలో నెవ్వరో యొక్క రెల్లప్పుడు నాతనిఁ గాచుకొని యుందురు. కావలయు ననియే వారిట్టి కట్టుదిట్టముల నేర్పఱచి యున్నట్లు కనఁబడుచున్నది—" అనియెను.

ఇంతవఱకును దీర్ఘశ్వాసములను విడుచుచుఁ దలవంచుకొని కూరుచుండినయూాధిక యప్పుడించుక తలయెత్తి "చెలీ! తరళా! ఆతఁడు నీతో నేమైన మాటలాడెనఁటే?" అనిప్రశ్నించెను.

తర.— నేను వసుమిత్రునితో నెన్నియో మాటలాడితిని.

యూాధి—(ఆత్రముతో) ఏమేమిమాటలాడితివి?

తర—నీవు నాకుఁ జెప్పినసంగతులన్నియును దెలిపితిని. అంతే గాక యింకను నూఱుమాట లెక్కువగా నాతనితోఁ జెప్పి వచ్చితినమ్మా!

యూాధి—ఆలాగఁటే! ఏమేమిమాటలాడితివో చెప్పవా?

తర— నేనంటినిగదా — సాగరదత్తశ్రేష్ఠితనయయగుయూాధికాదేవికి నేను దూతికనై—అయ్యో! కోపపడకమ్మా!

యూాధిక యప్పుడు తరళపైఁ దీవ్రదృష్టిప్రసారముం గావించుచుండెను.

తర—చెలీ! కోపింపకుము—"యూధికా దేవికి దూతికనై నేను మీ దర్శనమునకు వచ్చియుంటిని. మీ వియోగతాపముచే మా యూధిక దినదినమును శుష్కించిపోవుచున్నది! కొలఁదికాలములో నే యానవకోమలకుసుమము వాడి వరుగై చేలఁ గూలుననుటకు సందేహమేమున్నది?" అని చెప్పితిని— ఇంకను నేమంటినో నీకుఁ దెలియునా?

యూధి—ఏమంటివి? చెప్పుము!

తర—చెప్పెద నుండుము!" అమృతకుసుమము భూపతితము గాఁ గూడదని మీ దయార్ద్రహృదయమునకుఁ దోఁచినచో— మీ కిష్టమున్నచో—మా యూధిక వసంతర్తువునందలి వెన్నెలరాత్రివేళ సుందరపురుషరూపమును ధరించి—"

యూధిక సుందరవదనమండల మారక్త మయ్యెను. ఆమె యించుక కోపమును నటించుచు "సరే! తరువాత నేమి జరిగినదో చెప్పుము!" అనియెను.

తర—(నవ్వుచు) ఇదిగో! అక్కా! నీ రసికత్వమంతయు నిప్పు డేమైపోయినదమ్మా? కేవలము వెఱ్ఱిదానవై పోవుచున్నావేమి?

యూధి—(దీనస్వరముతో) చెలీ! నీపాదములకు నమస్కారము! పరిహాసముల నొకప్రక్క నుంచుము, ఆయన నీతో నేమి చెప్పిరో చక్కఁగా వినిపింపుము.

తర—వారితో నే నాడినమాటల నుగూర్చి ముందుగాఁ జెప్పనిచ్చెదవా? నేను వారిని దర్శించినంతనే ముందుగా "మహారాజా!" అని సంబోధించితిని. ఔను. వారిప్పుడు మఠమునందు భిక్షువులై యున్నారు. కావున వారి నట్లే పిలువవలయును. నేనప్పుడు "మహారాజా! మీ జీవితమంతయు మీ రీవిధముగనే గడపఁదలఁచితిరా?" అని ప్రశ్నించితిని. అందుల కాయన "అట్లే తోఁచుచున్నది. ఔను!" అని ప్రత్యుత్తరమిచ్చిరి.

యూథిక యోష్ఠాధరములు సంచలింపఁదొడంగెను.

తర—చెలీ! చూచినతోడనే నేనాతని గుర్తింపఁజాలకపోయితిని సుమా; ఆతనియుత్తమాంగమున నళివినీలంబు లగు నెఱకురులు లేవు. ఆతనివస్త్రంబులయందు నీటుగోటుల జాడయే లేదు. ఇట్టిస్థితిలో నాతని నెవ్వ రానవాలుపట్టఁగలరు? ఆతనిశిరస్సు ముండితమైయున్నది. ఉపవాసములచే నాతనిమొగము వాడి వెలవెలపోవుచున్నది. మలినంబు లగు కాషాయవసనంబులచే నాతనిసుకుమారదేహ మాచ్ఛాదింపఁబడియున్నది! మొదటినుండి తుదవఱకు నాతనియందు మార్పె యగపడుచున్నది. అక్కా! ఆతనియాకారమే మాఱిపోయినది. ఆతని మునుపటిపేరుఁగూడ మార్చివైచిరి. వసుమిత్రుఁ డనునామము నాధారముగఁ జేసికొని వెదకినచో నిప్పు డాతనిజాడ యెట్లు తెలియును? ఆతఁడెవ్వఁడో తెలియుటగూడ నసాధ్యమైపోయినది. ఆతనినూతననామ మేమియో తెలిసినదా?

యూథిక యధోవదనయై యేమియు మాటాడక కూర్చుండియుండెను. తలను బైకెత్తి తరళవంక నొకసారి చూచుటకైనను నామెకు ధైర్యము కలుగదయ్యెను.

తర—సోదరీ! ఆతనిక్రొత్తపేరు జినానందుఁడఁట! తెలిసినదా! సరిపడినదా! చెలీ! నివ్వూరక భయవిహ్వలవైపోవుచున్నావు! నీభయము నిరాధారమైనది. చారుమిత్రుఁడు తన యేకపుత్రుఁడగు వసుమిత్రుని దేశత్యాగునిం గావించుట యాతఁడు నిన్నుఁ బెండ్లియాడు నేమోయనుకొనుటచేఁ గాదు! చారుమిత్రుని మరణానంతరమున నాతనియనంతసంపద యంతయు వసుమిత్రునకు లభింపఁగలదనియే బౌద్ధులు "నీపుత్రుని బౌద్ధభిక్షునిం గావింపుము!" అని చారుమిత్రున కుపదేశించిరి. ఆతఁడు భిక్షువైనచో బౌద్ధులకందఱకు నాయాస్తిపై సమానాధికారము గలుగును. ఆధనమంతయును బౌద్ధసంఘమునకుఁ జేరును.

ఇందుకొఱకే బుద్ధమతాభిమాని యగుచారుమిత్రుఁడు తన యేక పుత్రుని బౌద్ధభిక్షునిగాఁ జేసివైచినాఁడు.

యూధి—(వెక్కుచు) అయ్యో! చెలీ! ఇఁక నుపాయ మే మున్నదే!

తర—(దృఢస్వరముతో) ఉపాయ మింకేమున్నది? ఈశ్వర సాహాయ్య మొక్కటియే యుపాయము. ఇఁక నెట్టిగతియును లేకుం డుటచే నేను భగవన్నామమును జపించుకొనుచు మఠమునుండి తిరిగి వచ్చుచుంటిని. ఆకారణముననే కాఁబోలును! ఎవరేలుంగుదురు?— త్రోవలో నాకస్మికముగా నొకయుపాయము తోఁచినది. ఆమఠము నందు దుష్టభిక్షులు కొందఱున్నారు. అందుఁ బ్రౌఢవయస్కుఁ డగు భిక్షువొకఁడు వారి కాచార్యుఁడై యున్నాఁడు—తిరిగి వచ్చునరికిఁ జీకటిపడుటచే నే నతిశీఘ్రగమనముతో వచ్చుచుంటిని. ఇంతలో నెవ్వరో వెంబడించి వచ్చుచున్నట్లు నాకుఁ దోఁచినది. అందుచే మొట్టమొదట నేనించుకభయపడితిని. తరువాత రెండుమూఁడుసారులు నేనాయంధకారమున దాఁగి పోనుష్టుని దప్పించుకొనఁ బ్రయత్నించి తిని. ఎంతచేసినను వాఁతఁడు నావెంటవచ్చుట మానఁడయ్యెను. రెండుమూఁడుగడియ లీవిధముగా దాఁగుడుమూఁతలైనపిమ్మటఁ దుదకు నాకాతని మొగము కానఁబడియెను. ఆనిమిషమునందే నేను మోహా విహ్వాల నై పోయితిని. నాసర్వాంగకములును బులకితము లై పోయినవి. అక్కా! ఏమని చెప్పుదును! బ్రహ్మదేవుఁ డింతటిమహాసుఖానుభవము నానుదుట వ్రాసియుంచె నని భావించితిని. ఏమందువా? నన్నట్లు వెంబడించి వచ్చినవాఁ డామఠమునందలి యొకముసలికోఁతి!

యూధి—అలాగా! ఓరిపాడుముసలికోఁతీ!

తర—అక్కా! నీకు నిజము చెప్పుచున్నాను. నీవు వసుమిత్రు ని మోహనరూపముపవంక గడియలకొలఁది నొక్కటేచూపుగఁ జూచు

యుందువుగదా! అప్పుడు నీకొక్కసారియైనఁ గనుతెప్పపాటుండదు గదా! దానికి గారణ మేమని నేను వితర్కించుకొనుచుండెడిదానను, కాని, యిప్పుడు నాకాయర్థము చక్కఁగా బోధపడినది సుమా!

అని చెప్పి తరళ యొక్కనిట్టూర్పు విడిచెను. యూథిక యీ మాటల కేమియుఁ బ్రత్యుత్తరమీయలేదు; గాని తరళ కొకచిన్న చెంపపెట్టుమాత్రము బహుమానమిచ్చెను.

తర — అక్కా! నీకు నామాటలయందే విశ్వాసము లేదు. ఇఁక నీవంటి యరసికురాండ్రెదుట నీలనీరదసన్నిభంబగు నా ప్రియుని కృష్ణరూపముం గూర్చి నేనేల వర్ణింపవలయును? నీమాట యే చెప్పెదను వినుము. అనంతరము నేను దాఁగియున్నచోటు వదలి వచ్చి నాశ్యామసుందరునిం గలసికొని చాలసేపు మాటలాడితిని. చెలీ! మానవు లొక్కసారి ప్రేమోన్మాదమునఁ బిచ్చివారైపోయినచో నిఁకఁ జావుకోఁగాని వారి కాపిచ్చి వదలదు సుమా! ఆసెట్టిబిడ్డతో మోమున మోముఁ జేర్చి కూర్చుండి నీ వేవిధముగా దినములను గడపియుంటివో యీసంగతి యంతయు మఱచిపోయితివి కాఁబోలును! వసంతమాసమునఁ బండువెన్నెలవెలుంగుచే నతిమోహనంబగు యామినీసమయమున శ్యామసుందరుఁడు రాధ నెట్లు విడిచిపోఁగలఁడు? అగ్నిగుండ మచ్చట లేదు — కాని వైశ్వానరునకు మాఱుగా జందమామనే సాక్షిగఁ జేసికొని మేమిరువురము నప్పుడు గాంధర్వవిధిని పెండ్లి చేసికొంటిమి. అక్కా! ఇంకేమి చెప్పవలయును ?

యూథి — (విసుఁగుతో) తరళా! నీవు కేవలమును దుష్టురాలవే! నీపరిహాసము లేమియు నాకు రుచించుట లేదు. నేను నీపాదములపైఁ బడి ప్రతిమాలుకొనియెదను. ఇఁక నేమున్నను నాతోడు! జరిగినసంగతి యంతయును సరళముగాఁ జెప్పవే! నిజము చెప్పవే!

తర — ఇదేమి సోదరీ! నీకు నీమాటయే గాని మఱియొకటి లేదు. గ్రీష్మ వసంతనవమాలికవలె నభినవయౌవనవతివి. నేనో వయ

సు చెల్లిన ముసలిదానను. ఆహా! అయినను నేనుగూడ మానవినే గదా! నేనమాత్రము ప్రేమజాలమునం దెన్నటికిని జిక్కనే గూడదా ?

యూధిక కోపముతో లేచిపోవుటకుఁ బ్రయత్నించెను. కాని తరళ యామెచేయి పట్టుకొని కూర్చుండఁబెట్టి "అక్కా వినవమ్మా! అన్నియు వరుసగాఁ జెప్పెదను. ఇంతయాత్రపడియెద వేల? ఆపాడు మునుకఁడు నాకొఱకు నిశ్చయముగనే యున్మత్తుఁడై పోయెను. అం దుచేతనే యాతఁడు నన్ను విడువక వెంబడించెను. నేనట్లు బయటికిఁ వచ్చినతరువాత నాతఁడు నాపాదములపైఁ బడఁబోయెను. నేనునాతని ప్రేమోన్మాదచేష్టితముల కుత్తేజనముం గల్పించి యాతఁ డాకసము నందలిజాబిల్లికై చేతులు సాచునట్లు చేసితిని. నేనెట్లయిన మిమ్ము విడిపించెద నని వసుమిత్రునికడ శపథము చేసి వచ్చితిని. కాని యే యుపాయముచే నా కార్యము సిద్ధించునని త్రోవపొడుగునను నేనా లోచించుకొనుచునే వచ్చుచుంటిని. అప్పుడు దయామయుఁడగుదే వుఁడు నాకుఁ దగినయుపాయముం జూపించినాఁడు! అప్పుడు నేనీవాన రునిసాహాయ్యముచే నావసుమిత్రుని బంధముక్తునిం గావింపఁగలనని నిశ్చయించుకొంటిని. కాని యేమి చేయవలయునో యింకను దోఁచు ట లేదు. ఇప్పుడావిషయమై నన్నేమియు నడుగవలదు. అమ్మగారు నన్ను,గూర్చి యడిగినచో నీకిష్టమువచ్చినమాట చెప్పివేయుము, తరళ తనపినతల్లికొమార్తె పెండ్లికి దూరదేశమునకుఁ బోయినదనియు నైదాఱుదినములలో రాఁగలదనియు సమాధానము చెప్పుము! నిజమే సోదరీ! నా చెల్లెలిపేరుగూడ యూధికయే!

యూధి——నీమాటలు మండ! నోరుమూయుము.

తర——(పకపకనవ్వుచు)ఇప్పుడు నోటికొగ్గిగాద క్కా!

యూధి——కాక,మఱియేమి?

తర—"ఇప్పుడు నీనోటఁ జక్కెరపడఁగలదు" అని యూరింప వలసినసమయము!

అని పలికి, తరళ నవ్వుచునే వెడలిపోయెను.



## పదునెనిమిదవ ప్రకరణము.



తరళ తనయజమానునియిల్లు వెలువడి రాజమార్గమునం బ్రవేశించి బజారువీథికిఁ బోయెను. ఆమె యచ్చట మూఁడంగడులలో మూఁడువిధములగు వస్త్రములు పురుషవేషోచిత వస్త్రములు, దోవతులు ఉత్తరీయములు, జోళ్ళు, తలగుడ్డలు మొదలగునవి కొనెను. తరువాత నామె యామూటను దనపయ్యెదచాటున నుంచుకొని తిన్నగాఁ దన యింటికిఁ బోయెను. నగరమునకుఁ జిట్టచివరఁ దరళపినతల్లికుటీర మొకటికలదు. తరళయిల్లుగూడ నదియే. ఆమె యెప్పుడు నేవేవో పనులకొఱకు రాత్రులయందుఁగూడఁ దనయజమానుని మందిరము నందే యుండుచుండును. కాని యప్పుడప్పుడు యజమానుని యనుమతిం బడసి పినతల్లియింటికి వచ్చి రెండుమూఁడు దినములుండి పోవుచుండును. తరళ పినతల్లి మిగులవాచాట—అందుచేఁ దరళ యామె యింటఁ దఱచుగా నుండదు. ఆమెపినతల్లికిఁ జాలగుణము లున్నవి. ఆమెకుఁ గన్నులు బాగుగా నగపడవు. అట్లే చెవులును వినఁబడవు. కాని యామె కలహములయందుమాత్రము గడిదేఱినదే! ఆమెముఖళశక్తి యెదుట సామాన్యముగా నెవ్వరును నిలువఁజాలరు.

తరళ యట్లు పినతల్లియింటికి వచ్చి యామూట నొకగదిలో దాచియుంచి భోజనము చేసినపిమ్మట హాయిగా నిదురించెను. మూఁడు జాములు గడచిన తరువాత నామె లేచి తలదువ్వుకొని, జడవైచికొని, తనకింపగునట్టు లతిజాగ్రత్తతో నలంకరించుకొని యాకుటీరమునుం

డి వెలువడి పోవునప్పుడు పినతల్లి తో " పిన్నీ! అమ్మగారియొద్ద సెలవు గైకొని నేనిందు రెండుదినము లుండవచ్చితిని. నేనిప్పు డొక్కపని కొఱకుఁ బోవుచున్నాను. మరల వచ్చుసరికిఁ జీకటిపడు నేమో! నేను వచ్చునప్పుడు నాకుఁ దోడుగా నామిత్రురాలి నొకతెను దీసికొని వత్తును" అని చెప్పెను.

అనంతరము తరళ వెలుపలికి వచ్చి దక్షిణాభిముఖంబుగఁ బోవఁ దొడంగెను. అప్పుడు సూర్యాస్తమయ మగుట కెంతయో యవకాశము లేదు. అప్పుడు తరళ జనసంచారబహుళం బగురాజమార్గమును విడిచి మహానగర బాహ్య ప్రదేశమున నున్న యుపనగరమునకుఁ జేరుకొని యాదారిఁ వచ్చినత్రోవనుబట్టి బౌద్ధమఠముకడకుఁ బోవుచుండెను. కాని, యామె కొంతదూరము పోవునప్పటి కాత్రోవ ప్రక్కనున్న తాళవనమధ్యమునందలి పుష్కరిణిచెంతఁ గూర్చుండి యామార్గమున వచ్చుచుఁబోవుచుండువారి నతిజాగరూకతతోఁ బరీక్షించుచున్న యొకపురుషుఁ డామెకుఁ గానవచ్చెను.

ఆవ్యక్తి కన్నులఁ బడినంతనే తరళ సరళమార్గమును వీడి మెల్లగా నాతాళవనమునఁ బ్రవేశించి యడుగులచప్పుడు వినఁబడకుండ నెట్లో యాతని వెనుకవైపునకుఁ బోయి చటాలున నాతని కన్నులను మూసెను.

ఆపురుషుఁ డప్పుడు తరళచేయి పట్టుకొని బాగుగాఁ దడవిచూచి బిగ్గఱగానవ్వుచు "ఓహో! తెలిసినది! తెలిసినది! తరళా! నిన్ను గుర్తించితిని! ఇట్టి కోమలహస్తము లీపాటలీపుత్రనగరమున నీకుఁ గాక మఱి యెవ్వరికున్నవి?" అనియెను.

తరళయుఁ బకపకనవ్వుచుఁ జేతులను దీసివైచి "ఆచార్యా! మీరిక్కడ నీపుష్కరిణీతీరమునం గూర్చుండి యేమి చేయుచున్నారు?" అని ప్రశ్నించెను.

దేశాచార్యుఁడు—(తరళమనోహరరూపము నేకాగ్రదృష్టిం గాంచుచు) తరళా! ఏమి చేయుచుంటివా? దప్పిగొన్న చకోరముంబో లి నీసుందరవదనచంద్రోదయమునకై ప్రతీక్షించుచుంటిని. కాని యెంత సేపటికిని జంద్రోదయము కానే కాదయ్యెను! తరళా! ఇఁక నడువుము! మనము శీఘ్రముగఁ బోవుదమురమ్ము!

తర—ఎక్కడకు?

దేశా—ఎక్కడ కనియడుగ వేమి? కుంజమునకు.

తర—(నవ్వుచు) మీరు కాషాయవసనధారులగు సన్యాసులుగదా! కుంజముతో మీకేమిపని?

దేశా—నీవు రసికశిరోరత్నమవుగావా ?

తర—నరే—ఆమాట కేమి? మీకుంజమెక్కడ నున్నది?

దేశా—(ఆనందోత్కంఠుఁడై) ఏమి! సంఘారామమునందు-

తర—ఏమంటిరి? మీ యేకాంతస్థలము సంఘారామమా? ఆ నాఁడు నేనక్కడకు వచ్చినప్పు డచ్చట నెందఱో భిక్షులు నాకగపడిరి. ఆపాడు భిక్షులందఱును నిప్పుడు మిమ్ముఁ బట్టుకొని పరాభవింప కుందురా?

దేశా—తరళా! నీతో నసత్యము చెప్పుటవలన నాకేమిలాభ మున్నది? సంఘారామమునఁ గూడ గావలసినన్ని యేకాంతస్థలము లున్నవి. నీకాసంశయమేల? నాతో బయలుదేఱి రమ్ము! అక్కడ నన్ని సంగతులు నీకే తెలియఁగలవు.

తర—అట్లయిన నడువుఁడు! కాని—మీరు నాకు ముందుగ దూరమున నుండి నడచిపోవలయును.

దేశా—(అనిష్టముగా) సరే—అట్లే కానిమ్ము.

దేశానందుఁడు ముందు నడవఁ దొడంగెను. ఆతని కనతిదూర మునఁ దరళ యాతని వెంబడించుచుండెను. అప్పటికి సాయంకాల

మయ్యెను. అంధకారము నలుదెసల మెల్ల మెల్లగ నలముకొనుచుండె ను. ఉపనగర రాజమార్గ మప్పుడే నిర్జనమయ్యెను. దేశానందున కల వాటే గావున నాచీకటిలోఁ గూడ నాతఁ డించుకంతయును దడఁబడక యాత్రోవను నడచుచుండెను. కాని తరళకుమాత్రి మడుగులు సరిగాజరగుట లేదు.

కొంతసేపటి కాయిరువురును శిథిలమందిరమును సమీపించిరి. అప్పుడాచార్యుఁడు తనయుత్తరీయపుఁ జెంగునఁ గట్టియున్న తాళపుఁ జేతులను దీసి యామందిర ద్వారమును దెఱచి "తరళా! లోనికి రమ్ము" అనియెను.

తరళ యిప్పుడు చిక్కులోఁ బడితినని శంకించెను. దేశానందుఁడు చెప్పినట్లు నిజముగా నది యేకాంతస్థలమే. ఇప్పుడేమిచేయఁగలదు? ఈనిర్జనస్థలమున నీమహామూర్ఖునితోఁ దరళ యిప్పుడు లోనికిఁ బోవలయునా? పోక యేమనఁగలదు? ఆమెయుద్దేశము సిద్ధించుటకై యిప్పు డుపాయ మేమున్నది? ఆపిచ్చివానిని దనకార్యమునం దుపయోగించుకొనుటకు మార్గ మేది? తనంతనయొదవిన యీయాపదను నుపయోగించుకొనుట యెట్లు? తరళహృదయ మిప్పుడాలోచనలతోఁ దడబడిపోవుచుండెను. ఇప్పుడీయున్మత్తుని బారినుండి తప్పించుకొనుట కుపాయ మేమియని యామె యన్నిటికంటెముఖ్యముగ నాలోచింపఁదొడంగెను.

తరళ లోపలికి వచ్చుట కాలస్యము చేయుచుండుటం గాంచి దేశానందునకు ధైర్యము నశించిపోవుచుండెను. అప్పుడాతఁ డించుక కోపముతో "ఇదేమితరళా! లోపలికి రావేమి? అక్కడ నూరక నిలువఁబడి యేమిచేయుచున్నావు? పిచ్చిదానివలె నగపడుచున్నావే! నిజమే! ఎంతతప్పు! ఎవ్వరైన వచ్చి నిన్నును, నన్ను నిట్టిస్థితిలోఁ గాంచినచో నేమగుననుకొన్నావు? రా! లోపలికి రా!" అనియెను.

ఇఁకఁ దరళ యేమిచేయఁగలదు? ఏయుపాయమును దోఁచకుండుటచే నామె మెట్లెక్కిపోయి గడపపైఁ గూర్చుండెను.

అందుచే దేశానందునకుఁ గోపము వచ్చెను. అతఁడు కనుబొమలు ముడివైచి "ఇదేమే! తరళా! ఇంతదూరమును నడచివచ్చి యీమెట్లవిూఁదికిఁ గూడ వచ్చి యిక్కడఁ గూలఁబడితి వేమి? లేచి లోపలికి రమ్ము! లే! తలుపు మూసెదను!" అనియెను.

తర—(గద్గదస్వరముతో) నా కేమీ గాని భయముగా నున్నది.

దేశా—వెఱ్ఱిదానా? భయమెందులకు?

తర—ఈయంధకారము చాలభయంకరముగా నున్నది. ముందు లోపల నొకదీపమును వెలిగింపుఁడు!

దేశా—(కోపముతో) తరళా! నీకు మతిపోలేదుగద! దీపము వెలిఁగించినచో నిప్పుడే మనజాడ యందఱికిని దెలిసిపోదా? సెబాసు! మంచిదానవే!

తర—జాడఁ దెలిసికొనుట కిచ్చటి కెవ్వరు వత్తురు? దీపము వెలిఁగించినఁగాని నేను లోపల నడుగుపెట్టఁజాలను. నాకుఁ జాలభయముగానున్నది.

ఇఁక నుపాయాంతరము లేకుండుటచే దేశానందుఁ డెట్లయిన దీపము వెలిఁగింప నిశ్చయించుకొని యాయంధకారమున దీపపుబ్రిమిదకై వెదక నారంభించెను. తరళ చీకటిలోనే గడపయొద్ద నిలువఁబడియుండెను.

ఇంతలో దూరమునుండి యెవ్వరో మాటలాడుచున్న ధ్వని తరళకు స్పష్టముగా వినవచ్చెను. తోడనే యామె కళవళముతో దేశానందు నుద్దేశించి "ఆచార్యా! ఆచార్యా! త్వరగా రండు! ఎవ్వరో మనుష్యు లిటుత్రోవనే వచ్చుచున్న ట్లున్నారు!" అనియెను.

తరళభయముతోఁ బలికినయీమాటల నాలకించి దేశానందుఁడు దీపపాత్రిను వెదకుపనిని మానివైచి చటాలున ద్వారమునొద్దకు వచ్చెను. అప్పు డాయిరువురును విస్ఫారితనయనములతోఁ దమ

చూపులను దూరమునకుఁ బ్రసరింపఁజేసిరి. ఔను, నిజముగా నిరువు రుమనుష్యు లప్పు డామందిరము నొద్దకే వచ్చుచుండుట వారికి దృగ్గో చరమయ్యెను. దేశానందుఁడు కిక్కురుమనకుండఁ దత్క్షణమే తరళఁ చే యిపట్టుకొని బలవంతముగా నామెను లోనికీడ్చుకొనిపోయి యామం దిరమునందలివిశాలదేవమూర్తి వెనుకను దాగియుండెను.

ఆవచ్చువా రిరువురును గొలఁదిసేపటిలోనే మందిరద్వారము చెంతకు వచ్చిరి. వారిలో నొకఁడు ద్వితీయునితో "ఆఁ! ఇదేమి? వ జ్రాచార్యా! మందిరద్వారములు తెఱవఁబడియేయున్నవి?" అనియెను.

వజ్రా—(మెల్లెక్కిపోయి చూచి) ఔను స్థవిరా! మందిరద్వా రము నిజముగ నేవివృతమైయున్నది. బంధుగుప్తా! మీ దేశానందుఁ డు కేవలము నున్మత్తుఁడై పోవుచున్నాఁడు సుమీ! నేఁడే నీవీమందిర సంరక్షణముకొఱకు వానికి మాఱుగా మఱియొక్కని నియోగింపు ము! ఇంతకంటె నిఁక వేఱుమార్గము లేదు.

అంత నయ్యిరువురును లోపలఁ బ్రవేశించి తలుపులను మూసి కొనిరి, అప్పుడు బంధుగుప్తుఁడు దీపపాత్రమును వెదకి చూచి చటా లున దీపమును వెల్గించెను. అప్పు డాయిద్దరును లోపల నొక్క చోఁ గూర్చుండిరి. దేవమూర్తి వెనుకను దాగియున్న దేశానందుఁ డ ప్పుడు ప్రచండవాతాహతిం దూలుకదళీభూరుహముంబోలి వడఁకిపో వుచుండెను.

శత్రుసేనుఁడు—సంఘస్థవిరా! నేఁడు నీమొగమింతగా వాఁడి పోయినదేమి?

బంధు—వజ్రాచార్యా! కారణమేమున్నది? కేవలమును య శోధవళుని వలనిభయముచేతనే—

శత్రు—నీవాయశోధవళునికొఱకింతగా భయపడవలయునా?

బంధు—(కంపితకంఠముతో) వజ్రాచార్యా! అంతయును మఱచియేపోయితివా? ఆతఁడు మరణించె ననునుద్దేశముతోనే నేనింతవఱకును నిర్భయముగా నుంటిని.

శత్రు—పూర్వము నీవింతగా మరణమనిన భయపడెడివాఁడవు గావే!

బంధు—నేనిప్పుడైనను మృత్యువునకొఱకు జంకుట లేదు. ఎవ్వరివలన మరణము సంభవించినను నేను బెదరువాఁడను గాను. మఱి—ఏమని చెప్పుదును? యశోధవళుని పేరు విన్నంతనే నాయొడలు వడఁకిపోవుచున్నది! ఆతనిపుత్రునిమరణవార్త సర్వమును నాతని చెవులఁబడియుండు నేని నన్నాతఁ డతిదారుణంబులగు బాధలపాలు గావించి చంపక యూరక విడుచువాఁడు గాఁడు! సామాన్యమరణమనిన నాకెంతమాత్రమును భయము లేదు. కాని, శరీరమునందలి ప్రత్యవయవమును దిలమాత్రంబులగుఖండములుగాఁ జేసివైచుచున్న యామరణమునకే నేనింత భయపడుచున్నాను.

శత్రు—బంధుగుప్తా! కీర్తిధవళుని నీవెట్లుచంపితివి?

బంధు—ఆసంగతి నీకేమియుఁ దెలియనే లేదా?

శత్రు—నాకెట్లు తెలియును? నీవెన్నఁడైన నాతో జెప్పితివా?

బంధు—లేదు—ఆసంగతు లింతవఱకు నేనెవ్వరికిని దెలుపనే లేదు. ఇప్పుడు నీకుఁ జెప్పెదను వినుము.

అని యాతఁ డొక్కించుక సేపాలోచించి "వజ్రాచార్యా! వలదు. నేనావిషయముంగూర్చి చెప్పఁజాలను. నాకేమోగాని సర్వాంగకములును వడఁకిపోవుచున్నవి" అనియెను.

శత్రు—(బిగ్గఱగానవ్వుచు) బంధుగుప్తా! నీయున్మాదము దినదినాభ్యుదయముం గాంచుచున్నదిసుమా! నావృత్తాంతమును దెలిపినను, దెలుపకపోయినను నాకెట్టికష్టమును లేదు. కాని—ఈయే

కాంతస్థలమునఁ జెప్పుట కంతభయపడవలసినపని యేమున్నది? మందిరద్వారములను బంధించి యుంటిమిగదా ! ఇక్కడనుండి మనమాటలు బయటివారి కెంతమాత్రమును వినఁబడవు. ఈమందిరమున దీపము వెలుఁగుచునే యున్నది. ఈవెలుఁగులో బాగుగఁ బరిశీలించి చూడుము ! నీవు—నేను—ఈదేవమూర్తి—ఇంతకు దప్ప నితరు లెవ్వరైన నున్నారా? ఇఁక నీకు భయమేల ?

బంధు—ఇటునటుఁజూచి 'నిజమే ! నేనకారణముగనే బెదరుచున్నాను—సరే—ఇఁక వినుము ! కీర్తిధవళుఁడు వంగదేశమునఁ దనపన్నులను గైకొనఁదలఁచి వచ్చినప్పుడు పూర్వదేశమునందలిసంఘములు మహోకష్టస్థితిలో నుండెను. ధవళవంశమువారెల్లరును, రాజనీతికుశలురును, రణకళావిశారదులు నైయుండిరి. ఇప్పటికినిగూడ వారట్లేయున్నారు. అనేకపర్యాయము లాహవరంగములఁ బరాజితులగుటచే నచ్చటివిప్లవకారులందఱును సంధికొడంబడుటకు సంసిద్ధులైయుండిరి. కీర్తిధవళుఁడుగూడ వారినెంతమాత్రమును శాసింపక మనఃపూర్వకముగా క్షమించి యందఱను వశపఱచుకొనియెను. అప్పుడు నేను వంగదేశమునందుంటిని. కాని సధర్ములగునచటిప్రజలను గీర్తిధవళునకు విరుద్ధముగా విజృంభిపఁజేయుట కెంతప్రయత్నించినను నాతరముగాకపోయెను. నేనెంతయో యాలోచించితిని. యశోధవళునితనయుఁడు వధింపఁబడినచేగాని సంఘకార్యములు నిష్కంటకముగా నిర్వహింపఁబడుట దుస్తరమని నాకుఁ దోఁచెను. ఎంతప్రయత్నించినను వంగదేశవాసులలో నొక్కఁడైనను గీర్తిధవళునిపైఁ జేయెత్త నంగీకరింపఁడయ్యెను. ఎల్లప్పుడు నంగరక్షకసేనాపరివృతుఁడై యుండుటయే గాని యాతఁ డొంటరిగా బయలు వెడలఁడయ్యెను. అందుచే నాకుఁ దగిన యదను దొరకలేదు. కీర్తిధవళుఁడు ప్రతిదినమును సాయంకాలమునఁ దారాదేవియాలయమునకుఁ బోవుచుండు నను సంగతి నాకుఁగొంత కా

లమునకుఁ దెలియవచ్చెను. అదిమొదలుగ నేనాతని ననుదినమును వెంటాడుట కారంభించితిని. కాని యొక్కవాఁడైన నాతని స్పృశించుటకుఁగూడ నాకు ధైర్యము గలుగదయ్యెను. ఒకనాఁ డా దేవికి జరుగుచున్న మహాత్మ్యవసమయమున మనసద్ధర్మ్ములకును, బ్రాహ్మణులకును గలహము సంభవించి యొండొరులఁ గొట్టుకొన నారంభించిరి. అప్పుడు నేనుచితసమయమును గనుపెట్టి దూరమునఁ బొంచి యుండి కీర్తిధవళునిపై గుఱిపెట్టి యొకవాఁడిబాణమును విసరితిని. ఆదెబ్బతో నాతఁడు గుభాలునఁ గ్రిందఁ బడిపోయెను. ఆసమ్మర్దసమయమునం దొక్కరును నన్నుఁ గాని, కీర్తిధవళునిగాని చూడనేలేదు. కీర్తిధవళుఁడు దేవీమందిరము నెదుటఁ బడిపోయెను. అంధకారమునం దను చరు లాతని వెదకికొనుచుండిరి. నేనును వారిని దప్పించుకొనిపోయి యాతనిం జూచితిని. కీర్తిధవళుఁ డింకను సజీవుఁడై యుండెను. ఆతనికిఁ దగిలినదెబ్బ యంతయపాయకరమైనది గాదు. కాని యాతఁడు మూర్ఛితుఁ డయ్యెను. నేనప్పు డతివేగముగ దేవీగర్భగృహమునం బ్రవేశించి యామూర్తిహస్తమునందున్నఖడ్గమునుదీసికొని బయటికి వచ్చి యట్లుపడియున్నకీర్తిధవళుని కాలుసేతులను ఖండించివైచితిని. ఆ యాతనచే నాతని కొకింత తెలివి గలిగెను. శరీరమునందలిరక్తమంతయు గళితమై పోవుచుండుటవలనను, దారుణయాతనవలనను నాతఁడధికతృష్ణార్తుఁడై క్షీణస్వరమునఁ బలుమాఱు జలముకొఱకుఁ బలవించెను. శాత్రవరుధిరసందర్శనానందోన్మత్తుఁడ నగు నే నాతని మరణకాలదీనప్రార్థనమునించుకంతయు లక్ష్యము సేయలేదు. జల మొక్కచుక్కయైన నొసంగక చలము సాధించి బాధించి సంఘవైరి యగు నాతని నీవిధముగా సంహరించి సంతుష్టినందితిని—"

దేవీవిగ్రహము వెనుక దాగియున్నతరళ కీర్తిధవళుని దారుణవధావిధానము నాకర్ణించి భయముచే గడగడవడఁకఁదొడంగెను.

తత్క్షణమే యామెయొడలంతయుఁ గంటకితమైపోయెను. దేహమంతయును స్వేదసిక్తమైపోయెను.

శత్రుసేనుఁ డొక్కింతసేపటివఱకు నూరకుండి పిదప నొక్క వేఁడినిట్టూర్పు విడిచి "బంధుగుప్తా! నీకీబౌద్ధసంఘమున భిక్షుదీక్ష యెవ్వరొసంగిరో గాని నీవు నిశ్చయముగా మానవాకారముతో నున్న దానవుఁడవేసుమా?" అనియెను.

బంధు—వజ్రాచార్యా! ఇఁక నామాట యెత్తవలదు. ఆనాఁడు మొదలనుదినమునందును నేను భయంకరస్వప్నములను గాంచుచునే యున్నాను. వ్రణపీడితుఁడగుకీర్తిధవళుఁడు దేవీమందిరము నెదుటఁ బడియున్నట్లును, గరుణరసాపూరితస్వరమున మృత్యుయాతన ననుభవించుచుఁ దృష్ణోపశాంతికై దీనత్వముతో నన్ను నీరడుగుచున్నట్లును, నేనాతనిరక్తప్రవాహముం గాంచి యున్మత్తుఁడనై నృత్యము చేయుచున్నట్లును, గలలఁ గాంచుచునే యుంటిని. యశోధవళుఁ డీనగరమునకు వచ్చెనని వినినది మొదలు—నేనా దేవీమందిరముకడ దారుణమరణయాతనలననుభవించుచున్నట్లును, రుధిరకషాయవసనధారియై, భీషణకృపాణపాణియై యశోధవళుఁడు పరమానందాతిరేకమున నెడలు మఱచి తాండవమాడుచున్నట్లును దుస్స్వప్నములం గాంచుచున్నాను.

పిమ్మటఁ గొంతసేపటివఱకు నిద్దఱిలో నెవ్వరును మాటాడకుండఁ గూర్చుండి యుండిరి. అప్పుడు బంధుగుప్తుఁడు "శత్రుసేనా! లెమ్ము! మనము సంఘారామమునకు మరలిపోవుదము. ఇచ్చటి యేకాంతవాస మింక నాకసహ్యముగా నున్నది!" అనియెను.

తరువాత దీపము నార్పివైచి యాయిరువురు నింక నేమియు మాటాడకుండ వెడలిపోయిరి. విగ్రహముచాటున నున్న దేశానందస్వామి యింకను వడఁకుచునే యుండెను. శత్రుసేనబంధుగుప్తులు వెడ

లిపోయినంతనే తరళ "స్వామీ! ఇఁక లెండు! మనము బయటికిఁ బోవుదము!" అనియెను.

దేశా—(శిరఃకంపము సేసి) తరళా! ఇప్పుడు నేను నిశ్చయముగాఁ జచ్చినవాఁడనే! నీప్రేమోన్మాదమునం బడి నాబుద్ధిశక్తియంతయును నశించిపోయినది.

తర—ఇంకను నిచ్చట నిలిచియే యున్నచో నిశ్చయముగా మీతలయే యెగిరిపోఁగలదు. ముందిటనుండి తరలిపోవలయును. నడువుఁడు!

దేశా—(హతాశుఁడై) సరే—నడువుము! పోవుదము కద!

చటాలున నిరువురు నామందిరమును వదలి వెలుపలికి వచ్చిరి. ఆవృద్ధుఁడు భయాకులహృదయుఁడై సగముచచ్చియున్నాఁడని తరళ గ్రహించెను. ఆమె యాతని కించుక ధైర్యముం గూర్ప నెంచి "ఆచార్యా! మీరింతగా భయపడిపోవుచున్నారేమి! ఇప్పుడు వచ్చిపోయినవా రిచ్చటివారేగదా! వారు మిమ్మేమి చేయఁగలరు? మీరిక్కడనుండి పాఱిపోయినచో వారు మీశిరోజాగ్రమునైనను బాధింపఁగలరా? మీరు ధైర్యము వహించి నాతో రండు! నేను మిమ్మెక్కడో దాఁచెదను. ఏడుజన్మము లెత్తి వెదకినను వారు మిమ్మిఁకఁ గనుఁగొనఁ జాలరు." అనియెను.

ఈమాటలు విని దేశానందునిభయమంతయు మాయమైపోయెను. అప్పు డాతని కెట్లయినఁ దప్పించుకొని బ్రిదుక గలను గదా యని యించుక యాస కలిగెను. అందుచే నాతఁడు తరళం గాంచి "అట్లయినచో నింకను నిచ్చట నిలుచు టెందులకు? లెమ్ము! ఈక్షణముననే మనము పాఱిపోవుదము?" అనియెను.

తర—(మందహాసముతో) ఊరక యిట్లు భయపడవలదు. ఇక్కడ నాకింకను గొంచెముపని యున్నది. ముందా కార్యమును దీర్చుకొని మఱిపోవలయును.

దేశా—ఇచ్చట నీకేమిపని?

తర—భిక్షుజినానందు నొకసారి చూచిపోవలయును.

దేశా—(అనిష్టముతో) జినానందుఁడు నిన్నెట్లు చూడఁ గలఁడు?

తర—ఏమి ?

దేశా—వాఁడు సంఘారామమున నిర్బంధితుఁడై—

తర—మఱి మీరున్న ప్రయోజన మేమి?

దేశా—నన్నేమి చేయుమనెదవు?

తర—నన్నక్కడకుఁ దీసికొని—

దేశా—అక్కఱలేదు—వాని నిక్కడకే తీసికొని వచ్చెదను.

తర—ఇంకేమి ? అట్లే చేయుఁడు ! మీరు త్వరగా రావలయునుజుఁడీ ! మీరాకకొఱ కిచ్చటనే యెదురు చూచుచుండెదను.

దేశానందుఁడు వెడలిపోయెను. ఈవృద్ధునిఁ జిక్కించుకొనుట కొంతవఱ కనుకూలమే యయ్యె నని తరళ యానందభరితహృదయ యయ్యెను. అప్పుడామె యాయంధకారమున నామందిరము చెంత నిలిచి యుండెను.

కొలఁదిసేపటిలోనే దేశానందుఁడు జినానందు నచ్చటికిఁ దీసికొని వచ్చి" తరళా ! నీపనియేదియో త్వరగాఁ గానిమ్ము ! ఇదిగో ! జినానందుఁడు ! ఆలస్యము చేయకుము. ఈతఁ డగపడకుండుటచే భిక్షువు లితని వెదకికొనుచు నీతోవనే వచ్చెదరేమో ! త్వరపడుము!" అనియెను.

తర—ఆచార్యా ! త్వరలోనే నాపనిముగించుకొందును. కాని మీరు కొంచెముసేపు మందిరములోనికిఁ బోయియుండెదరా ? నేను కొన్ని విషయములనుగూర్చి జినానందునితో రహస్యముగా మాటాడవలయును.

దేశానందుఁడుతరళయాజ్ఞను శిరసావహించి చటాలునఁ బోయి యామందిరమునఁ బ్రవేశించెను. తరళ యాయింటితలుపులను మూసి వైచి జినానందునిం గాంచి మెల్లఁగా "మహారాజా! నన్ను గుర్తించితిరా ? నేను తరళను. మిమ్మిప్పుడిటనుండి తప్పించి నావెంటఁ గొనిపోవుటకై వచ్చియున్నాను. నన్నిప్పుడేవిషయమునుగూర్చియు నడుగవలదు. ఇప్పుడు నేను మీకుఁ జెప్పినపనిని మీరు మౌనముతోఁ జేయవలయును. అంతే చాలును!" అనియెను.

జినానందుఁ డాశ్చర్యముచే స్తబ్ధుఁడై నిలువఁబడిపోయెను. తత్క్షణమే తరళ యామందిరద్వారముకడకుఁ బోయి "ఆచార్యా!" అని పిలిచెను.

ఆచార్యుఁడు లోపలినుండియే "ఏమి?" అని పలికెను.

తర—మీరు మీదుస్తులను విడిచి యొకసారి నాకిండు. నేను వానిని ధరింతును.

దేశా—అనఁగా ?

తర—అనఁగా నేమున్నది? నేను చెప్పినట్లు చేయుఁడు. మీ రెప్పటివేషముతోనే నావెంట వచ్చుచున్నచో మిమ్ముఁగాంచి యెవ్వరైన నానవాలు పట్టకుందురా?

దేశా—ఔను! నీవు చెప్పినమాట నిజమే—అట్లేచేసెదను.

అని దేశానందుఁడు తానుధరించిన వస్త్రముల నొక్కటొక్కటిగఁ దీసి మందిరద్వారమునుండి బయటికి విసరివైచెను. ఆతనివస్త్రము లన్నియుఁ జేతఁ బడినపిమ్మట సంతోషముతోఁ దరళ వాని నన్నిటిని జినానందునకుఁ గట్టనిచ్చెను. వసుమిత్రుఁడును దేశానందునిదుస్తులను ధరియించి తనదుస్తులను దరళ కొసంగెను. తరళయు నాయంధకారమున భిక్షువేషముం దాల్చి తనదుస్తులను మందిరములోనికి విసరివైచి యావస్త్రముల నాచార్యుని ధరింపుమనియెను. వానినాచార్యుఁడుధరిం

చినపిమ్మట "ఆచార్యా! మీరిచ్చటఁ గూర్చుండి యుండుఁడు! నేని ప్పుడే పోయివచ్చెదను" అని చెప్పెను.

దేశానందుఁడు తరళయాజ్ఞానుసార మాజీర్ణమందిరమునఁ గూర్చుండి యుండెను. తరళ బయటికి వచ్చి యాతలుపులను మూసి తాళము వైచి వసుమిత్రునితోఁ గలసి యాయంధకారమునం దెచ్చటనో యదృశ్యులైపోయెను.



## పందొమ్మిదవప్రకరణము.



నవీనరాజప్రాసాదమునొద్ద నిలిచి మహాప్రతీహారివినయసేనుఁ డేదియో యాలోచనానిమగ్నుఁడై యుండెను. ఆప్రాసాదపుటాంగణమునం దెల్లవైపులను శూన్యమై యుండెను. ద్వారపాలకు లొకరిద్దఱుమాత్రము ద్వారచ్ఛాయను నిలిచి యుండిరి. ద్వారమునకు లోపలివైపున ముగ్గురుదండధరు లిటునటుఁ దిరుగుచుండిరి. ఇంతలో నొకశిబిక యాయంగణపుమెట్లయొద్దకు వచ్చి యాఁగెను. వాహకు లాపల్లకి నట దింపిరి. అందుండి వృద్ధహృషీకేశశర్మ వెలుపలికి వచ్చెను. మహాప్రతీహారి వినయసేనుఁ డాతనిరాకకే యెదురు సూచుచుండెను గాఁబోలును! హృషీకేశశర్మ శిబికనుండి యీవలికి వచ్చినంతనే యాతఁడతిత్వరితముగ నెదురుపోయి యాతనికి నమస్కరించి "మహామంత్రిశేఖరా! మీకుఁ జాల నాలస్యమైనది. సార్వభౌములును యశోధవళదేవుఁడును జాలసేపటినుండి మీరాక కెదురుసూచుచుఁ గూర్చుండి యున్నారు." అని మనవిచేసెను.

హృషీకేశశర్మ యేమిప్రత్యుత్తరమిచ్చెనో గాని వినయసేనున కది వినఁబడలేదు. వినయసేనుఁ డాతనితోఁ గలసి ప్రాసాదాంతః

పురమునకుఁ బోయెను. వినయసేనుఁడు ద్వారమును విడిచినంతనే యచ్చట నొకదండధరుఁడు వచ్చి నిలువఁబడి యుండెను.

హృషీకేశశర్మ లోనికిఁ బోవుచు "వినయసేనా! తక్కినవా రందఱును వచ్చిరా?" అని ప్రశ్నించెను.

విన—మహాధర్మాధ్యక్షుని మహాబలాధ్యక్షునిదప్ప నితరుల నెవ్వరిని బిలిపింపనే లేదు.

హృషీ—ఏమి?

విన—చక్రవర్తి యాజ్ఞ యట్లే యైనది.

కొలఁది సేపటిలోనే యా యిరువురు నంతఃపురద్వారమును సమీపించిరి. అప్పుడు వినయసేనుఁడొక పరిచారికను బిలిచి మహామంత్రిని సార్వభౌములకడకుఁ గొనిపొమ్మని చెప్పి తాను మరల భవనముఖద్వారముకడకు వచ్చి నిలిచెను.

ఇంతలో నచ్చటి కొకశిబిక వచ్చెను. దానినుండి నారాయణశర్మ యప్పుడే దిగుచుండెను. తోడనే వినయసేనుఁ డాతనియొద్దకుఁ బోయి నమస్కరించెను.

నారా—ఏమి వినయా! ఈయకాలమున సభాసమావేశమునకుఁ గారణ మేమి? అప్రతిహార్యం బగు కారణముచే నాకివ్వాడింత యాలస్యమైనది.

విన—(నవ్వి) మహారాజాధిరాజును, యశోధవళుఁడు నించుమించుగా రెండుజాములనుండి మీరాకకుఁ బ్రతీక్షించుచున్నారు.

నారా— అందఱును వచ్చిరా?

విన— లేదు—ఇంతకుముందే మహామంత్రి వచ్చెను. ఇప్పుడు మీరు వచ్చితిరి.

నారా—తక్కినవారో?

విన—ఇఁక రావలసినవా రెవ్వరును లేరు. మహారాజుగారీ సభకు మంత్రులనందఱను బిలిపింపలేదు.

నారా—అట్లయినచో నిక రావలసినవారెవ్వరున్నారు?

విన—మహాబలాఢ్యుఁ డగు హరిగుప్తుఁడు మాత్రమే—

నారా—రామగుప్తుఁడుగూడ లేఁడా?

విన—లేరనియే తోఁచుచున్నది. ఏమో! నాకు నిశ్చయముగాఁ దెలియదు. వారి కాహ్వానము పోనిమాటమాత్రము నిజము.

నారా—సరే—పద.

విన—దయచేయుఁడు.

ఇద్దఱును ప్రాసాదాంతర్భాగమునఁ బ్రవేశించిరి. ఇంతలో నచ్చటికొకబిచ్చగాఁడేతెంచి ద్వారపాలకునిం గాంచి "అన్నా! నేఁడు నగరున భిక్ష దొరకునా?" అని యడిగెను.

ద్వార—దొరకదు.

విన—మఱి యెచ్చట దొరకును?

ద్వార—(కోపముతో) నేఁడిచ్చట భిక్షమే దొరకదు.

ద్వారపాలకుని యీప్రత్యుత్తరమువలన బిచ్చగాఁ డించు కంతయును నాతొట్రుపడు గాలేదు. అతఁడు మెల్లమెల్లఁగా నా యంగణమును దాఁటిపోయెను. అరుఁగుకంబములమఱుఁగున నిలిచియుండిన దండధరుఁ డొకఁడాతనిం గాంచి ద్వారపాలకునికడకుఁ బోయి "ఇప్పుడు లోనికిఁ బోవుచున్నవాఁడెవఁడు?" అని యడిగెను.

ద్వార—ఎవ్వఁడో బిచ్చగాఁడు.

దండ—వాఁడు వచ్చినపనియేమి?

ద్వార—ఏమున్నది? భిక్షముడుగుటయే—

దండ—వాఁడు నిన్నేమైననడిగినాఁడా?

ద్వార—లేదయ్యా!

దండ—వాఁడు నిజముగా ముష్టివాఁడేనా? అనుమాన మేమి యు లేదుగద!

ద్వార—ఏమో! నేను వాని నంత బాగుగాఁ జూడలేదు.

దండ—సరే—ఎవ్వరైన నిన్నడిగినచో జాగ్రత్తగాఁ బ్రత్యుత్తర మీయవలెను.

ద్వారపాలకుఁ డంగీకారసూచకముగా శిరఃకంపము గావించెను. అంతలో నొకయశ్వారోహి యాయంగణముకడకు వచ్చి నిలిచెను. దండధరుఁ డాతనిం గాంచి వినయసేను నటకుఁ దీసికొని వచ్చెను. ద్వారపాలురును, దండధరులందఱును నాతనికి నమస్కరించిరి. వినయసేనుఁడుకూడ నాతనికిఁ బ్రణామము చేసి యాతని నంతఃపురమునకుఁ దీసికొనిపోయెను.

అప్పుడు మఱియొక ద్వారపాలకుఁడు మనకుఁ బరిచితుఁడైన బిచ్చగానిని బట్టుకొని బయటి కీడ్చుకొనిపోయి నిలువఁబెట్టి యటనున్న ద్వారరక్షకునిం గాంచి "ఓరీ! మహాప్రతీహారి యెక్కడ నున్నాఁడు?" అని ప్రశ్నించెను.

రెండవద్వార—మహాబలాధ్యక్షునితో లోపలికిఁబోయినాఁడు.

మొదటి—అట్లయినచో నిప్పు డొకదండధరుని బిలుచుకొని రమ్ము:

రెండవ—ఎందులకు?

మొదటి—వీఁడు లోపలఁ జాటున దాఁగి లోనికి వచ్చుపోవు వారి నందఱి నోరకంటఁ జూచుచు వారిప్రవర్తనములను బరికించుచున్నాఁడు. అందుచేతనే వీనిని బట్టి తెచ్చితిని.

ఇంతలో నొకదండధరుఁ డచ్చటికి వచ్చి యాద్వారపాలకులం గాంచి "వీఁడు బిచ్చమడిగికొనుటకై వచ్చియుండెనుగదా!" అనియెను.

ద్వార—ఔను.

దండ—అట్లయినచో వీని నేల పట్టితెచ్చితివి?

ద్వార—వీఁడు లోపలికి వచ్చి యున్నసంగతులను బరికించు

చున్నాఁడు. నా కనుమానము గలుగుటచే నిట్లు వెలుపలి కీడ్చుకొని వచ్చితిని.

దండ—మంచిపని చేసితివి. వీనిని గట్టిగ బంధించియుంచుము. నేనిప్పుడ పోయి మహాప్రతీహారిని బిలిచికొని వచ్చెదను.

ద్వితీయద్వారపాలకుఁ డాబిచ్చగానితలపై నున్నవస్త్రమును దీసి దానితోనే యాతని బంధింపఁదొడఁగెను. ఆవస్త్రమును దీసి నంతనే యాభిక్షుకుని బోడితల యందఱకును గానవచ్చెను. అప్పుడు దండధరుఁడు "ఔరా! వీఁడెక్కడి బిచ్చగాఁడురా! వీఁడు కేవలమును బౌద్ధభిక్షునివలె నున్నాఁడు! నిజముగా నీతఁడు గూఢచారియే యైయుండును" అనియెను.

ఇంతలో దండధరునితోఁ గలసి వినయసేనుఁ డచ్చటికి వచ్చి యాభిక్షుని యాపాదమస్తకమును దిలకించి "నీవిచ్చటి కేల వచ్చితివి?" అని ప్రశ్నించెను.

బిచ్చ—భిక్ష మడిగికొనుటకు—

విన—మంచిది—వాడలోనికిఁ బోయి యడిగికొనవలయును—గాని యంతఃపురమున నెవ్వరికైన భిక్షము పెట్టుదురా?

బిచ్చ—నేనీనగరమునకుఁ గ్రొత్తవాఁడను—ఇక్కడిపద్ధతులు నాకేమియుఁ దెలియవు.

విన—ఆలాగా? నీతలయంతయు నిట్లు ముండితమై యున్న దేల?

బిచ్చ—నాకు వాతరోగ మున్నది. అందుచే నిట్లు చేయవలసి వచ్చినది.

అప్పుడు లోపలినుండి దండధరుఁడు వచ్చి వినయసేనుం గాంచి "సార్వభౌములవారు మిమ్ముఁ బిలుచుచున్నారు" అని చెప్పెను.

వినయసేనుఁ డొకద్వారరక్షకునిం బిలిచి "నీవీబిచ్చగానిం దీసికొనిపోయి నగరుచెఱసాలయందు నిర్బంధింపుము. నాయాజ్ఞ లేకుండ

సభవనపటాంగణమునకుఁగూడ నెవ్వరిని రానీయవలదు” అని కట్టడఁ జేసి యాదండధరునితో వెడలిపోయెను.

అంతఃపురమునందలి యొకచిన్నమహాలులో స్వర్ణపీఠమునఁ జక్రవర్తి యాసీనుఁడై యుండెను. ఆతని కనతిదూరమున నేలపైఁ బఱచిన వేఱువే ఱాసనములపై హృషీకేశ, నారాయణశర్మలు కూర్చుండి యుండ హరిగుప్తుఁడు మహాలుతలుపునొద్ద నిలువఁబడి యుండెను. ఆకవాటమునకుఁ గొంతదూరమున దండధరులు కొందఱు నిలిచి యుండిరి.

అప్పుడు వినయసేనుఁడు వచ్చి “నాకు సార్వభౌములయాజ్ఞ యైనదఁట!” అనియెను.

హరి—ఔను, లోనికిరమ్ము!

వినయసేనుఁడు లోపలికిఁ బోయి సార్వభౌమునకుఁ బ్రణమిల్లెను. సార్వభౌముఁ డాతనిం జూచెను గాని యేమియు మాటాడలేదు.

అప్పుడు యశోధవళుఁడు చక్రవర్తిం గాంచి “మహారాజాధిరాజా! వినయసేనుఁడు వచ్చియున్నాఁడు. యువరాజును దోడితే నాజ్ఞాపింపవలయును!” అనియెను.

ఇంతవఱకు నధోవదనుఁడై యున్నచక్రవర్తి తలపైకెత్తి మెల్లఁగా “యశోధవళా! జ్యోతిష మెన్నటికిని నత్యదూరము కానేరదు. ఇప్పటినుండియే రాజకీయవ్యవహారములందు శశాంకుని ముంచివేయవలదు” అనియెను.

యశో—(గంభీరస్వరముతో) మహారాజాధిరాజా! యువరాజును రాజ్యవ్యాపారములందుఁ జేర్పకున్నచో నిఁక సామ్రాజ్యరక్షణమునకు వేఱుపాయము లేదు. హృషీకేశ, నారాయణశర్మలును, యుద్ధవ్యవసాయములందే పలితకేశుఁ డైపోయినమహాబలాధ్యక్షుఁ

డును నేనుగూడ మీచరణసన్నిధి నెన్నియోసారులు మనవి చేసికొని యున్నారము. ఇప్పుడు మనసామ్రాజ్య మెట్టిదుర్దశలపాలై యున్నదో తమరెఱుంగనిసంగతి గాదు. జ్యోతిశ్శాస్త్రముపై వెఱ్ఱినమ్మక ముంచి తదనుసారముగా రాజకీయవ్యవహారములను జరిగించుట యెంతమాత్రమును న్యాయము గాదు. ఒకవేళ గుమారశశాంకునిచేతనే సామ్రాజ్యవినాశనముం గావింపవలయు నని యీశ్వరోద్దేశ మైనయెడల నట్టివిధివిధానమును దప్పించుట యెవ్వరిశక్యము? కాని వృథా విశ్వాసమునకు లోనై యాత్మరక్షణోపాయము నాలోచింపక యూరక కూర్చుండియుండుట ప్రాజ్ఞలక్షణము గానేరదు. కుమారునకు రాజకీయవిషయము లేవియుఁ దెలియకుండుటయే మీయనంతరమున సామ్రాజ్యవినాశనమునకుఁ గారణ మగును. మీరట్లు తెలియనీయకుండుటచేతనే దైవజ్ఞులపలుకులు నిక్కము లగుటకు సాహాయ్యము చేసినవారగుచున్నారు.

వృద్ధసార్వభౌముఁ డధోవదనుఁడై యూరకుండెను. ఆతఁ డేమియుఁ బలుకకుండుటం గాంచి హృషీకేశశర్మ "మహారాజాధిరాజా! మహానాయకుఁ డిప్పుడు సూచించినయాలోచనయే సర్వోత్తమముగా నున్నది. మీరును, మేమందఱమునుగూడ వయోవృద్ధులమైపోయితిమి. మాకాలము నిండిపోవుచున్నది. మనయనంతరము యువరాజు కఠోర రాజనీతిచక్రమునం జిక్కి, పరిసరములయందలి యసహ్యపరిస్థితులం గాంచి మనలనందఱను బిచ్చివారినిగా భావించి దూషింపకుండ మున్ముగనే మనకర్తవ్యముల నుచితరీతిని నిర్వహింపవలసి యున్నది. యువరాజుమూలముననే యీసామ్రాజ్యనాశనము కావలయునని విధాత్రుద్దేశ మైనయెడల దానినిరక్షించుట కెవ్వరికిని శక్యము గానేరదు. కాని యిదియే విధాత్రుద్దేశమని యెవ్వరో చెప్పినమాటలను నమ్మి యూరకచూచుచుండినచో నిశ్చయముగనే—అతిశీఘ్రముగనే—యిది వినాశనము కాక మానదు" అని మనవి చేసెను.

చక్రవర్తి యేమియుమాటాడలేదు. కొంతసేపటివఱకును సభయంతయు నిశ్శబ్దముగా నుండెను. అనంతరము నారాయణశర్మ చక్రవర్తినుద్దేశించి "మహారాజాధిరాజా!—"అనియెను.

ఈసంబోధనముచేఁ జక్రవర్తికిఁ జింతాభంగ మయ్యెనుగాఁబోలును! ఆతఁ డించుక తలయెత్తి "యశోధవళా! అట్లే కానిండు! విధివిధానము నెవ్వరు తప్పింపఁగలరు? " అనియెను.

యశోధవళుఁ డానందముతో "మహాప్రభూ! వినయసేనుఁడు వేచియున్నాఁడు " అనియెను.

చక్ర—మహాప్రతీహారీ! యువరాజశశాంకు నతిగూఢముగా నిటకుఁ దోడ్కొని రమ్ము!

వినయసేనుఁడు చిత్తమని ప్రణామము చేసి వెడలిపోయెను.

చక్ర—(నిట్టూర్పు విడిచి) యశోధవళా! మీ మేమి చేయవలయునని నీయభిప్రాయము?

యశో—నాలుగాలోచన లున్నవి. వాని నేలినవారిచరణసన్నిధి నిదివఱకే మనవిచేసియుంటిని. ఇప్పు డీసభలో నీయధికారుల యెదుటఁగూడఁ దెలుపవలయు నని నాకోరిక—

చక్ర—యశోధవళా!నీయాలోచన లన్నియును నేనే మంత్రులకుఁ దెలియఁజేయుదును. మంత్రివరులారా! మహానాయకుఁడు నాకు నాలుగువిధానములను సూచించి యున్నాఁడు. అందు మొదటిది:— ప్రాంతకోష్ఠప్రదేశములను జక్కఁగ సంరక్షించునట్టి యేర్పాటులు చేయుట- రెండవది:—పదాతిసేన, ఆశ్వికసేన నౌకాసేన వీనిని మరలఁ గ్రొత్తగా నేర్పరించుట. మూఁడవది:-రాజ్యకర మగురాజస్వమును సరిగా రాఁబట్టుటకును, రాజకోశమును బూర్ణముగా నిండించుటకును దగినకట్టుదిట్టములను జేయుట—నాలుగవది:—వంగదేశమునందు సామ్రాజ్యాధికారమును యథారీతిగాఁ బ్రతిష్ఠించి సుస్థిర

మగునట్టివిధానమును జరుపుట—మహానాయకుఁడు సూచించిన యీనాల్గువిధానములవిషయమున నెవ్వరికి నెట్టి యాటంకము నుండ దనుకొనియెదను. కాని యట్టియధికారమును వహించుటకుఁ దగిన పురుషులును గావలసినంతధనమును లేకుండుటయే యిప్పుడు ముఖ్య లోపములై యున్నవి. రాజ్యమునందలిధనాగారమిప్పుడు శూన్య మైయున్నదనియె చెప్పవచ్చును. ఎట్లో దినవెచ్చముమాత్రయు గడ చుచున్నది. ఇదియు నొకవిధమగునదృష్టమే—సామ్రాజ్యమునందలి నూతనోద్యోగులందఱును స్వకార్యనిర్వహణమున కసమర్థులై యున్నారు. వారికిఁ దమతమపనులు చక్కఁగఁ దెలియనే తెలియవు!

యశో—రాజచూడామణీ! నాసూచించినయీనాల్గుపద్ధతులు నతిశీఘ్రముగ నాచరణమునకుఁ దేకున్నచో సామ్రాజ్యరక్షణమున కవకాశ మేమియును లేదు. ప్రాంతకోష్ఠసంరక్షణమునకై సుశిక్షితమగుసేనయు, ధనాగారమున ధనాభివృద్ధియు నత్యంతావశ్యకములు. సేనాపునస్సంస్కరణమునకును, గోశాభివృద్ధికిని రాజమర్మమును క్రమము తప్పకుండ రాఁబట్టునట్టి యుత్తమవ్యవస్థలను గావింపవలయును.

చక్రి—ఔను నిజమే—కాని నీవు సూచించిన విధానములన్నియును నాకసాధ్యసమస్యలుగనే తోఁచుచున్నవి.

యశో—ఏలినవారికే యట్లు తోఁచుచున్నప్పుడు నేనే వానికిఁ దగినసమాధానము చెప్పవలసియుండును. యువరాజు వచ్చినతరువాత నేనన్నిటిని స్పష్టముగా మనవిచేసెదను. నేను చెప్పినవిధానములలో మూఁడుమాత్ర మీక్షణమునందే క్రియారూపముం గాంచవచ్చును. కాని దానికి విశేషధనసాహాయ్యము కావలయును!

హ్యాంకీ—యశోధవళా! ఈధనాభావమే సకలానర్థపరంపరలకును గారణ మైనది. ఈసకలకార్యములకును వలసినంతధనము నిప్పుడెక్కడనుండి తెచ్చెదవు ?

మహాలు వాకిట నిలిచియున్న హరిగుప్తుఁ డప్పుడు లోనికి వచ్చి "కుమారుఁడు వచ్చుచున్నాఁడు" అని చెప్పెను.

అంతలో యువరాజసహితుఁడై విజయసేనుఁడు మహాలునఁ బ్రవేశించెను. యువరాజు ముందుగాఁ దండ్రికి నమస్కరించి పిమ్మట నచ్చటఁ గూడియుండినవృద్ధులకు నమస్కరించెను. చక్రవర్తి యప్పు డాతనిఁ గ్రిందఁ గూర్చుండుమని నియోగించెను. కాని యశోధవళుఁడు శశాంకుని దనతొడలపైఁ గూర్చుండఁ బెట్టుకొనెను.

చక్రి—యశోధవళా! నీవు చెప్పనదేదియో యిప్పుడు చెప్పుము!

యశో——యువరాజా! సామ్రాజ్యమునకుఁ బ్రస్తుత మతిఘోరంబగుదుర్దశ సంభవించుటయు నీప్రాచీనసామ్రాజ్య మతిత్వరితముగ వినాశనాభిముఖం బగుచుండుటయు మీకుఁ దెలిసినవిషయమే- కావున నిప్పు డెల్లవిధముల నాత్మసంరక్షణము చేసికొనవలసి యున్నది. ఆవిషయమున నిప్పుడందఱు నౌదాసీన్యమును వహించియున్నారు. ఇప్పు డెల్లరయందును, నజాగ్రత్తయు, నసమర్థతయు నుత్పన్నములై యున్నవి. ఈప్రాచీనసామ్రాజ్యముతోఁ గోట్లకొలఁది ప్రజలప్రాణమాన ధనంబులు సంబంధించి యున్నవి, ఇది నాశనమయ్యెనా దేశమంతటను మహాప్రళయము తటస్థింపఁగలదు. అతిప్రాచీనం బగునీసామ్రాజ్యమున కిట్టిదుర్దశ యెన్నఁడును సంభవించియుండలేదు. శకజనులదండయాత్రలకాలపు ఘోరానర్థముల నిప్పటికిఁ బ్రజలు మఱచిపోయియేయుందురు. హూణుల దండయాత్రలలో మాత్రము పురుషపురము, కన్యాకుబ్జమును నాశనమయ్యెను. కాని వారు పాటలీపుత్రప్రాకారము నైనను స్పృశింపఁజాలకపోయిరి. ఇట్టిసామ్రాజ్యము నాశ మయ్యెనా దేశమంతయు నాశనమైనదనియే భావింపవలయును. యువరాజా! మీజనకులు వృద్ధులైయున్నారు. మీరిద్దఱును బసికూనలు. ఇప్పుడు

పూర్వదేశమున సుప్రతిష్ఠితవర్మయుఁ బశ్చిమమునఁ బ్రభాకరవర్ధనుఁడును జక్రవర్తిమరణముకొఱకుఁ బ్రతీక్షించుచున్నారు. సామ్రాజ్యరక్షణమున కేకనేయుపాయమును లేదని నిరాశుఁడై సార్వభౌముఁడూరక కూర్చుండి యున్నాఁడు. కాని యిట్లూరక చూచుచుండుట న్యాయమా? ఎవ్వఁ డాత్మరక్షణవిషయమునఁ గ్రియాతత్పరుఁడు గాక యుండునో, ఎవ్వఁడు కేవల మదృష్టముపై భారమును వైచి యుదాసీనుఁడై భవిష్యము నెదుర చూచుచుండునో యాతనిం బోలిన యాత్మఘాతుకుఁడు మఱియొకఁ డుండఁడు! కుమారా! ఎట్టిప్రయత్నమును లేకుండుటచే సామ్రాజ్యమున కెట్టిగతి పట్టినదో యాలోచింపుము! సీమలయందలి దుర్గము లొక్కప్పుడైనను బాగుచేయింపకుండుటచే నవి నిరుపయుక్తములై పోయినవి. సేనాభావమువలన వానిని రక్షించుట యసాధ్యమయ్యెను. రాజస్వము నియమానుసారముగాఁ గోశమునకుఁ జేరుచుండుట లేదు. పూర్వభూస్వాముల యధికారము లోపించిపోయినది. నూతనస్వాములు రాజకీయాధికారుల యాజ్ఞల నణుమాత్రమైనను బాలించుట లేదు. అందువలన సామ్రాజ్యకోశాగారము వట్టిదై యున్నది. అనేక సంవత్సరములనుండి నగరావరణములు కాలువలును బాగుచేయించుటయే లేదు. చుట్టునున్నకందకము వట్టిపోయినది. అచ్చటిద్వారమే క్రమముగా గడ్డిబీడుగానున్నది. ఇట్టిస్థితిలో మనపై నెవ్వరైన నెత్తివచ్చినచో మనకు సంపూర్ణముగా నపజయమే. అప్పుడు మనబాధలు కుక్కలకైన నుండవు. నేనిప్పుడు నామనుమరా లగులతికకొక దట్టెఁడన్నముకొఱకు సార్వభౌముని యాచింప వచ్చియుంటిని. కాని బాగుగఁ బరీక్షింపఁగా నాయన్నదాతయింటనే యన్నాభావము తటస్థించినట్లు తోఁచుచున్నది. కుమారా! అనేకసంవత్సరములకుఁ బూర్వము—మీతండ్రిగారు క్రొత్తగా సింహాసనము నధిష్ఠించినప్పుడు—నేను గొంతవఱకు రాజకీయకార్యభారమును

వహించి యుంటిని. ఇప్పటి సామ్రాజ్యస్థితిగతులంగాంచి మరల నీవృద్ధావస్థలో నట్టిభారము ను దలపై మోపుకొనఁ దలఁచి యున్నాఁడను. కాని మేమందఱమునుగూడ ముసలివారము—వందుటాకులము—మావలనఁ జాలకాలము పనులు జరగునట్లు తోఁచుట లేదు. యువరాజా! మీతండ్రిగారి తరువాత నీసింహాసనము నధిరోహించువారు మీరే—అప్పుడీసర్వకార్యభారమును మీపైఁ బడఁగలదు. కావున మీరు రాజకార్యనిర్వహణమునం దిప్పటినుండియుఁ బ్రవీణులగుట యావశ్యకము! మీవంటివారి సాహాయ్యము లభించినచో మాభారము కొంతవఱకుఁ దగ్గఁగలదు, కుమారా! నేఁటినుండియు మీరు రాజకార్యములను జూచుకొనుచుండవలయును.

యువరాజ శశాంకుఁ డింకను మహానాయకునంకమునఁ గూర్చుండియే యుండెను. అప్పుడాతఁడు మృదుస్వరముతో "నాయనగారి యాజ్ఞ యెట్లో, యట్లే చేయుటకు సంసిద్ధుఁడనై యున్నాను." అని తండ్రి మొగము వంకఁ జూచెను.

చక్రి—(విషణ్ణుఁడై) శశాంకా! నీవు నేఁటినుండియు రాజకార్య నిర్వహణదీక్షితుఁడవు కావలయు నని వీరందఱును గోరుచున్నారు. ఇంకను బాలకుఁడవె యైనను నీవీభారమును వహించి తీరవలయును. యశోధవళుఁడు నీకెల్లవిషయములను బోధింపఁగలఁడు. నీవెల్లప్పుడు నాతఁడు చెప్పినట్లు చేయుచుండినఁ జాలును.

మహానాయకుఁడగు యశోధవళుఁడు ప్రసన్నవదనముతో నప్పుడు తానుసూచించినవిధానములంగూర్చి యువరాజునకు విస్పష్టముగా నెఱిఁగించి ప్రస్తుత మన్నిపనులకు ధనమావశ్యకమనియు, రాజ్యమునందలి లక్షాధికారులయొద్దఁ గొంతధనమును ఋణముగాఁ గైకొనుటకుఁ బ్రయత్నింపవలయు ననియు సూచించెను.

హృషీ—(నిరాశతో) యశోధవళా! మనయిట్టిదుస్థితి నెఱింగి యుండియు మన కెవ్వరు ఋణమునిచ్చెదరు? ఈయవస్థలో ఋణము సంపాదించుట సులభమనియే నీకుఁ దోఁచుచున్నదా?

యశో—ఆ! అట్లే తోఁచుచున్నది. మనరాజ్యమునందలి ప్రజలు మనకు నిశ్చయముగా ధనము నీయఁగలరు. ఆలక్షాధికారులసంపదకంతకును హేతువైనది వారిబుద్ధియే—ఆబుద్ధిబలము వలననే వారుకోట్లకొలఁది ధనము నార్జించి యున్నారు. ఆధనసంరక్షణమునకై యందొక్క భాగమును మనకు బదులిచ్చుటకు వారెంతమాత్రమును వెనుదీయరు. సామ్రాజ్యరక్షణ మనిన వారి సంరక్షణమేగదా! ఈ సామ్రాజ్యమే నశించినచో వారికిని సర్వనాశనము కాకమానదు. ఈసంగతులను మాత్రము వారికిఁ జక్కఁగా బోధింపవలసి యుండును. ఇంతే—ఇట్లు చేసినచో మనకుఁ గావలసినంత ధనమును సంపాదింపఁ గలమని నాకు నిశ్చయముగాఁ దోఁచుచున్నది.

చక్రి—మంచిది. కాని యశోధవళా! సామ్రాజ్యకార్య నిర్వహణభారమును మీరువహించియున్నట్లు మనసామ్రాజ్యమునందలి సర్వాధికారులకును దెలియఁజేయుట యావశ్యకము గాదా?

యశో—కాదు—మహారాజా! అట్లుగావించినచో మనయుద్దేశముల కన్నిటికిని భంగము గలుగఁగలదు. నేనీ మహామంత్రులచాటుననుండి మౌనముతోఁ గార్యములను నిర్వహింపవలయు నని నిశ్చయించుకొన్నాను.

చక్రి—సరే—నీయిష్టము వచ్చినట్లు చేయుము.

---

## ఇరువదియవప్రకరణము.



ఆరాత్రి తరళ వసుమిత్రిని వెంటఁబెట్టుకొని తనపినతల్లి యిల్లుచేరెను. ద్వారముకడ నిలిచి యామె యెంతయోసేపు బిగ్గఱగాఁ గేకలువైచి పిలిచెను. తలుపు గట్టిగాఁ దట్టెను. ఈసంస్కారము లన్నియు నైనపిమ్మటఁ గొంతసేపటి కావృద్ధురాలు మేల్కాంచి తనలో నేమేమియో గొణఁగుకొనుచు వచ్చి తలుపుదెఱచెను.

తరళ వసుమిత్రినితోడ్కొని లోపలఁ బ్రవేశించెను. ఆయంధకారములో వారివేషము లాముసలిదాని కగపడలేదు. తరళ యొకగదిలో వసుమిత్రికు శయనించుటకుఁ దగిన యేర్పాటు చేసి తాను తనపినతల్లి ప్రక్కలోఁ బరుండెను. ముసలిదానికి నిద్ర పట్టుట లేదు. వార్ధకమునందు నిద్దుర సరిగాఁ బట్టదు. అందునొకసారి నిద్రాభంగమైన పిమ్మట నిఁకఁ జెప్పవలయునా? వృద్ధురాలికిఁ గోపము హెచ్చిపోవుచుండెను.

వృద్ధు—(గొణఁగుకొనుచు) ఏమిపిల్లవే నీవు? ఇంతరాత్రివేళ నెవ్వరినో మిత్రురాలిని దీసికొని వచ్చుటే కాక యామె నొంటిగా నొకగదిలోఁ బరుండఁబెట్టి నీవిక్కడకు వచ్చితివి. ఇది నాకెంతకష్టముగా నున్నదనుకొన్నావు? నిన్నే మందునే. ఇంటికి వచ్చినవారి నీవిధముగా నవమానించుట యెవ్వరికైన మరియాద యగునఁటే !

తర—నేనుమాత్ర మేమి చేయుదునే పిన్నీ? అక్కడ నూరకదోమలు కుట్టుచున్నవి. ఆబాధచే నిద్రయే పట్టుటలేదు! అబ్బా!

వృద్ధు—(కోపముతో) ఓహో! నీవు పట్టపురాణివై తివి కాఁబోలు! దోమలమూలమున నిద్రవచ్చుటలేదా? ఎంతసుకుమారివి! ఇట్టి నీకొక్కరియింట దాసీతనముగూడ నెందులకే—కాలిపైఁ గాలు

వైచుకొని యానందముతోఁ గూర్చుండి మహావైభవ మనుభవించుచుండుటకు నీతల్లిదండ్రులు నీకొక్కచిన్నరాజ్యము నైనను సంపాదించినారు కారు.

వృద్ధురాలింకను సణుఁగుచునే యుండెను. ఆమెనోరు తుపాకినాళమే యనిచెప్పవచ్చును. ఆమె యెన్నితిట్లు తిట్టినను మాఱుమాటాడక తరళ నెమ్మదిగా నామెప్రక్కను బరుండియుండెను. ముసలిదాని సణుఁగుమూలమునను, దనయాలోచనమునను దరళ కిఁక నారాత్రి కన్నులు మూఁతలువడనేలేదు.

ఉషఃకాలమున కొక్కొంచుకపూర్వము విహంగకలకలారావములారంభమైనసమయమునఁ దరళ శయ్యపైనుండి లేచెను. పిన్ని యింకను గురకవెట్టి నిద్రించుచునే యుండెను. అప్పుడు తరళ యడుగులచప్పుడు గాకుండ మెల్లఁగ నడచి బయటికి వెలువడియెను. రాత్రియంతయు నాలోచించి యామె యొకయుపాయమును నిశ్చయించుకొనియెను. సార్వభౌముని ప్రసన్నదృష్టిని వసుమిత్రునికడ కాకర్షించుట యుపాయమని యామెకుఁ దోఁచెను. పగటివేళ వసుమిత్రుఁడు కనఁబడినంతమాత్రమున భిక్షులాతని మరల మఠమునకుఁ దీసికొనిపోక మానరు. ఈపాటలీపుత్రమున భిక్షుల నెదిరించుటకుఁ గాని, వారి నాటంకపఱచుటకుఁ గాని యెవ్వరును సాహసింపరు. ఇవి యన్నియు బాగుగ నాలోచించుకొని తెల్లవాఱకుండఁగనే వసుమిత్రుని వెంటఁ బెట్టుకొని పోయి రాజభవనద్వారముకడఁ గూర్చుండవలయుననియు, నట్లు చేసినచోఁ దన్నుఁ గాని, వసుమిత్రునిగాని యెవ్వరును నిర్బంధించి తీసికొనిపోవఁజాలరనియు భావించుకొనియెను.

అప్పు డామె తన యెప్పటివేషముం దాల్చి తానదివఱకుఁ గొనితెచ్చినపురుషోచితవస్త్రములను వసుమిత్రునకుఁ గట్టనిచ్చి తమ యిరువురి బౌద్ధవేషవస్త్రములను దీసివైచి యొకమూలలోఁ దాఁచెను.

ఇంకను చిన్నమ్మ నిదురించియే యుండెను. ఆసమయమున వారిరువురును జప్పుడు సేయకుండ నాయిల్లు విడిచి పోయిరి.

అప్పటికి ంకను మార్గమున జనసంచారము లేదు. పూర్వదిక్తటంబున సిందూరకాంతులు ప్రసరించుచుండెను గాని యింకను జీకటులు విరిసిపోలేదు. తరళావసుమిత్రు లతిత్వరితముగ నడుగులిడుచుఁ బోయి కొలఁది సేపటిలోనే ప్రాసాదతోరణద్వారమును జేరుకొనిరి.

ద్వారముకడ నున్న దీప మింకను వెలుఁగుచునే యుండెను. అట నందందుఁ గొందఱు ప్రతీహారులు శయనించి యుండిరి. ఒక్క ప్రతీహారిమాత్రము చేతియందలిశూలముపైఁదనుభారమును వైచి కునుకుపాట్లు పడుచుండెను. తరళ మెల్లఁగ నడుగులవైచి యాతని దప్పించుకొని నిరాతంకముగా లోపలఁ బ్రవేశించెను. ప్రతీహారి యామెను గనుపెట్టనేలేదు.

తోరణమునొద్దఁ బరుండియున్నకుక్కలుమాత్రము వారిం గాంచినంతనే మొఱుఁగనారంభించెను. ఆయఱపులచేఁ బ్రతీహారి మేల్కాంచి యెదుటనున్నవసుమిత్రునిం గాంచి చటాలున లేచి యాతని చేయి పట్టుకొని "ఎక్కడకుఁ బోవుచున్నావు" అని ప్రశ్నించెను.

ఆవిపరీతసంఘటనముం గాంచి తరళ వెనుకకుఁదిరిగివచ్చి యాప్రతీహారిపాదములపై వ్రాలి "అయ్యా! మేము గొప్పచిక్కులలోఁ బడియున్నారము. మాపైఁ గరుణింపవలయును. మమ్ము విడిచిపెట్టుము! నాయీసోదరుని ప్రాణభిక్షమును యాచించుటకై నేనీతనిని సార్వభౌమసన్నిధికిఁ గొనిపోవుచున్నాను. తెల్లవాఱినచో బౌద్ధభిక్షు లీతనిం బట్టి తీసికొని పోవుదురు; చంపివేయుదురు— మేమేమియు నల్లరి చేయువారము గాము- అంతఃపురద్వారముకడ నిరీక్షించి యుండుము. సార్వభౌములదర్శన మైనంతనే వారిపాదముల కెఱఁగి ప్రాణభిక్షమును వేఁడుకొందము!' అని వేఁడుకొనియెను.

ఈగోల విని పరుండియున్న మఱికొందఱు ప్రతీహారులు కూడ మేల్కాంచిరి. వారిలో నొకఁడు తరళంగాంచి "నీవు వచ్చినపని యే మి?" అని యడిగెను.

తరళ జాలిగొలుపునట్లు బెదరుచూపులు చూచుచు నిదివఱకుఁ బ్రతీహారికిఁ దెలిపినవిషయమునే యతికరుణముగా మనవిచేసి లో నికిఁ బోనీయవలయు నని ప్రార్థించెను.

తరళ యిట్లుప్రశ్నించినవాఁ డొకదండధరుఁడు; ప్రతీహారి యా తనిం గాంచి "ఏమనియెదరు? వీరిని విడువవచ్చునా?" అనియెను.

దండధరుఁడు తరళం గాంచి "మీ రిప్పుడు తిన్నఁగా నెక్కడకుఁ బోయెదరు?" అనియెను.

తర—(ఏడ్చుచు) అయ్యా! మేమెక్కడకును బోము. మేమేమి యుఁ జేయము! అంతఃపురద్వారముకడ నిలిచియుందుమంతే—తె ల్లవాఁ సార్వభౌములు వచ్చినతరువాత వారిపాదములపైఁ బడి ప్రా ర్థించెదము.

కరుణాపూర్ణం బగునబలలయశ్రుజలప్రసారమువలన—అందు ను సుందరు లగు తరుణులయుష్ణాశ్రుపాతమువలన—గ[illegible]న పాషాణ ములుగూడఁ గరఁగి నీరైపోవును! ఇట్టిస్థితిలోఁ దరళంబోలిన సుం దరయువతిరోదనమువలన సామాన్యప్రతీహారులకును, దండధరుల కును గరుణ గలిగె ననుటలో వింత యేమున్నది? వారిరువురు నొ క్కింతయూరకుండుటం గాంచి తరళయుఁ దన రోదనప్రమాణము నొ క్కించుకవృద్ధి నందించెను. అప్పుడు దండధరునిహృదయము ద్రవీభూత మయ్యెను. అప్పుడు వాఁడు "వీరు దుర్మార్గప్రవర్తకులు గారనియే నాకుఁ దోఁచుచున్నది. వీరిద్దఱిని విడిచిపెట్టవచ్చును" అనియెను.

ప్రతీహారి వారికిఁ ద్రోవ యొసఁగి ప్రక్కకొసరిల్లెను. అట్లు వియజము గాంచినతరళ వసుమిత్రునితో నెట్టకేలకు వాడలోఁ బ్ర వేశించెను.

ప్రథమతోరణమునంటి యతివిస్తీర్ణంబగు నొకతటాంగణ ముండెను. దాని యుత్తరభాగమున మఱియొకతోరణముండెను. తరళా వసుమిత్రులాతోరణద్వారమునుగూడఁ గడచి మఱియొకతోరణమును జేరుకొనునప్పటికిఁ జీకటిపోయి తెల్లవాఱుచుండెను. అక్కడనున్న ప్రతీహారులుగూడ నామెప్రార్థనమును మన్నించి యిరువురను లోనికిఁ బోనిచ్చిరి.

అటుపిమ్మటఁ దరళావసుమిత్రులు సభాగృహము, ధర్మాధికరణము, అస్త్రశాల మొదలగు ప్రదేశములను గడచి తృతీయతోరణముకడకుఁ బోయిరి, అచ్చటమాత్ర మెంతప్రయత్నించినను బ్రతీహారులు వారిని లోనికిఁ బోనీయలేదు. అటనుండి పోనిచ్చుటకు సార్వభౌమునియాజ్ఞ కావలయును. అందుచే నుపాయాంతరము లేక యిరువురు నాతోరణముకడనే కూర్చుండి యుండిరి.

క్రమముగా సంధ్యా కాల మంతయుఁ దొలఁగిపోయెను. పటాంగణమున జనసముదాయము చేరుకొనియెను. అధికారు లొక్కరొక్కరుగా వచ్చుట కారంభ మయ్యెను. సూర్యోదయ మగుటకుఁ గొంతముందుగనే ద్వారరక్షకసైన్య మచ్చటికి వచ్చి మహాద్వారమును వశపఱచుకొనియెను.

ఇఁకఁ దరళకు లోని కేఁగుట కనుజ్ఞ యయ్యెను. తృతీయతోరణములోపలివైపునఁ బురాతన నూతనరాజప్రాసాదము లున్నవి. పశ్చిమభాగమున నున్నపురాతన భవనమంతయుఁ బడిపోవుటకు సిద్ధముగా నుండెను. ఆప్రదేశమంతటను జిట్టడవిబలసి పోయెను. ఉత్తరమున గంగాతీరమునందు నూతనప్రాసాద మున్నది.

ఆనూతనప్రాసాదాంతఃపురద్వారము చెంతకుఁబోయి "అమ్మయ్యా" అని తరళ యొక్కనిట్టూర్పు విడిచెను. అప్పు డామెహృదయోద్వేగము చాలవఱకు శాంతించెను. ఇచ్చట నుండఁగా నిఁక నెవ్వరును

వసుమిత్రుని బలవంతముగాఁ బట్టి తీసికొని పోఁజాలరని యామెకు ధైర్యము గలిగెను. తరళ నిశ్చింతయై నిశ్చలచిత్తముతో సార్వభౌముని రాక కెదురు సూచుచుండెను.

తృతీయతోరణబహిరంగణమున జనులు గుంపులు గూడునప్పటి కింకను నూతనపురాతనరాజభవనములు నిద్రాముద్రితములై యుండెను గాఁబోలును. నిశ్శబ్దముగ నతిజాగరూకులై యామికులు మెల్లగఁ బచరింపుచుఁ బ్రజలామార్గమున సంచరించుచుండిరి. తరళ యచ్చటఁ గూర్చుండి యనేక విషయములం గూర్చి యాలోచించుచుండెను. సార్వభౌముఁ డేవిధముగా దర్శించి ప్రార్థింపవలయు ననునాలోచనయే యామెహృదయమును బాధించుచుండెను. వసుమిత్రునకుఁ జక్రవర్తి యాశ్రయము నొసంగనని నిరాకరించినచో నేమి గావలయును! అతని నిఁక నెక్కడకుఁ దీసికొనిపోవలయును? తన చెలిమికత్తెను—తన స్వామి పుత్రికను—ఏరీతిగా నూరడింపవలయును? ఈవిషయములం గూర్చిన మహాత్తరాలోచనలచేఁ దరళహృదయము చేపట్టి కలఁచివైచినట్లగుచుండెను. జరగిన రాత్రియంతయు, నిద్దుర లేకుండుటచే నామె కునికిపాట్లకు లోనగుచుండెను. అట్లే కూర్చుండి కన్నులు మూసి యొక్కింతకునుకు దీయుచుండెను.

తరళ యట్లు మైకముతో నుండి యుండి యొకసారి కన్నుదెఱచి పరికించెను. పురాతనభవనము చెంత నున్నతకాయుఁడగు పురుషుఁడొకఁ డిటునటుఁ బ్రచారము చేయుచున్నట్లామె కగపడెను. అందుచేఁ దరళ యించుకతడఁబడి వసుమిత్రునిఁ గాంచి "సార్వభౌములు వచ్చినారా?" అని ప్రశ్నించెను.

వసు—లేదు.

తర—అదిగో చూడు! అక్కడఁ దిరుగుచున్న వా రెవ్వరు?

వసు—ఎవ్వరో నాకుఁ దెలియదు.

తరళ యేదేనొకవిషయమును గ్రహింపవలసినప్పు డూరక కూరుచుండుస్వభావము గలది గాదు. ఆమె తత్క్షణమే లేచి ధైర్యముతోఁ బోయి యాపురుషుని సమీపించి యాతనికిఁ బ్రణామముం గావించెను.

పురు—నీ వెవ్వరమ్మా! నీకేమి కావలెను!

తరళ కిప్పుడు మాత్రము నిజముగానే యేడ్పు వచ్చెను. ఆమె యేడ్చుచునే "మహాప్రభూ! మీరెవ్వరో నేనెఱుంగను. ఎఱుంగకపోయినను మీ రేదో యున్నతాధికారము గలసత్పురుషులవలె నాకగపడుచున్నారు. నేనిప్పు డతిదుస్సహంబగువిపత్తునం బడి యెట్లయున సార్వభౌము నాశ్రయింపఁగోరి వచ్చియున్నాను. మహారాజాక వేళ నన్నే కారణముచేనైన రక్షింపక విడిచినచో నాకిఁక గత్యంతరము లేదు—నేనీనగరమునందలి యొకశ్రేష్ఠియింటి దాసిని. నాస్వామిపుత్రికకును—చారుమిత్రుని యేకపుత్రుఁడగువసుమిత్రునకును వివాహము నిశ్చయింపఁబడియుండెను. చారుమిత్రుఁడు బౌద్ధధర్మావలంబి కావున నాతని కీవివాహ మిష్టముఁ గాదయ్యెను— మాస్వామి వైష్ణవమతావలంబి— చారుమిత్రుఁడు బౌద్ధభిక్షుల కపటబోధనములకు వశుఁడై యజ్ఞానముచే ధర్మద్వేషపాశములకుఁ జిక్కి తనయేకపుత్రుఁడగువసుమిత్రుని బౌద్ధధర్మమునకు బలిచేసెను. ఆజన్మార్జితంబగు తనసర్వస్వమును బౌద్ధభిక్షుసంఘమునకు దానముచేయు నుద్దేశముతోఁ జారుమిత్రుఁడు తనపుత్రుని బౌద్ధభిక్షునిం జేసివైచుటకు సాహసించెను. భిక్షువైనయాతనికిఁ దనపెద్దలార్జించినధనముపై నెట్టియధికారము నుండదఁట! అందుచేతనే చారుమిత్రుఁ డట్లు చేసెను. వసుమిత్రుని విరహదుఃఖముచే నాప్రభుపుత్రిక మరణించునేమో యనుభయమున నేను వసుమిత్రుని వెదకుటకై బయలుదేఱితిని. ఆతఁడీయుపనగరమునందలి బౌద్ధ

విహారమునం దున్నాఁడని తెలిసికొని యెంతయోప్రయత్నము చేసి నిన్నటిరాత్రి యీతని నెట్లో యటనుండి విడిపించి వెంటఁబెట్టుకొని వచ్చితిని, కాని యీతనికిఁదగినయాశ్రయ మెక్కడ నున్నది? ఆవిచారముచే నాకేమియుఁ దోఁచుట లేదు. మీరు సార్వభౌములో కారో నేనెఱుంగను. మీరెవ్వరైన నగుదురుగాక! మీయాకారముం గాంచినంతనే మీరు దయాస్వరూపులు, ప్రేమానతారులు, కృపామూర్తులునని నాహృదయమునకుఁ దోఁచుచున్నది. అనాథులము, ననపరాధులము నగుమాముద్వురమును మీచరణసన్నిధి నాశ్రయ మొసంగి రక్షింపవలయును. పట్టపగలు, బట్టబయలను మేము భిక్షులకంటెఁ బడినచో వారు బలవంతముగా మఠమునకు మమ్మీడ్చుకొనిపోయి చంపక మానరు. ఈనగరమునం దింకను బౌద్ధులశక్తి యధికముగ నేయున్నది. ఆబౌద్ధులబారినుండి మమ్ము రక్షింపఁ గలసమర్థుఁ డీరాజధానియం దొక్కఁడును లేఁడు! మీరీసమయమున రక్షింపకున్నచో మాకిఁకఁ బ్రాణరక్షణము లేదు” అని ప్రార్థించుచు నేడ్చుచునే తరళ యాతనిపాదములపై వ్రాలెను. ఆపురుషుఁడు తరళ నూఱడించి “ నీవిఁక నెంతమాత్రమును భయపడవలదు. ఆశ్రేష్ఠితనయుఁ డెక్కడ నున్నాఁడు” అనియెను.

తరళ యాతనికి వసుమిత్రుని వ్రేలితోఁ జూపించెను. ఆపురుషుఁడాతనిఁ దనచెంతకు రమ్మని సంజ్ఞ చేసెను. వసుమిత్రుఁడాతని సమీపించి ప్రణమిల్లుటయు నాపురుషుండు తరళం గాంచి “ నీవీతని నాసంఘారామమునుండి యెట్లు తప్పించితివి?”అనివప్రశ్నించెను.

తరళ యాపురుషున కేదియోప్రత్యుత్తరమిచ్చుట కుపక్రి

మించెను. అంతలో వెనుకనుండి యెవ్వరో యాతనితో "ఆర్యా! నాయనగారిప్పుడే మీమాట తలపెట్టినారు" అని చెప్పెను.

ఆపురుషుఁడు చటాలున వెనుకకుఁ దిరిగిచూచెను. కుమారశశాంకుఁ డట నిలిచి యుండెను. పురుషుఁ డాతనింగాంచి మృదుస్వరముతో "వత్సా! సార్వభౌము డిప్పుడు నిన్నేల తలంచెనో నీకేమైనఁ దెలిసినదా?" అని ప్రశ్నించెను.

శశాం—నగరము బాగుచేయించువిషయమున మీతో నాలోచింపవలయునని యేమో!

పురు—నగరము బాగుచేయించుటకంటె మహత్తరకార్యమిప్పుడు నిర్వహింపవలసియున్నది. కుమారా! దండధరునొకని బిలిపింపుము!

కుమారుఁడు కనుసన్న చేసినంతనే తోరణద్వారముకడనుండి దండధరుఁ డొకఁ డట కేతెంచి యాతనిపార్శ్వమున నిలువఁబడియెను. ఆపురుషుఁ డాతనింగాంచి "నీవు మహారాజసన్నిధికిం బోయి నేనొకఘనకార్యమున నిమగ్నుఁడనై యుంటిననియు, ప్రభుసందర్శనము సేయుట కించుక యాలస్యము గావచ్చుననియు మనవి చేయుము" అని చెప్పెను.

దండధరుఁడు ప్రణామము చేసి యటనుండి వెడలిపోయెను. అనంతర మాపురుషుఁడు యువరాజుంగాంచి "కుమారా! ఇప్పుడు నీయెదుట నున్న యీయువతియుఁ బురుషుండును నీప్రజలే సుమా! ఈయిరువురును దుర్బలులై యుండుటచేఁ గొందఱు ప్రబలులగు దుర్జనుల యత్యాచారములకు లోనై మిగులఁ గష్టపడి సార్వభౌముని యాశ్రయముం గాంక్షించి యిట్లు వచ్చియున్నారు" అని చెప్పి తరళవంకఁ జూచి "ఈతఁడు యువరాజశశాంకుఁడు! నీవు

నాయొద్దఁ జెప్పినసంగతు లన్నియు నీతనికి విన్నవింపుము!" అని యెను.

ఆకుమారుఁ డెవ్వఁడో తెలిసినతోడనే తరళావసుమిత్రు లాతనికి నమస్కరించి యెల్లసంగతులును స్పష్టముగా మనవిచేసికొనిరి.

అనంతర మాపురుషుఁడు తరళం గాంచి "నీవీవసుమిత్రుని సంఘారామమునుండి యెట్లు విడిపించుకొని వచ్చితివి?" అనియెను.

అప్పుడామె దేశానందుని ప్రథమసందర్శనము మొదలాతని స్త్రీవేషముతుదివఱకును జరిగినసంగతు లన్నియు స్పష్టముగాఁ దెలియఁజెప్పెను. ఆసంగతులలోఁ గీర్తిధవళునిదారుణవధముం గూర్చి బంధుగుప్తుఁడు చెప్పినమాటలనుగ్గడించునప్పు డాపురుషుని శరీరమంతయు వర్ణనాతీతమగు వారుణ్యముం దాల్చెను.

ఆకథపూర్తియైనపిమ్మట నాపురుషుఁడు "ఆదారుణహత్యం గూర్చినసంగతి నింకొకసారి తెలుపుము." అని ప్రశ్నించెను.

ఆశిథిలదేవాలయమున విగ్రహముచాటున దాఁగియుండి. బంధుగుప్తునివలనఁ దానువినినవృత్తాంతమంతయుఁ దరళ యొక్క యక్కరమైనఁ బొల్లుపోనీయకుండ విన్నదివిన్నట్లుగా నాపురుషునకునివేదించెను. అంతయును విని యాపురుషుఁ డొక్కదీర్ఘనిశ్వాసమును విడిచి "వసుమిత్రా! ఈమెచెప్పినదంతయు నిక్కువమేనా?" అని యడిగెను.

వసు.—ఔను ప్రభూ!

అనంతర మాపురుషుఁ డాయుభయులను గాంచి "మీరిఁక నెంతమాత్రమును భయపడవలదు. బౌద్ధభిక్షులు మీకేశాగ్రమునకైన నపాయముం గల్పింపఁజాలరు. మీరిద్దఱును నావెంట రండు. మీకు యోగ్యమైన యాశ్రయస్థానమునకు మిమ్ముఁ దీసికొని పోయెదను" అనియెను.

హృదయమంతయుఁ గృతజ్ఞతాపూర్ణమగుటయుఁ దరళ చటూలున నాపురుషునిపాదములపైఁ బడియెను. మితభాషియగువసుమిత్రుఁడును దనహృదయభావమును వెక్కుచు స్పష్టీకరించెను. పిమ్మట నాపురుషుఁడు కుమారునివంకఁ గనుంగొనియెను. కుమారుని రూపమునఁ గూడఁ దీవ్రవిచారచిహ్నములాతనికిఁ గానవచ్చెను. ఆత్మసంయమన మశక్యమైపోవుటచే యువరాజప్పుడు క్రోధాతిరేకమునఁ బండ్లు పటపటగొఱుకుచుండెను!

అప్పుడు పురుషుఁడు "కుమారా!" అనిపిలిచెను.

శశాం—ఆర్య!

పురు—ఇది యాత్మసంయమనము చేసికొని యుండవలసిన సమయము! ఇప్పుడేమియు మాటాడవలదు.

శశాంకుఁడు తనహృదయావేగము నడంచుకొనఁ బ్రయత్నించెను గాని యాతని కది శక్యము గాకుండుటచేఁ దుద కేడువఁదొడంగెను. అప్పు డావృద్ధపురుషుఁ డాతనిం గౌఁగిటఁ జేర్చుకొని యూఱడించుచు" కుమారా! నేఁటియీసంగతి నీకు జ్ఞప్తియందుండునా? "అనిప్రశ్నించెను.

శశాం—(దృఢస్వరముతో) ఈనాదేహమునఁ బ్రాణమున్నంతవఱకు నేను మఱవఁజాలను.

అనంతరము ముందుగాఁ బురుషుఁడును, నాతనివెనుకఁ గ్రమముగా శశాంకుఁడును, వసుమిత్రుఁడును, దరళయు నంతఃపురమునకు వెడలిపోయిరి.

ఆస్థూలోన్నతశరీరి యగుపురుషుఁడు మహానాయకయశోధవళదేవుఁడే యని చతురపాఠకులకుఁ జెప్పవలయునా?



## ఇరువదియొకటవ ప్రకరణము

వసుమిత్రుని ప్రాణసంరక్షణార్థమై తరళ రాజభవనాంతఃపుర ద్వారమునొద్దఁ గూర్చున్నసమయమునందే పాటలీపుత్రనగర బాహ్యమునందలి బౌద్ధమందిరమునం దొక చిన్నప్రహసనము ప్రదర్శింపఁబడు చుండెను.

బౌద్ధభిక్షు లుదయముననే లేచి చూచునప్పటికి మందిరద్వారము మూయఁబడియేయున్నది. ఎప్పటివలెనే దానికిఁ దాళము వేయఁబడి యుండెను. కాని లోపలనుండి యెవ్వరో యామందిరద్వారమును దెఱచుటకుఁ బ్రయత్నించుచున్నట్లగపడియెను. అయద్భుతవిషయముం గాంచుటకు భిక్షులొక్కొక్కరుగా వచ్చి యచ్చట గుంపు గూడుచుండిరి. వారు నూఱుమందికంటె యెక్కువగనేయుండిరి. కొలఁదిసేపటిలోనే సంఘస్థవిర, వజ్రాచార్యు లచ్చటికి వచ్చిరి. వారింగాంచి భిక్షులందఱు నధికసన్మానముతో వారికిఁ ద్రోవ యొసంగిరి.

వజ్ర—ఏమి ! ఇట నిందఱు చేరినారు. విశేష మేమి?

అప్పు డొకతరుణభిక్షుఁడు "దేవా ! ఈద్వారము వెలుపలఁ దాళము వేయఁబడియేయున్నది. కాని లోపలనుండి యెవ్వరో తలుపు దెఱచుటకుఁ బ్రయత్నించుచున్నట్లున్నది !" అని చెప్పెను.

బంధుగుప్తశత్రుసేనులు ద్వారమునొద్దకుఁ బోయి పరిశీలించి "ఔను ! నిజమే—లోపలనుండి యెవ్వరో తలుపులను గదలించుచున్నారు. తాళము పగులఁగొట్టుఁడు; తలుపులు తీయుఁడు !" అనిరి.

శత్రుసేనుఁడు వెంటనే తాళము పగులఁ గొట్టి తలుపులను దెఱచెను. అందఱు నాశ్చర్యముతో లోపలివంకఁ జూచిరి. స్త్రీవేషధారి యగునాచార్యదేశానందుఁ డామందిరమునం దొకమూల నిలువఁబడియుండెను.

అప్పుడు శత్రుసేనుఁడు ముందఱికిఁ బోయి "దేశానందా! ఇట్లుంటివేమి?" అని ప్రశ్నించెను. తలుపు తెఱచినంతనే సందుదొరకినచోఁ దప్పించుకొని పాఱిపోవలయునని దేశానందుఁడు ప్రయత్నించెను. కాని యందఱుభిక్షులయెదుటనుండి పాఱిపోవుట కాతనికి సాహసము గలుగదయ్యెను. ఆతఁడట్లే కొయ్యబొమ్మవలె నిలువఁబడిపోయెను.

దేశానందుఁ డేమియు మాటాడకుండుటం గాంచి బంధుగుప్తుఁ డెదుటికిఁ బోయి "ఏమియాచార్యా! పలుకవేమి? ఈయపూర్వవేషము నీకెక్కడ సంభవించినది?" అని ప్రశ్నించెను.

అప్పటికిని దేశానందాచార్యుఁడు మాటాడలేదు. శత్రుసేనుఁ డాతని మరలఁ బలుకరించెను. ధిక్కరించెను. అప్పుడు దేశానందుఁడు పయ్యెదచెఱఁగుచే మొగము మూసికొని స్త్రీస్వభావకోమలస్వరమున మాటాడఁ బ్రయత్నించి యెట్టకేలకుఁ గంపితస్వరముతో "నేను—తరళను" అనియెను.

ఇంతవఱ కెవ్వరు నూహించియైననుండని యీప్రత్యుత్తరము నాలకించి శత్రుసేనుఁడు కోపోద్దీపితుఁడై యాతని మొగముపై నున్న ముసుఁగును లాగివైచి తీవ్రస్వరముతో "తరళయా? నీవదునాలుగుపురుషాంతరములలో నెక్కడ నున్నదిరా తరళ?" అని గద్దించెను.

దేశానందుఁ డిప్పు డతిదుఃఖితుఁడై పోయెను. ఆతఁడు వెక్కి వెక్కి యేడ్చుచు "తరళ—నన్ను—ఇంతగా—పరాభవించినది!" అనియెను.

శత్రుసేనుఁడు మఱింత కోపోద్దీపితుఁడై "ఒరీ! నీకాతరళ యెక్కడిదిరా? అది యెవరురా?" అనియెను.

దేశా.—(గద్గదస్వరముతో) తరళా! తరళా! నా—త—

శత్రు—ఎవ్వ రాతరళ యని యడుగుచున్నాను.

దేశా—తరళ నాసర్వస్వము—తరళా ! తరళా ! హాతరళా!

ఇంతలో వెనుకనుండి యొకభిక్షుఁడు వచ్చి " దేవా ! నిన్న రాత్రి జినానందుఁ డీదేశానందాచార్యునితో బయటికి వచ్చినాఁడు. కాని, మరలనాతఁడు సంఘారామమునకు వచ్చినట్లు లేదు—" అని చెప్పెను.

బంధు—(విస్మయముతో) అట్లయిన జినానందుఁ డీమందిర మునందే యున్నాఁడేమో !

జినానందుని శోధించుటకై కొందఱుభిక్షు లామందిరమునఁ బ్రవేశించి యెల్లెడలను వెదకి చూచి వెలుపలికి వచ్చి బంధుగుప్తునిం గాంచి " మందిరమున మూలమూలల వెదకి పరిశోధించితిమి. జినానందుఁ డెక్కడను గనఁబడలేదు" అని చెప్పిరి.

క్రోధసంక్షుభితహృదయుఁ డగుబంధుగుప్తునివదన మప్పు డతి తరంబుగ నారక్తమైపోయెను. ఆతఁడు దేశానందునిమెడ గట్టిగఁ బట్టుకొని యూఁచుచుఁ గట్టిగా నదలించుచు" చెప్పుము ! దురాత్మా ! జినానందు నెచ్చట దాఁచితివి ? చెప్పుము ! త్వరగా చెప్పకున్నచో నిన్నిప్పుడే మెడనులిచి చంపి యిక్కడనే పాతిపెట్టెదను" అని ధిక్కరించెను.

దేశానందుఁడు భయపరికంపితుఁడై ముక్తకంఠమున విలపింప నారంభించెను. అప్పుడువజ్రాచార్యుఁడు బంధుగుప్తుని వెనుకకు లాగి "సంఘస్థవిరా ! నీకును వీనికినిగూడ మతిపోయినదా యేమి ?" అని మెల్లఁగా " వీనినింతగా భయపెట్టినచో నిజము బయటంబడు ననుకొంటివా? కేవలమును నీకుఁ బిచ్చియెత్తినట్లున్నదే " అనియెను.

బంధుగుప్తుఁ డొక్కించుక శాంతుఁడై వెనుకకు వచ్చెను. అప్పుడు శత్రుసేనుఁడు తనయొద్దనున్నభిక్షులం గాంచి" మీరీతని నం

ఘూరామమునకుఁ గొనిపొండు. మేమిద్దఱము నొక్కింతసేపటిలో వచ్చె దము!" అని చెప్పెను.

స్త్రీ వేష ధారియగు దేశానందాచార్యుని వెంటఁ బెట్టుకొని భిక్షు లందఱు నామందిరమును వెలువడి వచ్చిరి. అప్పుడు వారయ్యాచార్యు నెన్ని విధములఁ బరిహసించి యుందురో మాపిరియపాఠకులే యూహింం చుకొనవచ్చును. బంధుగుప్త శత్రుసేను లిద్దఱుమాత్రమేయిప్పుడామం దిరమునొద్ద నాఁగిరి.

భిక్షులందఱును వెడలిపోయినపిమ్మట బంధుగుప్తుఁడు "వజ్రా చార్యా ! ఈయద్భుతసంఘటనముంగూర్చి నీవేమైన నూహించితివా? జినానందుఁడు నిశ్చయముగనే పాఱిపోయెనా? ఎన్నియోప్రయత్న ములు చేసి యెంతయోకష్టపడి చారుమిత్రుని వశపఱచుకొని నేనాత నిపుత్రునకు భిక్షుదీక్షయొసంగి జినానందనామమును బ్రసాదించి సం ఘూరామమున కాతనిం దెచ్చియుంటిని. అయ్యో ! ఈనాశ్రమయంత యు వ్యర్థమైపోవలసినదేనా?" అని యెను.

శత్రు—ఈచిక్కులన్నియు నేమో తెలియుట లేదు. కాని వసుమిత్రుఁ డొకవేళఁ బాఱిపోయినను స్థిరముగా మనచేతులనుండి తప్పించుకొనిపోఁగలఁడా? వాఁడు బౌద్ధదీక్షితుఁ డైనసంగతిని విన్నచో నగరమునం దాతని కాశ్రయమిచ్చుట కెవ్వరును సాహసింపఁజాలరు. అయినను దేశానందుఁ డేమేమి చేసెనో, స్త్రీవేషమువైచి యాతని నెవ్వరిమందిరమున నిర్బంధించిరోమాత్రము తెలియుట లేదు. ఈసం గతులన్నియు నాతఁడే చెప్పవలయును. అంతకంటెఁ దెలిసికొనుట కుపాయాంతర మేదియును లేదు. బంధుగుప్తా! నీవిప్పుడు దేశానందు నిపైఁ గోపము చూపింపవలదు. కోపగించితివా—నీకీవిషయమై తెలి సికొనుట కెట్టియవకాశమునుండదు. జినానందుఁడు మఠమునుండి యెట్లు తప్పించుకొనిపోయెనో, దేశానందునకు స్త్రీవేష మెవ్వరు

వైచిరో, తరళ యెవ్వరో, ఆమెకును దేశానందునకు నెట్టిసంబంధమో యీసంగతు లన్నియును యుక్తిచేసి దేశానందునివలననే తెలిసికొన వలయును.

బంధు—వజ్రాచార్యా! నిన్నరాత్రి మనమిక్కడకు వచ్చిన పుటికి తలుపులు తెఱవఁబడియేయున్నవి. అప్పుడు దేశానందుఁ డిట నెచ్చటను గానఁబడలేదు.

శత్రు—అవును. నీమాట నిజమే—నీవుకీర్తిధవళునివృత్తాంతమును జెప్పినప్పటి కీమందిరమునం దెవ్వరును లేరు.

బంధు—సరే కాని—ఎవ్వరైనఁ బొంచి యుండి మనమాటలను వినలేదుగద!

శత్రు—ఎవ్వరును వినియుండరు.

బంధు—(చింతాక్రాంతుఁడై) నాకేమో మిక్కుటముగ భయమగుచున్నది. నేనింక నీప్రాంతమునం దుండఁజాలను. నీవిక్కడనుండి దేశానందునియుదంతమును బరిశీలింపుము. నేనిప్పుడు వంగదేశమునకుఁ బోయెదను. యశోధవళుఁ డిప్పుడీనగరమునందే యున్నాఁడు. మనమాటల నెవ్వరైన విని యాతనికిఁ దెలిపినచో నాకిప్పుడే నూతేండ్లును నిండిపోవును.

శత్రు—(ఆలోచించి) నీవనినమాట నిజమే—మన మిప్పుడే యిటనుండి పాఱిపోవుట మంచిదని తోఁచుచున్నది. కీర్తిధవళుని వృత్తాంత మెట్లయిన యశోధవళునకుఁ దెలిసినచో భయంకరప్రతీకారము గావించువఱకు నాతఁ డూరకుండఁడు. కాని, నీవిప్పుడు వంగదేశమున కెట్లు పోయెదవు? నీవు లేకున్నచో నిచ్చటి సంఘకార్యములన్నియును భగ్నములైపోవా? కావున నిప్పుడు మనము దేశానందుని వెంటఁబెట్టుకొని కపోతికసంఘారామమునకుఁ బోయి యుందము. అచ్చట నిశ్చయముగా బుద్ధఘోషుఁడు మనలను రక్షింపఁగలఁడు.

బంధు—అట్లయినచో నడువుము; ఇప్పుడే పోవుదము.

శత్రు—సరే! పద! కాని యిప్పుడీమందిరము సంఘారామములవిషయమున దగినకట్టుదిట్టములను గావించి మఱిపోవలయును.

బంధు—భగవానునివ్యవస్థలు భగవానుఁడే చేసికొనును. మన మావిషయమునఁ జింతింపనక్కఱలేదు. అంతయావశ్యకమును లేదు. మన మిప్పుడే పోవుదము రమ్ము!

శత్రు—సంఘస్థవిరా! నీవు భయభ్రాంతుఁడవైనట్లున్నావే?

బంధు—ఆలాగా? నాశరీరమునుండి నాతలను ఖండించి యొక్కబల్లెమునకు గ్రుచ్చి నగరతోరణద్వారమునకుఁ గట్టినప్పుడు బుద్ధుఁడుగాని, బౌద్ధధర్మము గాని, బౌద్ధసంఘముగాని వచ్చి నన్నురక్షించుట కవకాశమున్నదా?

శత్రు—సరే—నడువుము! సంఘారామమునను న్న దేశానందుని దోడ్కొనిపోవుదము.

తత్క్షణమే యాయిరువురును మందిరమునుండి వెడలి సంఘారామమునకుఁ బోయిరి. అప్పటికప్పుడే భిక్షులు దేశానందునిస్త్రీవేషమును మార్పించి యెప్పటివస్త్రములను గట్టించిరి. శత్రుసేనుఁడప్పుడు దేశానందునింగాంచి మెల్లగా "ఆచార్యా! మీరిప్పు డొకసారి కపోతికసంఘారామమునకు రావలసియున్నది." అనియెను.

దేశా—(ఏడ్చుచు) నేనక్కడ కేలరావలయును?

శత్రు—ఊరక భయపడియెదవేల? మహాస్థవిరుఁడు విందు కొఱకు నీకాహ్వానమునంపించినాఁడు.

కాని, యీమాటయందు దేశానందునకు విశ్వాస మెట్లు కలుగును? అతఁడు బాలకునింబోలి యెలుఁగెత్తి యేడువఁదొడంగెను. తన్నుఁ జంపుటకే కపోతికసంఘారామమునకుఁ దీసికొనిపోఁదలఁచి రని దేశానందుఁడు మిగులభయపడెను.

శత్రుసేనుఁ డపు డొక భిక్షునిం బిలిచి "జినేంద్రబుద్ధీ! నీవీసంఘారామమును, మందిరమును సంరక్షించుచుండవలయును. ఈభారమంతయు నీపైఁ బెట్టుకొనుము. మేమిప్పు డత్యావశ్యకం బగుకార్యమునకై కపోతికసంఘారామమునకుఁ బోవుచున్నారము. ఇరువురుభిక్షులను దోడిచ్చి యాచార్యదేశానందు నక్కడకుఁ బంపుము." అనియాజ్ఞాపించెను.

అనంతరము బంధుగుప్తశత్రుసేనులు సంఘారామమును వీడిపోయిరి. భిక్షులప్పుడు యథేచ్ఛముగా దేశానందుని బరిహాసము చేయ నారంభించిరి; గాని యాచార్యుఁ డెవ్వరికిని మాఱుమాట చెప్పక యొక్కపెట్టున నేడ్చుచుఁ గూర్చుండెను.

బంధుగుప్తశత్రుసేనులు బయలుదేఱిపోయి రెండుగడియ లై యుండును. ఇంతలోఁ బదిపండ్రెండువందలమంది యాశ్వికులు వచ్చి యామందిరసంఘారామములనలువంకలను ముట్టడించిరి. వసుమిత్రునివెంటఁ బెట్టుకొని, మహాబలాధ్యక్షుఁ డగు బంధుగుప్తుఁడును, యశోధవళదేవుఁడును బంధుగుప్తునికొఱకు వెదకసాగిరి. కాని వారి కాతఁ డగపడఁడయ్యెను. భిక్షులను బ్రశ్నించిరిగాని యేమియులాభము లేకపోయెను.

అప్పుడు వసుమిత్రుఁడు దేశానందుని వ్రేలితోఁ జూపుచు "ప్రభూ! నామఃక్తి కీయాచార్యుఁడు చాలవఱకు సాయపడినాఁడు. వీరి నడిగినచో బంధుగుప్తునిజాడ తెలియఁగలదు." అని చెప్పెను.

యశోధవళుఁడు దేశానందు నొకచోటికిఁ దీసికొనిపోయి నిన్నేమియు బాధించువారము గామని యాశపెట్టి మెల్లగా బుజ్జగించి యడిగెను. అప్పుడు దేశానందుఁడు "బంధుగుప్తుఁడుకపోతికసంఘారామమునకుఁ బోయినాఁడు" అనిచటాలునఁ జెప్పివైచెను.

తత్క్షణమే—ఇఁక నొకక్షణమైన వాలస్యము సేయక మహానాయకయశోధవళుఁడు సేనాసహితుఁడై కపోతికసంఘారామమునకు వాయువేగముతోఁ బరుగెత్తిపోయెను. అనంతరము హరిగుప్తునాజ్ఞచే నిరువురాశ్వికులు దేశానందజినేంద్రబుద్ధులను నిర్బంధించి రాజగృహమునకుఁ గొనిపోయిరి.



## ఇరువదిరెండవప్రకరణము

తరళవలనఁ గీర్తిధవళునిహత్యాచరిత్రము వినినదిమొదలు యశోధవళునిహృదయ మవర్ణనీయం బగుమహాసంక్షోభముం గాంచుచుండెను. ఆతఁ డతికష్టముతో నెట్టెట్టులో తనహృదయోద్వేగము నడఁగించుకొని తరళా వసుమిత్రులను వెంటఁబెట్టుకొని సార్వభౌముని సన్నిధికిఁ బోయెను. సార్వభౌముఁడు మహానాయకునివలనఁ గీర్తిధవళునిమరణవృత్తాంతమును విని బాలకునింబోలి ముక్తకంఠుఁడై యేడువఁదొడంగెను. మహాబలాధ్యక్షుఁడగు హరిగుప్తుఁడుగూడ నప్పుడచ్చటనే యుండెను. ఆతఁడును,యశోధవళుఁడును గలసి యతికష్టముతోఁ జక్రవర్తి నూఱడించిరి.

అనంతరము హరిగుప్తుఁడు "మహాప్రభూ! కీర్తిధవళునిమరణవృత్తాంత మింతలో నే మనకుఁ దెలియఁగలదని బంధుగుప్తుఁ డనుమానించి యుండఁడు. కొంతయాశ్వికదళముతో మన మిప్పుడే పోయి యాపురాతనమందిరమును, సంఘారామమును ముట్టడించినచో నాదుర్మార్గుఁడు తప్పకుండ మనచేతులలోఁ బడఁగలఁడు. ఒకవేళ వాఁడీపాటికే పాఱిపోయి యుండినచో నింతలో నెంతదూరము పోఁగలఁడు? ఒక్కనిమిషములో వెదకి మన మాతని బట్టుకొనఁగలము.

హారిగుప్తుని యీయాలోచనము నాలకించి సార్వభౌముఁ డుత్సాహముతో నట్లు చేయుమని యంగీకరించెను. మఱియు "మీరీశ్రేష్ఠితనయుఁడగు వసుమిత్రుని గూడఁ దీసికొనిపొండు! అట్లయిన చో మీ కక్కడి సంగతు లన్నియును సులభముగాఁ దెలియఁగలవు" అని యాజ్ఞాపించెను.

అప్పుడు యశోధవళుఁడు వసుమిత్రునిం గాంచి "నీ వశ్వారోహణముం గావింపఁగలవా?" అని యడిగెను.

వసు—చిత్తము ప్రభూ! నాకుఁ జిన్నతనమునుండియు గుఱ్ఱపుస్వారి చేయునలవాటున్నది.

యశో—మఱి—సంఘారామమునకు వచ్చుటకు నీ కేమియును భయము లేదుగద!

వసు—(చేతులు జోడించి) స్వామీ! అసహాయుఁడనై, యాయుధవిహీనుఁడనై, నిరుపాయుఁడనై యున్నయవస్థలోఁగూడ నే నేకాకినై బౌద్ధభిక్షు సంఘమధ్యమున ధైర్యమువహించి యుండలేదా? మహాప్రభూ! అట్టి స్థితిలోఁగూడ నేనించుకంతయును భయపడలేదు. మహానాయక సహాయుఁడనైయున్న నాకిప్పుడేమిభయము?

యశో—మంచిది. నీ కాయుధపరిచయ మేమైన నున్నదా?

వసు—ఉన్నది. ప్రభువులు నన్నుఁ బరీక్షింపవచ్చును.

యశో—(సంతుష్టుఁడై) సరే! నీవు వాత్సరమ్ము! నీకు శస్త్రముల నొసంగెదను.

అప్పుడు యశోధవళుఁడు వసుమిత్రుని భవనాంతర్భాగమునకుఁ గొనిపోయెను. పాపము! తరళనేత్రము భయవ్యాకులహృదయముతో నిలిచినచోటనే నిలువఁబడిపోయెను. ఆమె కనుదమ్ముల నుండి యశ్రుధారలు జాల్వారుచుండెను. సార్వభౌముఁ డామెం గాంచి కరుణార్ద్రస్వరముతో "బిడ్డా! నీవేమియును భయపడవలదు

వసుమిత్రునితోఁ బదిపండ్రెండువందలమంది యశ్వసైనికులు పోవు చున్నారు. ఇప్పు డాతని బలవంతముగాఁ దీసికొనిపోయి నిర్బంధించు ట కెవ్వరికిని సాధ్యము గాదు. ఆతనికొఱకు నీ వెంతమాత్రమును విచారింపవలదు" అని యూఱడించెను.

అటుపిమ్మటఁ జక్రవర్తి వినయసేనుం గాంచి "ఈమె నిప్పు డంతఃపురమునకుఁ దీసికొనిపోయి మహాదేవి కొప్పగించి రమ్ము." అని సెలవిచ్చెను.

సార్వభౌమునిదయాపూర్వక మగునాశ్వాసము లభించుటచేఁ దరళవిచారమంతయును దూరమైపోయెను. వినయసేనుఁ డామెను వెంటఁబెట్టుకొని యంతఃపురమునకుఁ బోయెను.

ద్వితీయతోరణమునకు వెలుపల నంగరక్షకాశ్వికదళ మొకటి వేచియుండి ప్రయాణమునకుఁ బ్రతీక్షించుచుండెను. సర్వసన్నద్ధము లై మహోన్నతము లైయున్న యుత్తమాశ్వములను మూఁడింటిని బట్టుకొని గుఱ్ఱపువాఁ డొకఁ డచ్చట నిలిచి యుండెను. ఈప్రయత్నమంతయు నేమిటో, యెందులకో యించుకంతయును దెలియకుండుటచేఁ దెలిసికొనవలయు ననువాత్రముతో ననేకులు తోరణబహిర్భాగమున గుంపుగూడి మెడలు పైకెత్తి చూచుచు నిలిచియుండిరి.

ఇంతలో యువరాజశశాంకునితోడను, వసుమిత్రునితోడను గలసి యశోధవళదేవుఁడు తోరణద్వారమును దాఁటి వచ్చెను. వారిం జూచినంతనే యాశ్వికయోధు లందఱును దమనియమానుసారముగా వారి కభివాదనములం గావించి మరలఁ దురగముల నధిరోహించి తృతీయద్వారమువఱకును నడపించుకొని పోయిరి. వారివెనువెంటనే పదిపండ్రెండువందలమంది యాశ్వికసైనికులు బయలుదేఱి పోవుచుండిరి. మహాబలాఢ్యుఁ డగుహరిగుప్తుఁడే స్వయముగ వారి

నను నడపించుచుండుటం గాంచి నగరవాసు లందఱును మహాశ్చర్య సంభ్రమములై నిలిచినచోటనే నిలువఁబడిపోయిరి. ఆసేనయంతయు నెల్లెల పోవుచున్నదో వారికిఁ దెలియనేలేదు.

ఈయాశ్వికదళమునంతను వెంటఁబెట్టుకొనిపోయి యశోధవళుఁడు బౌద్ధమందిరమునం దేమి గావించెనో వెనుకటిప్రకరణమునఁ దెలిపియే యున్నాము. అప్పుడు సంఘారామమునందలి భిక్షులలో నెవ్వరునుగూడ వసుమిత్రుని గుర్తింపలేదు. రాజగృహమునుండి బయలుదేఱునప్పుడే యశోధవళుఁడు వసుమిత్రునకా పాదమస్తకమును గవచ శిరస్త్రాణములను దొడిగించియుండెను. అందుచేనాతని నెవ్వరు నానవాలుపట్టఁజాలకపోయిరి.

ఆపురాతనమందిరమున బంధుగుప్తునిజాడ యగపడకుండుటచే యువరాజును, యశోధవళుఁడును దక్షణమే తమసేనతోఁ గపోతిక సంఘారామాభిముఖులై మహావేగముతో వెడలిపోయిరి. అంగరక్షకాశ్వికయోధులుమాత్రము హరిగుప్తునాజ్ఞచే నగరాభిముఖులై పోయిరి. ఆయశ్వపదాఘాతములవలన రేఁగినధూళిచే నాయుపనగర రాజమార్గమంతయుఁ గొంతసేపటివఱకును నంధకారబంధురమై యుండెను.

బంధుగుప్తశత్రుసేనులు సంఘారామమును వదలి యింకను జాలదూరము పోలేదు. ఇంతలోనే చటాలున వారామార్గమధ్యమున నిలిచిపోయిరి. అప్పుడు శత్రుసేనుఁడదరిపడి "బంధుగుప్తా! మనవెనుక నుండి యనేకాశ్వపదాఘాతధ్వనులు వినవచ్చుచున్నవి." అనియెను.

బంధుగుప్తుఁడు తత్తరముతోఁ జెవియొగ్గి యాలకించెను. అనేకులగునశ్వసైనికులు తమవెనుకనుండియే వచ్చుచున్నారని వారికి నిశ్చయముగాఁ దెలియవచ్చెను. అందువలన బంధుగుప్తుఁడు భయ

భ్రాంతుఁడై గడగడ వడఁకుచు "వజ్రాచార్యా! నీవనినమాట నిజమే!" అనియెను.

శత్రు—ఔను, ఇట్టిస్థితిలోఁ జటాలున మన మెక్కడకైనఁ బోయి దాఁగియుండుట మంచిపని—మనసంఘారామమునుండి తప్పించుకొనిపోయినవసుమిత్రుఁడు మన కెన్నెన్నియనర్థములను దెచ్చిపెట్టునో యెవరికిఁ దెలియును?

బంధు—(కంపితకంఠముతో) వజ్రాచార్యా! నాకుఁ జావు నిశ్చయమైనది—నాజాడ యశోధవళునకుఁ దెలిసిపోయినది—ఆతఁడు నన్నుఁ బట్టుకొని బంధించి తీసికొనిపోవుటకే యిందఱాశ్విక యోధులతో నిట్లు వచ్చుచున్నాఁడు! అయ్యో! ఇప్పు డేమిగతి! నా కేమియుఁ దోఁచుటలేదు.

శత్రుసేనుఁ డెన్నియోవిధముల నాతనికి ధైర్యము చెప్పి యూఱడించుచు "మిత్రమా! ఇట్లు భయవిహ్వలుఁడవై కాలుసేతులు వేలవైచికొని యూరక చూచుచుండుటవలన నేమిలాభము? వలదు! భయపడవలదు! ఏదియో యతిభయంకరమగువిపత్తు మనకు సంభవింపనున్నమాట నిజమే! అందుల కించుకంతయు ననుమానము లేదు. కాని, యిప్పుడుమాత్రము నీవిట్లు భయపడి యూరకుంటివా నీకుఁ జావు నిశ్చయమే యని భావింపుము—నీకే గాదు—నీతోఁ గలసియుండుటచే నాకును జావు రాక మానదు. అదిగో! మనయెదుట నతినిబిడంబగు తాళవన మగపడుచున్నది, అతివేగముగ మన మచ్చటికిఁ బాఱిపోయి యెందైన దాఁగియుందము రమ్ము! నడువుము! అడుగులు త్వరగా సాగనిమ్ము!" అని హెచ్చరించెను.

అచ్చటి కనతిదూరమునందే యున్నయొక పాత చెఱువునొద్ద రాజమార్గమున్నది. ఆమార్గమున కిరువంకలను జిన్నవియుఁ బెద్దవియు నగుతాటిచెట్లు దట్టముగాఁ బెరిగి యుండెను. శత్రుసేనబంధు

గుప్తులు వడిగాఁ బరుగెత్తుకొనిపోయి యాతాళవనమధ్యప్రదేశమునఁ బ్రవేశించి యెవ్వారికి నగపడకుండ నొదిగి యుండిరి.

చూచుచుండఁగనే వెనుకనుండి పరుగెత్తుకొని వచ్చుచున్న యాశ్వికదళ మచ్చోటికి వచ్చి చేరెను. అందఱికంటె ముందుగా మహోన్నతం బగుసింధుదేశపునీలాశ్వరాజము నధిరోహించి యువరాజు వచ్చుచుండెను! ఆతని సర్వాంగకములు నమూల్యమణిఖచితం బగుసువర్ణకవచముచే నాచ్ఛాదింపఁబడి యుండెను, రజతశ్వేతంబగు నాతనిశిరస్త్రాణముప్రక్కను బంగారుమెఱుంగులఁ దురంగలించు పింగళవర్ణంబులగు నెఱికురులు గాలికిఁ దూలియాడుచుండెను. ఆసూర్యకిరణప్రసారముచే నాతనిసువర్ణరత్నకవచ మగ్నిజ్వాలవలె దేదీప్యమాన మగుచుండెను. ఆయువరాజునకు వెనుకవైపుననే కవచోష్ణీషధారి యగుయశోధవళదేవుఁ డశ్వారూఢుఁడై యుండెను. ఆతని పొడుగుపాటి తెల్లనిశిరోజములు శిరస్త్రాణమునుండి వెలువడి నడుము వఱకును వ్రేలాడుచుండెను.

ఆయశోధవళునిభీకరమూర్తిఁ గన్నులఁ బడినంతనే భయముచే శత్రుసేననిగుండె గుభిల్లుమనుటయుఁ బ్రకంపితము లగు నాతని సర్వాంగకములును గంటకితము లైపోయెను. ఆతనిదేహమంతయును స్వేదసిక్తమైపోయెను, అప్పుడు బంధుగుప్తుఁడు మెల్లఁగా "వజ్రాచార్యా! యశోధవళుఁ డాతఁడే కాఁబోలును!" అనియెను.

శత్రు—ఔను—ఆతఁడే—

బంధు—(భయకంపితస్వరముతో) నరే—మృత్యుదర్శన మైనది. ఉత్తరక్షణమేమగునో?

శత్రు—అదృష్ట మెట్లున్నదో యట్లు జరగును. భయపడి మాత్ర మేమిచేయుదుము! మాటాడకుము!

యశోధవళుని వెనుకనుండి కవచధారులగు నిరువురాశ్వికులు వచ్చుచుండిరి. బంధుగుప్తుఁడు గాని, శతృసేనుఁడు గాని వారిని గుర్తింపనేలేదు. ఆచెరువుగట్టునొద్దకు వచ్చునప్పటి కందులో నొక్కని శిరస్త్రాణ మూడి తటాల్మనఁ గ్రిందఁ బడిపోయెను. తాఁటిచెట్లచాటున దాఁగియున్న శతృసేనబంధుగుప్తు లాతనిం గాంచి వసుమిత్రుఁడే యని యానవాలు పట్టిరి. ఆసమయమున వారికిఁ గలిగిన యాశ్చర్యమునకుఁ బారమే లేదు.

ఆయిద్దఱు రౌతులకును వెనుకనుండి వరుసనైదుగురుచొప్పున నెన్నియోవరుసలుగఁదీరి తక్కినయాశ్వికయోధులు నడచుచుండిరి. వసుమిత్రుఁ డప్పుడు చటాలున నశ్వావతరణంబు చేసి, క్రిందఁబడి పోయినతనశిరస్త్రాణముం దీసికొని మరలఁ దురగారోహణంబుగావించి యొక్కపరుగునఁబోయి తక్కినవారిం గలిసికొనియెను.

ఆయాశ్వికసైన్యమంతయుఁ గొంతదూరము ముందటికిఁ బోయిన తరువాత బంధుగుప్తుఁ డెగయూపిరి విడుచుచు నెమ్మెల్లగా "వజ్రాచార్యా! ఇప్పటి కీగండము గడచిపోయినది. కంఠగతములైన ప్రాణములు మరలఁ గుదుటఁ బడినవి. ఇఁక ననంతరకర్తవ్యమేమో చెప్పుము." అనియెను.

శతృ—నీవీక్షణమునందే వంగదేశమునకుఁ బరుగెత్తుము! అంతకంటె నిఁక నేయుపాయమును లేదు. ఒక్క నిమిషము సైతమును నీపాటలీపుత్రమునం దుండఁగూడదు. ఇచ్చటి ప్రతినిమిషమును నీకు గండమే.

బంధు—(నిట్టూర్పు విడుచుచు) సరే! నేనిప్పుడే బయలుదేఱి పోయెదను; నీవేమి చేయఁదలఁచితివి?

శతృ—నేనీనగరమునందే యుండెదను.

బంధు—ఆలాగా? అట్లయినచో నేనుగూడ నిక్కడనేయుండి చచ్చిపోయెను.

శత్రు—(ఆశ్చర్యముతో నదరి పడి) అదియేమి? నీమాట కర్థమేమో నాకు సరిగా బోధపడుట లేదు.

బంధు—(గద్గదస్వరముతో) నాప్రాణములు పోయెనను నరే! నేనెక్కడనువూలెత్తి మెక్కడకును బోదలంచుకొన లేదు.

శత్రుసేనుడు బంధుగుప్తునిముఖలక్షణమును దదేకదృష్టిం బరీక్షించెను. బంధుగుప్తుడు భయవిహ్వలహృదయముతోఁ దెల తెలపోవుచు వెఱ్ఱివానివలె నుండెను. ఇఁక నెన్నివిధములఁ బ్రియత్నించి యెంతధైర్యము చెప్పినను బంధుగుప్త నూఱడించుట యసాధ్యమని భావించి శత్రుసేనుఁడు మృదుస్వరముతోఁ "అట్లయినచో శీఘ్రముగ లెమ్ము! నేనుగూడ నీవెంటనే వచ్చెదను!" అనియెను.

అనంతర మాయిరువురు నతిజాగరూకతతో నలుదెసలను బరికించి యాతాళవనమునుండి వెలువడి గంగాతీరమార్గాభిముఖులై శీఘ్రగమనంబున బయలుదేఱి పోయిరి.

ప్రాతఃకాలమునఁ గపోతికసంఘారామాంగణమునందుఁ గూర్చుండి మహాస్థవిరుఁ డగుబుద్ధఘోషుఁడు తనగూఢచారులు గొని తెచ్చినసందేశముల నాకర్ణించుచుండెను. ఆచారు లందఱును బౌద్ధభిక్షువులే. ఒకయాచార్యుఁడు మహాస్థవిరునిసమ్ముఖమునందు నిలువఁబడి యాతని కావచ్చినచారులను బరిచితులం గావించుచుండెను. బుద్ధఘోషుఁడు సావధానముగానుండి చారులసందేశములను వినుచుండెను.

నిన్నటిదినమున రాజభవనమునందు జరగినవిశేషములను దెలిసికొని వచ్చినచారుఁడొకఁ డప్పుడు వినయముతో "స్వామీ! నిన్న మధ్యాహ్నసమయమునందు సార్వభౌముఁడు గంగాతీరమునందలి ఘట్టముపైఁ గూర్చుండి యుండఁగా యశోధవళదేవుఁ డచ్చటికివచ్చి తానింతటినుండి సామ్రాజ్యకార్యనిర్వహణభారమును వహింపఁదలఁ

చియున్నట్లు మనవి చేసికొన్నాఁడు. నేనప్పుడు దాపుననున్న యొ
కచెట్టుచాటున దాఁగియుండి వారిసంభాషణమంతయును వినియుం
టిని——"

అని యిఁక నేమేమియో విశేషించిచెప్పఁ దొడంగెను. కాని
యింతలో సంఘారామముఖద్వారముకడనుండి యొకభిక్షుఁ డతి
త్వరితముగ నచ్చటికి వచ్చి వగర్చుకొనుచు "దేవా! లెక్కలేనంత
మంది యాశ్వికసైనికులు తమతురంగములను వాయువేగమునఁ బ
రుగెత్తించుకొనుచు మనసంఘారామమువైపుననే వచ్చుచున్నారు!"
అని చెప్పెను.

బుద్ధఘోషుఁడామాట విన్నంతనే యదరిపడి "ఈక్షణమునందే
మనసంఘారామద్వారములను బంధింపుఁడు!" అని యాజ్ఞాపించెను.

భిక్షులతిత్వరితముగాఁ దోరణద్వారము కడకుఁ బరుగెత్తిరి.
మహాస్థవిరుఁడును జటాలున లేచి ద్వారమువైపునకుఁ బోవఁదొ
డంగెను.

పాటలీపుత్రనగరమునందలి యీకపోతికసంఘారామభవన
మతిప్రాచీనమైనది. దీనిని బూర్వకాలమునం దశోకచక్రవర్తి నిర్మిం
చియుండె నని జనప్రవాదము విశేషించి యున్నది. ఈభవనమంతయు
నడుగునుండి పైవఱకును గఠినశిలావినిర్మితమే. దీనికి నలువంకలను గ
ఠినశిలామయం బగునున్నతప్రాకారము గలదు. అలంఘ్యమును, న
తివిశాలమును నగునీసంఘారామమునందు బౌద్ధభిక్షులకొఱకై యను
వేలకంటె నింక నెక్కుడుగనే సుఖాసనము లమర్పఁబడి యున్నవి.
మనకథా కాలమునాఁటికాసంఘారామమునఁ బదిపండ్రెండువందలమం
దిభిక్షువు లున్నారు. ఆరామమునకు నాలుగువైపులను నాలుగు సిం
హద్వారములు లున్నవి. అవి రేయుంబవ లెల్లప్పుడును దెఱవఁబడియే
యుండును. రాజక్రాంతికాలములయందును, విప్లవసమయములయం

దును ననేకపర్యాయములు పాటలీపుత్రప్రజలీసంఘారామమును విధ్వస్తముం గావించియుండుటచే మరల నెన్నటికి నట్టిమహానర్థము కలుగకుండుటకై దానికిఁ జతుర్దిశలయందును దిట్టముగా నయోమయంబు లగుద్వారములు నిర్మింపఁబడియుండెను. ఎంతయో భయంకరమగువిపత్తు సంభవించు ననితోఁచిననే గాని యాతలుపులను మూయించుట కుత్తరువు లేదు. ఏమనిన — దేవతాసందర్శనమునకై యెల్లపుడును నాగరికు లయ్యారామమునకు వచ్చుచుందురు. కావున వారికనుకూలముగా నుండుటకై తలుపు లెప్పుడును దెఱువఁబడియే యుండును.

మహాస్థవిరుఁ డగు బుద్ధఘోషుఁ డప్పుడు తోరణద్వారము కడకు వచ్చి చూచెను. ఆయుధపాణు లగునాశ్వికు లనేకులాసంఘారామము నాలుగువైపులను ముట్టడించి యుండిరి. కవచధారులగు ముగ్గురుపురుషు లాతోరణద్వారమున కెదురుగ నిలిచి యాసైనికుల కాజ్ఞల నొసంగుచుండిరి. వారిగుఱ్ఱములను మూఁడింటిని బట్టుకొనియొక రౌతు వారిసమీపముననే నిలిచియుండెను.

ఇదియంతయుం గాంచి బుద్ధఘోషుఁడాశ్చర్యభయవిభ్రాంతుఁడై పోయెను. అతఁడప్పుడు మెల్లగాఁ దోరణద్వారముపై కెక్కి కవచధారులగు పురుషుల నుద్దేశించి "అయ్యా! మీరెవ్వరు? ఈదేవతామందిరము నిట్లవమానించుటకుఁ గారణ మేమి? సాయుధు లగునింతమంది సైనికులతో వచ్చి నిరాయుధులును, నిరపరాధులు నగు బౌద్ధభిక్షులమఠమును మీరిప్పు డెవ్వరియాజ్ఞచే నిట్లు ముట్టడించితిరి?" అని ప్రశ్నించెను.

అప్పు డాపురుషులలో నొకఁడు తలఁ బై కెత్తి చూచి "మీరెవ్వరు?" అని యడిగెను.

బుద్ధ—నేను భగవానుఁ డగుబుద్ధదేవుని యాదేశముచే నీసంఘారామమునందుండి యిందలి సమస్తవ్యవహారములను బరిశీలించుచుందును. నన్ను బుద్ధఘోషుఁడందురు.

పురు—అలాగా? మీరు నన్ను గుర్తించియే యుందురనుకొనియెదను. తెలియకున్నచో నాపేరు యశోధవళుఁ డని యెఱుంగుఁడు. నేను రోహితాశ్వదుర్గమున కధినాథుఁడను. సామ్రాజ్యమున మహానాయకుఁడను. ఇప్పుడు నేను నాపుత్త్రుని వధియించిన హంతకుని వెదకి పట్టుకొనుటకై యిచ్చటికి వచ్చి యుంటిని. శీఘ్రముగా నీబంధిత ద్వారములను దీయింపుఁడు! మేమీ సంఘారామమునఁ బ్రవేశించి నరరూప రాక్షసుఁడును, హంతకుఁడు నగు బంధుగుప్తుని వెదకిపట్టుకొని బంధించి తీసికొనిపోయెదము.

తోరణద్వారముపై నున్న మహాస్థవిరుఁ డప్పుడు యశోధవళుని పేరు విన్నంతమాత్రముననే భయపరికంపితుఁ డైపోయెను. ఆతని దేహమంతయును గగుర్పొడిచెను. కాని యాతఁ డెట్లో యాత్మసంయమనముం గావించుకొని వినయపూర్వకంబగు మృదుస్వరముతో "మహానాయకా! అమృతసాగరధవళంబగు మీయశశ్చరిత్రము మీపాటలీపుత్త్రనగరమున నివసించియుండు ప్రతివ్యక్తికిని గంఠపాఠమైనదియే. ఎట్టిదుర్బోధనలనాలకించుటచేతనో, యెట్టియనుమానము హృదయమును బాధించుటచేతనో మీపుత్త్రఘాతుకుఁ డిందుండు నని నిశ్చయించి యాతని నిర్బంధించి కొనిపోవుటకై మీరిచ్చటి కింతసంరంభముతో వచ్చియుంటిరి. కాని యీసంఘారామమున నిరపరాధులును నిష్కల్మషులును, నిరీహులును, నిరుపేదలు నగుభిక్షులుమాత్రమే నివసించి యుందురు. నరఘాతుకపిశాచములకు నరకమునందేగాని యీపవిత్ర దివ్యస్థలంబున నాశ్రయ మెట్లు లభించును? మీపుత్త్రహంతకునిగా మీ రెవ్వని నిశ్చయించి యుంటిరో యాతఁ డుత్తరదేశమునందలి యొకబా

ద్ధసంఘమునకు స్థవిరుఁడై యున్నాఁడు. ఈయార్యావర్తదేశమునం దెవ్వరునుగూడ నాబంధుగుప్తుని పేరైనను వినియుండరు, అయినను బుద్ధదేవుని ప్రశాంతనిర్మలధర్మము నవలంబించి భిక్షుదీక్షాపేక్షులై వచ్చు నుత్తమశిష్యులకుఁ బ్రత్యక్షబుద్ధభగవానుఁడై సంఘస్థవిరుఁడై యున్న యాతనిచే దారుణనరహత్యవంటిమహాపాతకము గావింపఁబడు ననుట యేమైనను విశ్వాసార్హముగా నున్నదా?

యశో—(గంభీరస్వరముతో) మహాస్థవిరా! మీరీవృద్ధునిపలితకేశములపై నించుకవిశ్వాసముం జూపవలయును. ఆదురాత్ముఁడు ఘోరహంతకుఁ డని నిరూపించుటకుఁ దగినన్ని మహత్తరకారణములును, సంపూర్ణనిదర్శనములును లేకయే యున్నచోఁ బరమపవిత్రం బగునీదేవతామందిరమున సంక్షోభముం గల్పించుట కీయశోధవళుఁ డెంతమాత్రమును సాహసించువాఁడు గాఁడు—వినుఁడు! ఆపాపాత్ముఁ డగు బంధుగుప్తుఁ డీసంఘారామమునం దెందైన దాఁగియున్నచో నిప్పుడే యాతనిం బట్టి మాకొప్పగింపుఁడు! మేము వానిని బంధించి సార్వభౌముని సన్నిధానమునకుఁ దీసికొనిపోవుదుము. అట్లయినచోఁ దురగఖురఘట్టనంబులచే మీపవిత్రక్షేత్రము ధూళిదూషితముగాకయే యుండఁగలదు! శస్త్రాస్త్ర నిర్ఘోషంబులచే మీశాంతారామము సంక్షోభముం గాంచకయే యుండఁగలదు— దారుణవీరాట్టహాసంబులచే మీధర్మభిక్షులకు ధ్యానభంగము గలుగకయే యుండఁగలదు! ఏమని యెదరు? త్వరగా నేదియో యొకమాట చెప్పుఁడు!

బుద్ధ—(వినయముతో) మహానాయకా! ఏమని చెప్పుదును? నేఁడుగాని, నిన్నగాని, సంఘస్థవిరుఁ డగునాబంధుగుప్తుఁ డీసంఘారామమునం దడుగుపెట్టియైన నుండలేదు. నేను సత్యమే చెప్పుచున్నాఁడను. నామాట నమ్ముఁడు! ఇచ్చటనే బంధుగుప్తుని వెదకి పట్టుకొనవ

లయి నను నుద్దేశముతో వచ్చినయెడల మీరు నిశ్చయముగాఁ దప్పు
దోవను బట్టితి రని చెప్పుచున్నాను. మీరిప్పుడు మీ సేనలతో మ
ఱియొక చోటికి—ఆతఁడున్న చోటికిఁ బోయి యన్వేషించినచో బా
గుగ నుండును. ఇచ్చటమాత్రము బంధుగుప్తుఁడు లేఁడు!

యశో—ఆలాగా? అట్లయినచో—అభయమే లేకయున్న చో
మీరీద్వారముల నేలమూయించివైచితిరి?

బుద్ధ—ఆయుధహస్తులగునింతమంది యాశ్వికయోధులం గాం
చి మేము భయపడిపోయితిమి.

యశో—సరే-ఈసమాధానములతో మాకేమియును బని
లేదు. సార్వభౌముని యాజ్ఞానుసారముగా హంతకుఁ డగుబంధుగు
ప్తు నన్వేషించి తీసికొనిపోవుటకై మేమీసంఘారామమునకు వచ్చియు
న్నారము. మమ్ము లోపలికి రానిచ్చుటకిప్పుడు మీయాటంక మేమైన
నున్నదా? చెప్పుఁడు !

బుద్ధ—లేదు— మాయాటంక మెంతమాత్రమును లేదు.
మీరువచ్చి చూచుకొనవచ్చును.

యశో—మంచిది. అట్లయినచో వేగముగాఁ దలుపులను దీ
యుట కాజ్ఞాపింపుఁడు.

తత్క్షణమునందే బుద్ధఘోషునియాజ్ఞానుసారముగా సంఘారామద్వా
రములు తెఱవఁబడియెను. తోడనే యశోధవళుఁడును, యువరాజశ
శాంకుఁడును, హరిగుప్తప్రముఖులును,నైదువందలమందియాశ్వికయో
ధులతోఁగలసి యాసంఘారామమునఁ బ్రవేశించిరి. తక్కిన సైనికులందఱు
నెప్పటివలెనే నలుదెసలను ముట్టడించి యుండిరి. యశోధవళాదు ల
తిజాగరూకులై సంఘారామమం దంతటను మూలలఁగూడఁ బరిశోధిం
చిచూచిరి. కాని బంధుగుప్తునిజాడమాత్రము వారి కెక్కడను గనఁ
బడ లేదు.

ఇంతటిప్రబలప్రయత్నమును నిష్ఫలమైపోయెను. యశోధవళుఁడు తుదకు హతాశుఁడై సేనలను వెంటఁబెట్టుకొని మరల రాజగృహాభిముఖుఁడై వెడలిపోయెను.

ఈసమయమునందే గంగాప్రవాహమధ్యమునుండి యొకచిన్ననౌక యతిత్వరితగమనంబునఁ బూర్వదిశాభిముఖంబుగాఁ దేలిపోవుచుండెను. అందు శత్రుసేనబంధుగుప్తు లిరువురుమాత్రమే కూర్చుండియుండిరి.

బంధుగుప్తుఁడు నిట్టూర్పు విడిచి "మిత్రమా! శత్రుసేనా! మనల నీదినమున నతిభీకరుండగుయశోధవళునిబారినుండి తప్పించినది మనయనేకజన్మార్జితం బగుపుణ్యబలమేసుమీ!" అనియెను.

ఇది
ప్రభాతనామకంబైన
ప్రథమఖండము.



# ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

(1911 వ సంవత్సరములో స్థాపింపఁబడినది.)

పిఠాపురము (తూర్పు) గోదావరిజిల్లా.

నవలలు—నవరసభరితములగు నవలలు—పుణ్యచరిత్రములు-పురాణములు—ముచ్చటైన బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో బైండుతో 250 పుటలకుఁ దక్కువ గాకుండ—రెండుమాసముల కొక్కటిగా వెలువడును.

—* నిబంధనలు *—

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా రు 0—8—0 లు చెల్లింపవలయును.

2. ఇందు రెండేసిమాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతిగ్రంథమును రు 1—0—0 వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుటకగు పోస్టేజి మొదలగు ఖర్చులన్నియును జందాదారులే భరింపవలయును.

4. చందాదారులగువారు వెనుకటి గ్రంథము లన్నియును గొనవలయునను నియమము లేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములుకూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

6. సంవత్సరము చందా అనఁగా ముందు బ్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు 7—2—0 లు ముందుగఁ బంపువారికి ఆఱు పుస్తకములవఱకు ప్రతిపుస్తకమును అన్ రిజిస్టర్డుపార్శిలుగా బంపుచుందుము. అట్లు పంపినవారికి ప్రతిపుస్తకమునకు చెల్లింపవలసినమనిఆర్డరు కమీషను 0—12—0 లును, రిజిష్టరుఖర్చు 0—12—0 లును 1—8—0 లు కూడివచ్చును.

ఇందుఁ బ్రకటింపఁబడి వెలకు సిద్ధముగ నున్న

# గ్రంథములు.

| | | చందాదారుల వెల. | ఇతరుల వెల. |
|---|---|---|---|
| 1. | దుర్గేశనందని. | రు 1-0-0 | 1-5-0 |
| 2. | వసుమతీవసంతము. | 1-0-0 | 1-8-0 |
| 3. | సీతారామ. | 1-0-0 | 1-8-0 |
| 4. | నూర్జహాను. | 1-0-0 | 1-8-0 |
| 5. | మనోరమ. | 1-0-0 | 1-8-0 |
| 6. | మాతృమందిరము. | 1-0-0 | 1-8-0 |
| 7. | నీలాంబరి. | 1-0-0 | 1-8-0 |
| 8. | వీరపూజ. | 1-0-0 | 1-8-0 |
| 9. | మాయావి. | 1-0-0 | 1-8-0 |
| 10. | అపరాజిత. | 1-0-0 | 1-8-0 |
| 11. | పూర్ణానందము. | 1-0-0 | 1-8-0 |
| 12. | శివపురాణము ౧. | 1-0-0 | 1-8-0 |
| 13. | శివపురాణము ౨. | 1-0-0 | 1-8-0 |
| 14. | జీవన్మృతరహస్యము. | 1-0-0 | 1-8-0 |
| 15. | రహస్యవిప్లవము. | 1-0-0 | 1-8-0 |
| 16. | గోరా ౧. | 1-0-0 | 1-8-0 |
| 17. | గోరా ౨. | 1-0-0 | 1-8-0 |
| 18. | జయాపజయములు. | 1-0-0 | 1-8-0 |
| 19. | శ్రీకృష్ణచరిత్రము ౧. | 1-0-0 | 1-8-0 |
| 20. | శ్రీకృష్ణచరిత్రము ౨. | 1-0-0 | 1-8-0 |
| 21. | విషవృక్షము. | 1-0-0 | 1-8-0 |
| 22. | విశ్వప్రియత్నము. | 1-0-0 | 1-8-0 |
| 23. | భారతీభాస్కరము. | 1-0-0 | 1-8-0 |
| 24. | నరేంద్రగుప్తుడు. ౧. | 1-0-0 | 1-8-0 |
| 25. | నరేంద్రగుప్తుడు, ౨. | 1-0-0 | 1-8-0 |

| | | |
|---|---|---|
| 26. కావ్యకుసుమావళి ౧. (పద్యములు.) | 1-0-0 | 1-12-0 |
| 27. కావ్యకుసుమావళి ౨. (పద్యములు.) | 1-0-0 | 1-12-0 |

—* అ ను బం ధ ము లు.*—

| | | |
|---|---|---|
| 28. రాధారాణి. | 0- 4-0 | 0- 6-0 |
| 29. సాధన. | 0-10-0 | 0-12-0 |
| 30. పరిమళ. | 0-12-0 | 1- 0-0 |
| 31. నీరద. | 0-10-0 | 0-12-0 |
| 32. ఆరణ్యక. | 0-10-0 | 0-12-0 |
| 33. మాయావిని. | 0- 8-0 | 0-12-0 |
| 34. రజని. | 0-12-0 | 1- 0-0 |
| 35. భారతవీరుఁడు. | 0-10-0 | 0-12-0 |
| 36. నీతిముక్తావళి. ౧. | 0- 4-0 | 0- 6-0 |
| 37. నీతికథాముక్తావళి. ౧. | 0- 6-0 | 0- 8-0 |
| 38. ప్రణయప్రతిమ. | 0-10-0 | 0-12-0 |
| 39. శకుంతల. | 0-10-0 | 0-12-0 |
| 40. అఘోరుఁడు. | 0-12-0 | 1- 0-0 |
| 41. వీరమహిమ. | 0- 8-0 | 0-10-0 |
| 42. ఏకాంతసేవ. | 0- 6-0 | 0- 8-0 |
| 43. సీతావనవాసము. | 0-10-0 | 0-12-0 |
| 44. హారావళి. ౨. | 0- 3-0 | 0- 4-0 |
| 45. సమస్య. | 0- 2-0 | 0- 3-0 |
| 46. సన్యాసిని. | 0- 2-0 | 0- 3-0 |
| 47. బాలుని వీరత్వము. | 0- 1-0 | 0- 1-0 |
| 48. జాతీయగీతము. | 0- 1-0 | 0- 1-0 |
| 49. సంజీవనము. | 0- 2-0 | 0- 2-6 |
| 50. సురస. (నవల) | 0-12-0 | 1- 0-0 |

| | | | |
|---|---|---|---|
| 51. | బాలవిజ్ఞానమంజరి ౧. | 0- 2-0 | 0- 3-0 |
| 52. | డిటో. ౨. | 0- 3-0 | 0- 4-0 |
| 53. | ప్రభావతి. | 0- 1-0 | 0- 1-0 |
| 54. | ఇదియొక చిత్రము. | 0- 1-0 | 0- 1-0 |
| 55. | అనాధ ప్రేతము. | 0- 1-0 | 0- 1-0 |
| 56. | బ్యారిష్టరు. | 0- 1-0 | 0- 1-0 |
| 57. | కాకము | 0- 1-0 | 0- 1-0 |
| 58. | ప్రేమాంజలి. | 0- 1-0 | 0- 1-0 |
| 59. | తులసీమాహాత్మ్యము. | 0- 4-0 | 0 6-0 |
| 60. | శ్రీరామ రాజనీతి. | 0- 3-0 | 0- 4-0 |
| 61. | చంద్రసేనవిజయము. | 0- 1-6 | 0- 2-0 |
| 62. | పీఠికాపురసంస్థానము. | 0- 1-0 | 0- 1-0 |
| 63. | వీరపత్ని. | 0- 1-0 | 0- 1-0 |
| 64. | విజయదశమి. | 0- 1-0 | 0- 1-0 |
| 65. | సుశీల. | 0. 1-0 | 0- 1-0 |
| 66. | ట్రోజను యుద్ధము. | 0- 4-0 | 0- 6-0 |
| 67. | అహల్యాబాయి. | 0- 8-0 | 0-10-0 |
| 68. | భ్రాంతివిలాసము. | 0-10-0 | 0-12-0 |
| 69. | సీతాదేవి. | 0- 8-0 | 0-10-0 |

మేనేజరు,
ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,
పిఠాపురము, (తూర్పు) గోదావరిజిల్లా.






# ఆంధ్ర నైషధ సారము.

శ్రీనాథకవి వరేణ్యునిచే రచింపఁబడి జగద్విఖ్యాతిగాంచిన శృంగార నైషధమను పద్యకావ్యము ననుసరించి మనోహరమగు శైలియందు వచనమున వ్రాయఁబడి ముద్రింపఁ బడినది. ఈగ్రంథమునందు హంసరాయబారము, నలదూత్యము, దమయంతీ సుశీలత, కలిరాజాగమనము, రాజచేటికల చాతుర్యసంభాషణములు, దంపతులవిహారములు వర్ణనములు, వేయేల! అన్నియు సమంజసముగ వర్ణింపఁబడియున్నవి. ప్రతివారును ముఖ్యముగాఁ జూచి యానందింపఁదగిన గ్రంథరాజము.

వెల రు 0 12 0

# సుగుణమణి.

అద్భుతమగు నవల. కథావిధాన మద్భుతము. పండితులు పత్రికాధిపతులీగ్రంథమును చాలఁగ బొగడియున్నారు. చాలవ్యాపకమునంది యున్నది వెల రు 0 8 0

# పౌండరీక మాహాత్మ్యము.

తెనాలిరామలింగకవిచే రచింపబడిన పాండురంగమాహాత్మ్యమునందలి ముఖ్యకథాభాగంబు ననుసరించి హృదయానందముగూర్చు శైలిని వచనమున వ్రాయబడి ముద్రితమై యున్నది.

వెల రు 0 6 0

చిత్తరంజనదాసుజీవితము 0 8-0; చెఱసాలఅనుభవము మహాత్మాగాంధికృత మునకనువాదము 0-12-0; స్వప్నవాసవదత్త చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే రచియింపఁబడినది 0-8-0.

ఈగ్రంథముల సెట్టు రు 3-0-0.

నైజామునివాసులు గ్రంథమూల్యమును పోష్టుచార్జీలు ముందుగా మనియార్డరుద్వారా పంపవలయును. పైగ్రంథమూల్యములందు తపాలువ్యయములు చేరలేదు.

అత్తలూరి సూర్యనారాయణ.

ఈమని, గుంటూరుజిల్లా.